# రాముడికి సీత ఏమవుతుంది

ఆరుద్ర



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

RAMUDIKI SEETA EMAVUTUNDI? *By:* ARUDRA

ప్రచురణ నెం. : 2268

ప్రతులు : 1000

వి.పి.హెచ్. మొదటి ముద్రణ : డిశంబరు, 1988

రెండవ ముద్రణ : ఫిబ్రవరి, 1990

మూడవ ముద్రణ : ఫిబ్రవరి, 1994

నాల్గవ ముద్రణ : ఫిబ్రవరి, 1998

ఐదవ ముద్రణ : జూన్, 2001



టైటిల్ డిజైను : గోపి

**వెల రూ: 40-00**

ప్రతులకు:

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500 001.

**విశాలాంధ్ర బుక్ హౌస్,**
హైదరాబాదు (అబిడ్స్, సుల్తాన్ బజార్),
విజయవాడ, విశాఖపట్నం, అనంతపురం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, కాకినాడ.

ముద్రణ: Kalanjali Graphics, Hyd-29. Ph: 3229831

నా చేత

ఈ వ్యాసాలు రాయించిన

ఆత్మీయుడు

నండూరి రామమోహనరావు గారికి

ఈ సంకలనం

అంకితం

# సీతమ్మతో ఆరుద్ర!

రాముడికి సీత ఏమవుతుంది? అనేది తెలివితక్కువ ప్రశ్న కాదు. ఈ ప్రశ్నను తరచి, తరచి, సాంగోపాంగంగా చర్చిస్తే, ఎన్నెన్నో రామకథలు బయట పడ్డాయి. ఇన్ని రామాయణాలను చదివి చదివి వాటిలోని వావివరసల్ని విశ్లేషిస్తూ, కేవలం హరిదాసులు చెప్పే రామాయణాన్ని మాత్రమే విశ్వసించి, రామాయణ కథ తరతరాలుగా అనేక మార్పులకు, కూర్పులకు, చేర్పులకు లోనయివస్తూందనే సత్యాన్ని గుర్తించ నిరాకరించే వారికి, రామబాణం లాటి రచన "రాముడికి సీత ఏమవుతుంది?" అనే వ్యాస పరంపర!

రాముడికి సీత ఏమవుతుంది? అనే ప్రశ్నలోనే ఈ సమీక్షలో సీతకు ఎక్కువ ప్రాముఖ్యం వుంది అని వెల్లడి అవుతోంది. రామ కథలన్నింటికీ సీతమ్మ కేంద్ర బిందువు. సీతమ్మవారి జన్మ రహస్యాన్ని బట్టి, తీగలాగితే డొంకంతా కదలినట్టు, రామాయణంలోని వావివరుసల ప్రసక్తి, అందిన కథల మేరకు సవిమర్శకంగా, సాధికారికంగా ఈ వ్యాస పరంపరలో ఆరుద్రగారు చర్చించారు.

రామభక్తులకు, హరిదాసులకు నిజానికిన్ని రామాయణాలు వున్నవనే సంగతికాని, వాల్మీకి ముందు రామకథల్ని అనేకమైన వాటిని, అనేక చోట్ల, అసంఖ్యాక రీతుల్లో గానం చేసేవారనీ, వాల్మీకి రామ కథలను ఏకత్రం చేసిన ఆదికవిగానే కాక, ఆది ఎడిటర్‌గా కూడా ప్రాతః స్మరణీయుడనీ, మారుతున్న సమాజానికి అవసరమైన రీతిలో రామాయణం ఎప్పటికప్పుడు సంస్కరింపబడుతూ వచ్చిందనీ తెలియదు. భక్తికి విశ్వాసంతోగాని, జ్ఞానంతో పనిలేదు. జ్ఞానయోగం కంటె భక్తియోగం గొప్పది. కాని భక్తులయినా, రక్తులయినా భిన్న భిన్న రామాయణాల్లో సీతాదేవి పుట్టుక గురించి ఏమేమి చెప్పారో తెలుసుకోవడం వలన ఆనందంతోపాటు, ఆశ్చర్యంకూడా కలుగుతుందే కాని,

రామాయణంపట్ల, రామకథలపట్ల నిరాదరణకాని, నిరసనకాని ఈ వ్యాసాలు కలుగజేయవని నేను మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను.

ఇది వరకు ఎవరో కొంతమంది పండితులకు మాత్రమే తెలిసిన యీ సంగతులను ఏకత్రంచేసి ఆర్ద్ర పామరజన రంజకంగా, రామాయణం గురించి మనవంటి సామాన్యులకుండే ఆలోచనాపరిధిని విస్తృతం చేశారు. హైందవ సంస్కృతిని, మానవజాతి సముజ్జ్వల చరిత్రలోని మానవీయ, మాననీయ అంశాలను పరంపరాగతంగా జాతికి అందించిన ప్రపంచ మహా కావ్యాలలో రామాయణానిదే అగ్ర తాంబూలం! రామాయణ కథలలోని అనేక అంశాలు వివాదాస్పదమైనవి కావడం రామ కథలలోని వైవిధ్యాన్ని, వైరుధ్యాల్ని సూచిస్తుందేకాని, అవి రామాయణ విశిష్టతను కించపరిచేవికాని, దాన్ని అవమాన పరిచేవికాని ఎంత మాత్రం కావడానికి ఆర్ద్రగారి వ్యాస పరంపరలోని వింతలూ, విడ్డూరాలూ, విశేషాలే సాక్ష్యం. సీత రాముడికి ఏమవుతుంది? అనే ప్రశ్న వలన వుత్పన్నమయే గందరగోళం ఏమయినా వుంటే— అది ఆర్ద్ర కల్పించినది మాత్రం కాదు. అందుకు ఆయన బాధ్యత కూడా లేదు. రామాయణాలలోని "కన్ఫ్యూజన్"ను ఆర్ద్ర వెల్లడించడం యిప్పుడు అవసరమా అనే ప్రశ్నకు, రామాయణాన్ని గురించిన ఆలోచనా పరిధిని విస్తృతం చేయడం మంచిది కదా అని జవాబు చెప్పవచ్చు. శ్రీరాముడు నిజానికి దశరథాత్మజుడు కాడా? "రామాయణం రంకు" అనే సామెత జనం నోటిలో నానుతూ మన విశ్వాసాలను వెక్కిరిస్తోంది. సీత జానకి కాదా? భూమికన్య అని ఎలా వచ్చింది? పురాణాలు, మహాకావ్యాలు, ఇతిహాసాలు- యివి రామాయణంలోని పాత్రల వావివరసలను ఎందుకు మార్చేస్తూ వచ్చాయి. రామాయణం గురించి ఆర్ద్ర వ్యాసాలు చదువుతున్నప్పుడు, ప్రాసంగికంగా హనుమంతుడి పూర్వాపరాలు తెలియడంతోపాటు, మానవ పరిణామచరిత్ర, మానవ నాగరికత చరిత్ర గురించి కూడా చాలా సంగతులు తెలుస్తాయి. ఈ సంపుటిలో ఆర్ద్ర గారు చిక్కుముడిని విప్పుకుంటూ పోయారే కాని, చిక్కులను పేర్చి పీటముడి వేసి సంగతులన్నీ బిగుసుకు పోకుండా "ఓపెన్ డిస్కషన్"

చేశారు. పరిష్వంగం కంటె, గాఢ పరిష్వంగం గొప్పదయినట్టు రామాయణం గురించి మనకు వుండే అవగాహనను ఈ వ్యాసాలు ప్రగాఢం చేస్తాయి.

రాముడు లౌకిక భారాన్ని మోయడం కొరకై లోకహితార్థమై అమ్మవారిని అడవికి పంపాడు. కాని, సీతమ్మ ప్రకృతి భారాన్ని, ప్రకృతి ధర్మాన్ని సాకి, సంరక్షించి, ఫలశ్రుతిని లవకుశుల రూపంలో లోకానికి అందించింది. వాల్మీకి చెప్పిన రామకథను వారూ గానం చేశారు. చివరగా తల్లి కడుపు చలవ వలన 'పుత్రాదిచ్ఛేత్ పరాజయం' అన్న సూక్తికి శ్రీరామప్రభువు అంకితమయ్యాడు. ప్రభువుల శక్తి కంటె, తల్లి మహత్తు గొప్పది. సీత రాముడితో రాజీ పడలేదు. శ్రీరాముడు తన జన్మ వృత్తాంతాన్ని గ్రహించకుండా సీతమ్మను లోకాపవాదానికి విడిచిపెట్టడం సీత క్షమించిందా? సీత ఎటువంటి రాజీకి లొంగలేదు కదా!

ఉత్తర రామాయణం అంతా ప్రక్షిప్తం కావచ్చు. కాని, డ్రామా అంతా వాల్మీకి రాయని రామాయణంలో చేర్చిన మహానుభావులు శతధా వందనీయులు. రామాయణంలోని రంకు అంతా బాలకాండలో వున్నప్పుడు, అది ప్రక్షిప్తమయినపుడు, అది రచయితల రంకే అవుతుంది. కాని రామాయణం అంతా రంకు ఎలా అవుతుంది? ఇది నాకో డవుటు - దీనిని ముందు ముందు ఆరుద్రగారే పరిష్కరించాలి. శక్తులు చాలరు.

*   *   *

ఆరుద్రగారితో నాకు విశాఖపట్నానికి సముద్రంతో వున్నంత పరిచయం వుంది. ఆనందవాణిలో వుద్యోగం మానేసి, కేవలం శ్రీశ్రీ మేనల్లుడిగా వుండకుండా ఆరుద్ర 'త్వమేవాహం' రాస్తున్న కాలం అది. 1947 లో ఆనందవాణి దీపావళి ప్రత్యేక సంచికలో నా తొలి మలి కథానికను అచ్చువేసి, పేరు మార్చి, నన్నో రచయితగా మార్చిన ఘనత కూడా ఆరుద్రదే! అందుచేత ఆరుద్ర వాణీ నా వాణీ కూడా ఆనందవాణే!

ఆరుద్రగారికి ఎవరిమీదా విశ్వాసంలేని తెలుగుదేశం చాలా చాలా ఋణపడివుందని నే ననుకుంటున్నాను.

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా తెలుగువారికి ఆరుద్ర రాసిచ్చిన అత్యాధునిక నిర్వచన కావ్యం 'త్వమేవాహం' మొదటి కారణం.

చక్కని వ్యావహారిక శైలిలో (కవి, చరిత్ర ఎలా రాస్తాడు అనే ప్రశ్నకు జవాబుగా) ఎవరూ భర్తీచేయని లోటును పూర్తిచేస్తూ రాసిన "సమగ్రాంధ్ర సాహిత్యం" రెండోది.

మూడవది — 'కొండగాలి తిరిగింది' వగైరా ఆరుద్ర మార్కు సినిమా పాటలు.

నాలుగవది - ఆయనకు మహాకవి బిరుదుపై కాని, ఏటేటా తాలిమాలు లేక మరిమాలులా కావ్యాలను రాసి వదిలెయ్యడం మీదగాని ఆసక్తి, అనురక్తి, అపేక్ష లేకపోవడం.

వీటన్నిటికన్నా ప్రస్తుతానికి ముఖ్యమైనది - దేశదేశాల రామకథలనూ, రామాయణాలనూ పరామర్శిస్తూ ఆయన సాగించిన ఈ సంపుటిలోని సంచలనాత్మక వ్యాస పరంపర.

సీతారాముల సంబంధ బాంధవ్యాలను పరామర్శిస్తూ వెలువడిన ఈ పరిశోధనాత్మక వ్యాస పరంపర - యావద్భారతదేశంలో మొట్ట మొదటిదే కావచ్చు.

నిజానికి సినిమాల్లో ఆరుద్ర రాసినన్ని రామాయణం పాటలు ఇంకెవరూ ఇంత చక్కగా రాయలేదు. అది తెలుగు సినిమాలు చేసుకున్న పుణ్యం.

రాముని కంటె కూడా రామభక్త హనుమానుణ్ణి విపరీతంగా ప్రేమించి ఆరాధించే తెలుగువారికి, హనుమత మానుదై విజృంభించిన ఆరుద్ర 'రామునికి సీత ఏమవుతుంది?' అనే ప్రశ్నకు చివరిలో యద్భావ్యం తద్భవతి అనే జవాబిచ్చారు.

ఈ వ్యాస సంకలనం తెలుగు సరస్వతికి అపూర్వాలంకారం కాగలదని భావిస్తూ - నమస్కారం. సెలవు!

విజయవాడ

22-4-78

పురాణం సుబ్రహ్మణ్యశర్మ

# ఇదీ వరుస........


| | | పేజి |
|---|---|---|
| రాముడికి సీత ఏమౌతుంది? | .... | 1 |
| బౌద్ధ వాఙ్మయంలో రామకథలు - 1 | .... | 6 |
| బౌద్ధ వాఙ్మయంలో రామకథలు - 2 | .... | 10 |
| ఖోటాన్ రామాయణం | .... | 14 |
| లావోస్‌లోని రామకథలు | .... | 18 |
| సయాంలో రామకీర్తి కావ్యం | .... | 23 |
| మలేషియాలో మండోదరి కథ | .... | 28 |
| "నిప్పులేనిదే పొగరాదు" | .... | 33 |
| "సీత పుట్టుక లంకకు చేటు" | .... | 36 |
| హనుమంతుడు ఎవరి కుమారుడు? - 1 | .... | 40 |
| హనుమంతుడు ఎవరి కుమారుడు? - 2 | .... | 45 |
| హనుమంతుని పుట్టుపూర్వోత్తరాలు | .... | 50 |
| హనుమంతుడు ఎవరి ద్వారపాలకుడు? | .... | 54 |
| జైన గ్రంథాలలో తొలి వావి వరుసలు | .... | 58 |
| జైన వాఙ్మయంలో రామాయణ కావ్యాలు | .... | 64 |
| జైన రామాయణాలలో విరుద్ధ విషయాలు | .... | 69 |
| జైన రామాయణంలో సీతాకల్యాణం | .... | 73 |
| పెట్టెలో దొరికినదెవరు సీతా, కౌసల్యా? | .... | 78 |
| సీత జనకుడేకాదు, జనయిత్రి కూడా బ్రహ్మజ్ఞాని | .... | 83 |
| స్త్రీల రామాయణాలలో చిత్ర విచిత్రాలు | .... | 88 |

| | | పేజి |
|---|---|---|
| సీతకు ఎంతమంది సవతులు? | ... | 93 |
| ఋగ్వేదంలో సీతా రామలక్ష్మణులు | .... | 97 |
| సీతారామాంజనేయులు ఎవరై వుంటారు? | .... | 101 |
| రాముడే బలరాముడు?! | .... | 107 |
| సీత ద్రౌపదిగా పుట్టిందా?! | .... | 112 |
| ఏరువాక పున్నమి సీతాయజ్ఞమా? | .... | 116 |
| "ఇంటికి జ్యేష్ఠ, పొరుగుకు శ్రీమహాలక్ష్మి" | .... | 121 |
| సీతాయాశ్చరితం మహత్ | .... | 125 |
| సంప్రతించిన గ్రంథాలు | .... | 132 |
| ఇంగ్లీషు గ్రంథాలు | .... | 133 |
| తెలుగు గ్రంథాలు | .... | 135 |

— : o : —

# రాముడికి సీత ఏమౌతుంది?

వెనకటికి ఎవరో రామాయణం అంతా విన్నాక "రాముడికి సీత ఏమౌతుం"దని ప్రశ్నించాడట. ఇది సామెతగా నిలిచిపోయింది. అలా ప్రశ్నించిన వాడు వెర్రివాడన్న భ్రాంతి కూడా జనుల్లో వ్యాపించింది. నిజానికి ప్రశ్న వేసిన వాడు వెర్రివాడు కాదు. ఆ ప్రశ్నలో ఎంతో జిజ్ఞాస ఉంది.

రామాయణం కాకపోయినా రామాయణాలన్నీ విన్నాక ఈ ప్రశ్న ప్రతి ఒక్కరిలోనూ ఉదయిస్తుంది. ఇవాళ మన దేశంలోనూ, ప్రపంచం లోను వాల్మీకి రామాయణం విశేష ప్రచారం పొందడంవల్ల అదే మూల రామాయణమని జనులు విశ్వసిస్తారు. కాని, వాల్మీకి రచించడానికి ముందే రామకథలు ప్రచారంలో వుండేవి. ఈ సంగతి వాల్మీకి రామాయణం లోనే వుంది.

ఒకనాడు నారదుడు వాల్మీకి ఆశ్రమానికి వచ్చాడు. అతిథి సేవలు చేశాక వాల్మీకి నారదుణ్ణి ఇలా ప్రశ్నించాడు: ''ఈ లోకంలో ఇప్పుడు గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవచనుడు, దృఢవ్రతుడు, చరిత్రవంతుడు, సర్వభూతహితుడు, విద్యావంతుడు, సమర్థుడు, ఏకప్రియ దర్శనుడు, జితక్రోధుడు, కాంతిమంతుడు, అనసూయాపరుడు, దేవతలనైనా యుద్ధంలో జయించగలవాడు ఎవడైనా ఒకడు ఉన్నాడా?'' వాల్మీకి వేసిన ఈ ప్రశ్నలలోని సుగుణాలన్నీ వున్న వాడు శ్రీరాముడు ఒక్కడే అని నారదుడు రామకథను సంగ్రహంగా చెప్పాడు. వాల్మీకి ఆ కథను విపులంగా తర్వాత రచించాడు.

నారదుడు చెప్పిన రామకథకు మూలం ఏది? అదెక్కడ నుండి వచ్చింది? నారదుడు సహజంగా ప్రజలలో ప్రచారం పొందిన కథనే విని, ఆ కథ తెలియని వాల్మీకికి దానిని చెప్పివుండాలి. నారదుడు చెప్పిన

కథను వాల్మీకి కొంత మార్చి వుండవచ్చు (శకుంతల కథను కాళిదాసు మార్చినట్టు). వాల్మీకి రాస్తున్నది కావ్యం - ఇతిహాసం కాదు, పురాణం కాదు.

పురాణ ఇతిహాసాలలో ప్రక్షిప్తాలను స్వలాభాలకోసం స్వార్థపరులు చేర్చడం మధ్యలో జరిగిందిగాని తొలిరోజుల్లో పురాణాలూ, ఇతిహాసాలూ జనశ్రుతిలో వున్న కథలను ఏం మార్చలేదు. అందుకే ఇతిహాసమైన భారతంలోనూ, పురాణమైన భాగవతంలో కూడా రామోపాఖ్యానాలు వున్నాయి. ఒక్క భాగవత పురాణంలోనే కాదు, అష్టాదశ పురాణాల్లో చాలా పురాణాలు రామకథను చెప్తాయి. పద్మపురాణంలో చాలా విపులంగా మూడు ఖండాల్లో రామాయణగాథ కనబడుతుంది. వాల్మీకి రామాయణంలో లేని విషయాలెన్నో ఇందులో ఉన్నాయి.

అగ్ని పురాణం, కూర్మ పురాణం, దేవీ భాగవతం, బ్రహ్మవైవర్త బ్రహ్మాండ పురాణాలు, మార్కండేయ, శివ పురాణాలు కూడా రామకథను అంతో ఇంతో చెప్తాయి. వీటిలో వాల్మీకంలో లేని విషయాలు కూడా వున్నాయి. ఇవన్నీ ఎక్కడనుంచి వచ్చాయి? పవిత్రమైన గ్రంథాలలో ఎవరూ నోటికొచ్చినవి రాసి చేర్చరు. సంప్రదాయసిద్ధంగా జనులు చెప్పుకొనేవాటినే పురాణ ఇతిహాసాలలో చేర్చడం జరిగి ఉండాలి.

వాల్మీకిలాగే ఇతర ప్రాచీనులు కూడా రామకథను కావ్యాలుగా రాశారు. అద్భుత రామాయణం, అధ్యాత్మ రామాయణం, ఆనంద రామాయణం వంటివి సుప్రసిద్ధాలు. భాసుడి ప్రతిమా నాటకం, కాళిదాసు రఘువంశం, 'భట్టి కావ్యం' అన్న పేరు మీద ప్రసిద్ధమైన భట్టి రాసిన రావణవధ, భవభూతి ఉత్తర రామచరిత్ర, దిఙ్నాగుడి కందమాల మొదలైనవన్నీ రామకథలే. వీటిలో వాల్మీకంలో లేని కల్పనలు ఉన్నాయి. వీరందరూ సీతారాములపై పరిపూర్ణమైన భక్తి ప్రపత్తులు ఉన్నవారే. రామకథమీద గౌరవం గలవారే. ఈ రచయిత లందరికీ వాల్మీకి రామాయణ మొక్కటే మూలం కాకపోవచ్చు.

వాల్మీకికి నారదుడు చెప్పిన రామకథ అప్పటికే జనంలో వ్యాపించి వున్న సంగతి మొదటే చెప్పుకున్నాం. అంతకుముందు ఎన్నో తరాల

పాటుగా అది ప్రచారంలో వుండి వుండాలి. అది పరంపరానుగతంగా, సంప్రదాయ సిద్ధంగా జాతి వారసత్వంలో ఒక భాగమైంది. ఈ వారసత్వానికి వైదిక ధర్మపరాయణులలాగే బౌద్ధులూ, జైనులూ కూడా వారసులే. ఈ మూడు మతాల పూర్వీకులు ఒక్క కుదురులో నుంచి వచ్చినవాళ్ళే.

వైదికుల్లాగే బౌద్ధులూ, జైనులూకూడా రామాయణాన్ని ఉపయోగించుకొన్నారు. బుద్ధుణ్ని వైదికులు దశావతారాల్లో కలుపుకొంటే, రాముణ్ని బౌద్ధులు బుద్ధుడి పూర్వజన్మలో ఒక జన్మగా చెప్పుకొన్నారు.

వైదికులు రాముడిచేత బౌద్ధులను, నాస్తికులను తిట్టిస్తే; జైనులు రావణునిచే హింసాత్మకాలైన యజ్ఞయాగాదులను నాశనం చేయించారు. అహింసను ప్రబోధించారు.

భారతదేశంలోని మూడు ప్రధాన మతాలలోనే కాక, రమారమి అన్ని ప్రధాన భాషలలోనూ రామాయణాలు ఉన్నాయి. ప్రతి దాంట్లోను ఎక్కడో ఒక దగ్గర వాల్మీకంలో లేని ఒకటో అరో విషయం ఉండక పోదు. రాముడిమీద భక్తితోను, రామాయణంపైన గౌరవంతోను రాసిన వాటిలోనే ఈ వాల్మీకాలు ఎందుకు రావాలి? సంప్రదాయాన్ని విస్మరించలేకపోవడంవల్లనే!

మన ప్రాచీన భారతదేశానికి దూర ప్రాచ్యంలోని చాలా దేశాలతో వర్తక వాణిజ్య సంబంధాలు ఉండేవి. మన ప్రాచీనులు మతాన్ని కూడా ఎగుమతి చేశారు. రామకథ ఆసియా ఖండమంతా అలముకొంది. శ్రీలంక, టిబెత్తు, ఖోటాను, మంగోలియా, సైబీరియా, చైనా, జపాను, లావోస్, చంప, కాంబోడియా, థాయ్‌లాండ్, ఇండోనేషియా, మలేషియా, ఫిలిప్పీన్, బర్మా దేశాలలో రామాయణ కథను కొన్నిచోట్ల జానపద గాథలుగా బహుళ ప్రచారంలోను, కొన్నిచోట్ల సాహిత్యంగా గ్రంథస్థమై వున్నాయి. ఈ కథలలో వాల్మీకి రామాయణంలో లేని విషయాలు ఎన్నో ఉన్నాయి. ఈ రామాయణాలన్నీ పరికిస్తే రాముడికి సీత ఏమవుతుందన్న ప్రశ్న రాక మానదు.

బౌద్ధ, జైన రామాయణాలతోపాటు ఈ దేశదేశాల రామాయణాలు సీతారాములపైన గౌరవం కలవే. సీతారాములు ఆరాధ్యులే. అయితే,

వాల్మీకి కన్నా చాలా తరాలు ముందు ప్రచారంలోవున్న కథలు ఎగుమతి కావడంవల్ల వివిధ దేశాల రామాయణాల్లో బౌద్ధ, జైన రామాయణాలలోని అంశాలు కనబడతాయి.

బౌద్ధ రామాయణంలో రాముడికి సీత చెల్లెలు. ఒక్క చెల్లెలు మాత్రమేకాదు, పెళ్ళాంకూడా. ఖోటాన్ రామాయణంలో రామలక్ష్మణుల ఇద్దరికీ భార్య. లావోస్ రామాయణంలో హనుమంతుడు రాముని కొడుకు. మలేషియా రామాయణంలో మండోదరి దశరథుని పెద్ద భార్య. కైకేయి స్థానంలో ఉన్న బాల్యాదారి ఉంపుడుకత్తె మాత్రమే. దశరథుని కొడుకు రావణాసురుని పుత్రికను పెళ్ళాడి రావణుని చంపుతాడు. ఆ పుత్రిక పుత్రకామేష్టిలో పవిత్రమైన ఒక అన్నం ముద్దవల్ల పుట్టినదే. విడ్డూరాలలాగ కనబడే ఈ విభిన్న రామాయణాంశాలను శ్రద్ధగా పరిశీలించాలి.

వైదిక మతాన్ని అపహాస్యం చేయడానికి బౌద్ధులూ, జైనులూ ఈ విడ్డూరాలను సృష్టించారన్న వాదం ఇంతకాలం సాగినా ఇకపైన సాగదు. జైన రామాయణం పైన మంచి వ్యాసం రాసిన సురవరం ప్రతాపరెడ్డిగారి మాటలు మనం జ్ఞాపకం చేసుకొనడం చాలా అవసరం.

"మన మతమునకు విరుద్ధములైన బౌద్ధమతమును, జైన మతమును, చార్వాక లోకాయత కాలవాదుల సిద్ధాంతములను మనము పాషండ మతముల పట్టీలో చేర్చి నాస్తికులనియు, వేద విరుద్ధులు, వేద బాహ్యులు వీరని నిందించియు నుపేక్షభావమును చూపినాము. అట్లిక మీద చేయుట అహంభావ చిహ్నమగును."

సురవరంవారే జైన రామాయణంలో విశ్వసనీయ విషయాలు అనేకం ఉన్నాయని చెప్తూ "వాల్మీకి రామాయణమందు రాముని నాదర్శ పురుషునిగా జేయుటకై యేకపత్నీవ్రతునిగా జేసియుందురు. మరియు రావణుని సర్వ దుర్మార్గునిగా జేయుటకై యితని గుణపోషణమందు చాలా పక్షపాతము చేసి యుందురు. ఇది హిందూమత సంప్రదాయమే కాని ఇలా చేయుట చరిత్రకు నష్టము. విద్వద్వరేణ్యులే జైన రామాయణము నింకను విమర్శించి యథార్థముల నిర్ణయింతురు గాక!" అని తమ ఆకాంక్షను తెలియచేశారు.

విద్వద్వరేణ్యులు ఒక్క జైన రామాయణాన్నేకాక ఇతర దేశాల రామాయణాలనుకూడా విమర్శించారు. వివిధ దేశాల పండితులు వివిధ పత్రికలలో, వివిధ గ్రంథాలలో విభిన్న రామాయణ విశేషాలను వివరించారు. పుసాల్కర్‌గారు భారతీయ పురాణ ఇతిహాసాలపై వ్రాసిన గ్రంథంలో రామకథల వివరాలన్నీ క్రోడీకరించారు. ఆచార్య వి. రాఘవన్‌గారు వివిధ దేశాలలోని రామాయణాలను మన దేశంలోని రామాయణాలను తులనాత్మకంగా పరిశీలించారు. మనకు మహాభారతం లాగ మహా రామాయణం లేదుగానీ, ఆచార్య రాఘవన్‌గారు మహత్తర రామాయణంగా మన రామాయణ సర్వస్వాన్ని గుర్తించారు. వివిధ దేశాల రామాయణాలను మహత్తర భారతదేశంలోని రామాయణం అన్నారు.

ఎందరెందరో విద్వద్వరేణ్యుల పరిశోధనా ఫలితాలను, ఉదతా భక్తిగా నా పరిశోధనా ఫలితాలను మేళవించి, వివిధదేశాల రామాయణ విశేషాలను వ్యాస పరంపరగా పాఠకులకు అందించదలిచాను. ఇది రామాయణ చరిత్రలో సత్యనిర్ణయానికి దోహదకారి కావాలన్న ఒకే ఒక ఆశయంతో చేపట్టిన కార్యం.

# బౌద్ధవాఙ్మయంలో రామకథలు – 1

**వా**ల్మీకి రామాయణాన్నే శ్రీమద్రామాయణం అంటారు. ఇందులో ఆరు కాండలున్నాయి. మొత్తం ఇరవైనాలుగువేల శ్లోకాలున్నాయి. ఈ మహాకావ్యాన్ని చూస్తే శాఖోపశాఖలతో విస్తరించి, ఊడలు వేసిన మహావటవృక్షంలాగ కనబడుతుంది. అయితే ఇప్పుడు ఎంత గొప్ప వృక్షమైనా ఒకప్పుడు చిన్న చెట్టుగా, అంతకుముందు ఒక మొలకగా, దానికి పూర్వం ఒక చిన్న విత్తనంగా ఉండి ఉండాలి. వాల్మీకి రామాయణంలో కథాబీజం ఎక్కడిది? అన్న ప్రశ్న వేసుకొంటే భారతదేశంలో ప్రాచీన గ్రంథాలను వెతకాలి. ఆదిమగాథలు వాటిలో దొరుకుతాయి.

ఎన్నో బౌద్ధ గ్రంథాలు చైనా భాషలో ఉన్నాయి. ఆ భాషలోని బౌద్ధ త్రిపిటక గ్రంథంలో రెండు రామకథలు కనబడతాయి. ఒకటి 'పేరు తెలియని రాజు జాతక కథ', రెండోది 'దశ విలాసాల రాజు నిదానం.' ఈ రెండు రామకథలలో రామాయణ బీజాలు గోచరిస్తాయి. ముందు 'పేరు తెలియని రాజు జాతక కథ' చూద్దాం:

ఒకప్పుడు బోధిసత్త్వుడు ధర్మపరాయణుడైన రాజు. (ఆ రాజు పేరు తెలియదు) అతనికి చాలా క్రూరుడైన మేనమామ ఉండేవాడు. అతడు పక్క రాజ్యం ఏలుతున్నాడు. బోధిసత్త్వుని రాజ్యాన్ని కబళించాలని చూస్తున్నాడు. యుద్ధంలో రక్తపాతానికి, ప్రజాక్షయానికి ఇష్టపడక బోధిసత్త్వుడు రాజ్యాన్ని మంత్రులకు అప్పగించి, తన రాణితోపాటు పర్వత సీమలోని అరణ్యాలకు వెళ్ళిపోయాడు. క్రూరుడైన మేనమామ రాజ్యాన్ని చేజిక్కించుకొని ప్రజలను పీడించసాగాడు.

అరణ్యంలో ఒక దుర్మార్గుడైన నాగుడు వున్నాడు. రాణిమీద వాడి కన్ను పడింది. వాడు ఒక మునివేషం వేసుకొని వచ్చాడు. బోధిసత్త్వుడికి

సపర్యలు చేస్తున్నట్టు నటించసాగాడు. ఒకనాడు బోధిసత్త్వుడు ఎక్కడకో కొద్దిదూరం వెళ్ళాడు. ఆ అదనులో నాగుడు రాణిని అపహరించి, సన్నని కొండ కనుమద్వారా ఆమెతో పారిపోయాడు. అక్కడ ఒక పెద్దపక్షి తన రెక్కలు చాచి దారికడ్డం వచ్చింది. నాగుడితో పోరాడింది. ఎట్టకేలకు నాగుడు రాణితోబాటు సముద్ర ప్రాంతానికి పారిపోయాడు.

బోధిసత్త్వుడు తిరిగి వచ్చాడు. తన భార్య కనబడలేదు. ఆమె కోసం అన్వేషణ మొదలుపెట్టాడు. ఒక వాగు వెంబడి నడిచి వెళ్ళాడు. అలా వెళ్ళగా వెళ్ళగా చాల దుఃఖంలో ఉన్న ఒక వానరుడు కనిపించాడు. ఆ వానరుడికి కూడా ఒక మేనమామ ఉన్నాడు. ఆ మేనమామ వానరుడి స్థానాన్ని అపహరించాడు. అందుకే ఆ దుఃఖం. బోధిసత్త్వుడూ, వానరుడూ సఖ్యం నెరపుకొని పరస్పర సహాయం చేసుకొందామనుకొన్నారు.

వానరుడు తన మేనమామతో పోరాడాడు. మేనమామ పారిపోయాడు. వానరుడు తన పరివారాన్ని బోధిసత్త్వుడి భార్యను అన్వేషించమని పంపాడు. వాళ్ళు ఒక రెక్కలు విరిగిన పక్షిని దారిలో కలుసుకున్నారు. ఆ పక్షే ఒక నాగుడు రాణిని తీసుకొని పారిపోయాడనీ, సముద్రమధ్యాన ఒక లంకలో వున్నాడని వానరసేనకు చెప్పింది. బోధిసత్త్వుడూ, వానరరాజూ, అతని పరివారం సముద్రతీరానికి చేరుకొన్నారు. శక్రుడు వానరరూపంలో వచ్చాడు ఆ శక్రకపి పర్యవేక్షణలోనే రాళ్ళతో సేతువు కట్టారు.

బోధిసత్త్వుడూ, వానరులూ లంకను ముట్టడించారు. నాగుడు విషవాయువులు ప్రయోగించాడు. బోధిసత్త్వుడూ, వానరులూ మూర్ఛపోయారు. శక్రకపి వాళ్ళకి వైద్యం చేశాడు. నాగుడు ఎన్నో మాయ విద్యలు ప్రయోగించాడు. కాని శక్రకపి సహాయంవల్ల బోధిసత్త్వుడు నాగుణ్ణి బాణాలతో కొట్టాడు. నాగుడు మరణించాడు.

శక్రకపి నాగపురంలో ప్రవేశించి రాణిని విడిపించాడు. అందరూ వారివారి ప్రదేశాలకు ఆనందంగా వెళ్ళిపోయారు. బోధిసత్త్వుడు తన

రాజ్యానికి చేరుకునే నాటికి క్రూరుడయిన మేనమామ మరణించాడు. ప్రజలు చాలా సంతోషించగా బోధిసత్త్వుడు తన రాజ్యాన్ని చేపట్టాడు.

'ఒక్క మాత్రయినా స్త్రీ విడిగా గడిపితే ప్రజలు అనుమానిస్తారు. అటువంటిది నువ్వు చాలాకాలం నీ భర్త నుంచి దూరమయ్యావు.' అని బోధిసత్త్వుడు తన భార్యతో చెప్పాడు. ఆమె తన మాటలలో సత్య ముంటే భూమి చీలిపోతుందని చెప్పింది. భూమి చీలింది. బోధిసత్త్వునికి విశ్వాసం కుదిరింది.

అటు పిమ్మట రాజ్యమంతటా వర్తకులు తమ లాభాలను తగ్గించు కున్నారు యోధులు తమ ఉన్నత పదవులు విస్మరించారు. వృద్ధులు హీనులపట్ల దయ చూపించేవారు. బలవంతులు బలహీనులను బాధించడం లేదు.

దుశ్శీలలైన స్త్రీలు తమ ప్రవర్తన మార్చుకొన్నారు. తమ ప్రాణా లకు అపాయం వాటిల్లినా సౌశీల్యాన్ని ఆచరించసాగారు. ఇవన్నీ బోధి సత్త్వుని ప్రభావంవల్లనే జరిగాయి.

ఇదీ 'పేరు తెలియని రాజు జాతక కథ'. ఇందులో రామకథ మరీ బీజప్రాయంగా ఉంది. ఆనాటి సమాజంలో మాతృస్వామ్యం ఉన్నట్లు కనబడుతుంది. తల్లి పెత్తనంగల సమాజంలోనే మేనమామకు అధికారాలు ఉంటాయి. బోధిసత్త్వుడే కాక వానరరాజుకు కూడా మేనమామ వల్లనే బాధలు కలగడం విచారించతగ్గ విషయం ఈ జాతక కథ చైనాభాష లోనేగాని పాళీభాషలో కనబడదు.

ఈ 'పేరు తెలియని రాజు జాతక కథ'లో లక్ష్మణ భరత శత్రు ఘ్నులు లేరు. హనుమంతుడూ, అంగదుడూ, వాలీ మొదలైనవాళ్ళుకూడా లేరు. అయితే కొన్ని వాల్మీకి రామాయణ ఘట్టాలకు బీజాలుగా రావణుడు యతి వేషంలో రావడం, రాముడు లేని వేళ సీతను అపహరించడం, జటాయువు వారించడం, సుగ్రీవుడితో సఖ్యం, వానరసేనకు సంపాతి సీత జాడ చెప్పడం, సేతు బంధనం, రాక్షసుల్ల మాయాయుద్ధాలు మొదలైనవి వున్నాయి.

ఈ జాతక కథలోని ఇంకో విశేషం, శక్రకపి. హనుమంతుడు, నలుడు, సుషేణుడు మొదలైనవాళ్ళ పనులన్నీ ఈ శక్రకపే చేస్తాడు, ఋగ్వేదంలో ఇంద్రుడికి ప్రాముఖ్యం వహిస్తున్న రోజుల్లో ప్రాచీన గ్రామ కథకు ఇంద్రుణ్ని జోడించినట్టు కనపడుతుంది. శక్రుడు పితృస్వామ్య దేవత. ఆ దేవత సహాయం లేనిదే మాతృస్వామ్యంలోని వ్యక్తులు జయించలేరన్న సత్యాన్ని ప్రచారం చేయడానికి శక్రుణ్ని తీసుకొచ్చి ఇందులో కలిపి ఉండవచ్చు.

బోధిసత్వుడికి పెళ్ళి కాక ముందు భార్యతో ఎటువంటి చుట్టరికమో ఈ జాతక కథవల్ల తెలియదు. ఆ బాంధవ్యాన్ని పాళీ భాషలో వున్న 'దశరథ జాతకం' తెలియజేస్తుంది.

# బౌద్ధవాఙ్మయంలో రామకథలు—2

బౌద్ధులు జాతక కథలను గ్రంథాలకు ఎక్కించే కాలానికి రాముడు ఆదర్శపురుషుడిగా ప్రచారం పొందాడు. ఆ రాముడింకెవరో కాదు-పూర్వజన్మలో మా బుద్ధుడే అని బౌద్ధులు చెప్పుకోవడానికి ఒక జాతక కథను విరచించారు. జాతక కథలో ఒక ప్రస్తుత కథకు మరొక పాత కథ జోడించడం సంప్రదాయం. బుద్ధుడు జేతవనంలో విహరించేటప్పుడు ఒక గృహస్థుడు పితృశోకంవల్ల చాలా దుఃఖిస్తున్నాడు. అష్టాంగ యోగాలవల్ల పండితులు పితృ శోకానికి దుఃఖించరని బుద్ధుడు 'దశరథ జాతకం' అనే కథను ఆ గృహస్థుడికి చెప్పాడు.

పూర్వం దశరథుడు వారణాసిని పాలిస్తూ ఉండేవాడు. అతనికి పదహారువేలమంది భార్యలు. అందులో పట్టపురాణికి ఇద్దరు కొడుకులూ, ఒక కూతురూ పుట్టారు. పెద్దకొడుకు పేరు రామ పండితుడు, చిన్న కొడుకు పేరు లక్ష్మణ పండితుడు. కుమార్తె పేరు సీతాదేవి. కొంత కాలానికి పట్టపుదేవి కాలం చేసింది. దశరథుడు తర్వాత ఇంకొక రాణిని పట్టపు రాణీగా చేసుకొన్నాడు. ఆవిడంటే రాజుకు ఎంతో ఇష్టం. ఆ రాణి గర్భవతి అయింది. ఒక కొడుకును కన్నది. ఆ బిడ్డ పేరు భరతుడు. పుత్రోత్సాహంలో రాజు రాణికి ఒక వరం ఇస్తానన్నాడు. కోరుకోమన్నాడు. తరువాత కోరుకొంటానంది. భరతుడికి ఏడేళ్లు వచ్చాక రాణి రాజు దగ్గరకు వెళ్ళింది. తన బిడ్డకు రాజ్యం ఇమ్మని వరం కోరుకొంది. దశరథుడు ఆగ్రహించాడు. రాణిని తిట్టాడు. వరం ఇవ్వలేదు. ఆమె అలిగి పడకటిల్లుచేరి పడుకొంది. సవతి తల్లి రామలక్ష్మణులను చంపించేస్తుందేమో అన్న భయం రాజుకు కలిగింది. స్త్రీలు ఎంతటి ద్రోహమైనా తలపెడతారు అనుకున్నాడు. రాజు రామలక్ష్మణులను

పిలిచాడు. 'మీరిక్కడ వుంటే అపాయం రావచ్చు. మీ పినతల్లి బారినుండి మీరు సురక్షితంగా ఉండాలంటే ఏదో సామంత రాజ్యాలలోగాని, అరణ్యంలోగాని మీరు జీవించాలి. నేను పోయాక రాజ్యానికి వచ్చి మీ వారసత్వమైన రాజ్యాన్ని మీరు తీసుకోవచ్చు' అని చెప్పాడు. రామ లక్ష్మణులు 'సరే' అన్నారు.

దశరథుడు జ్యోతిష్కులను పిలిచి తాను ఎంతకాలం బతుకుతానో చెప్పమన్నాడు. వాళ్ళు పన్నెండేళ్ళని చెప్పారు. రాజు, రామ లక్ష్మణులతో ఆ పన్నెండేళ్ళూ వనవాసం చేయమన్నాడు. వాళ్ళు తండ్రికి నమస్కరించి నగరం బయటకు వచ్చారు. 'నేనూ అన్నలతోబాటు వెళ్తాను' అని సీతాదేవి వాళ్ళను అనుసరించింది. ముగ్గురూ హిమాలయాలకు వెళ్ళి అక్కడ ఆశ్రమం కట్టుకొని కాపురం చేస్తున్నారు.

దశరథుడు పుత్రశోకం చేత తొమ్మిదేళ్ళకే మరణించాడు. అనంతర రాజ్యాధిపతి అరణ్యంలో వున్నాడు అని మంత్రులు భరతుని పట్టాభిషేకానికి అడ్డంకులు పెట్టారు. భరతుడు తానే స్వయంగా వెళ్ళి రామ పండితుణ్ని తీసుకువస్తాను అని చెప్పాడు. వెళ్ళి రాముణ్ని కలుసుకున్నాడు. తండ్రి మరణవార్తను చెప్పాడు. రామపండితుడు చింతించలేదు, చలించలేదు. ఆ సమయంలో సీతా లక్ష్మణులు అక్కడ లేరు. కందమూలాల కోసం వెళ్ళారు వాళ్ళు ఆశ్రమానికి రాగానే రామ పండితుడు వాళ్ళను ఏటిలో స్నానం చేయమన్నాడు. వాళ్ళు నీటిలో దిగగానే తండ్రి మరణవార్తను వాళ్ళకు చెప్పాడు. సీతాలక్ష్మణులు ముమ్మారు మూర్ఛపోయారు. రామపండితుడు వాళ్ళకు హితబోధ చేశాడు. ఉదయాన కనబడేవాళ్ళు సందెవేళకు వుండరు. సందెవేళకు కనబడేవాళ్ళు తెల్లారితే ఉండరు. పోయినవాళ్ళ కోసం దుఃఖించకూడదని చెప్పాడు.

భరతుడు రామపండితుడిని రాజ్యస్వీకారం చేయమన్నాడు. లక్ష్మణ పండితుడిని, సీతను తీసికొని వెళ్ళి రాజ్యం చేయమని రామ పండితుడు భరతునితో చెప్పాడు. 'మరి నీ సంగతో?' అని భరతుడు అడిగాడు. "నాన్నగారు పన్నెండేళ్ళు నన్ను అడవిలో వుండమన్నారు. ఇప్పటికి తొమ్మిదేళ్ళే అయ్యాయి. మిగిలిన మూడేళ్ళూ అరణ్యంలోనే.

గడిపి, ఆ తరువాతనే రాజ్యానికి వస్తాను. అంతవరకూ నా తృణపాదుకలే రాజ్యాన్ని పాలిస్తాయి" అని రామపండితుడు అన్నాడు. భరతుడు రాముడి తృణ పాదుకలను తీసుకొని సీతా లక్ష్మణులతో రాజ్యానికి వెళ్ళాడు.

తృణపాదుకలను సింహాసనంపై నిలిపి పరిపాలన సాగించారు. వాటి సమక్షంలోనే తీర్పులు ఇచ్చేవారు. ఆ తీర్పు సక్రమంగా ఉండక పోతే పాదుకలు తమలో తాము కొట్లాడుకునేవి. తీర్పు సరిగ్గా ఉంటే శాంతంగా ఉండేవి. మూడు సంవత్సరాల తరువాత రామ పండితుడు స్వదేశానికి తిరిగి వచ్చాడు. సీతను పట్టపురాణిని చేసి రాజ్యాన్ని రామ పండితునికి అప్పగించాడు. రాముడు ధర్మానుసారంగా పదహారు వేల సంవత్సరాలు రాజ్యం చేశాడు.

ఈ 'దశరథ జాతక' కథను బుద్ధుడు గృహస్థుడికి చెప్పి పూర్వ జన్మలో దశరథుడు శుద్ధోదనుడని, సీత రాహులమాత అని, రామ పండితుడు తానే అని చెప్పాడు. అనగా పూర్వజన్మలో చెల్లెలు, పెళ్ళాము అయిన సీతే ఈ జన్మలో భార్య అన్నమాట. పితృవాక్య పరిపాలనతో పాటు బంధు వియోగానికి పరితపించ కూడదన్న ప్రబోధం కోసం ఈ జాతక కథ జన్మించింది.

ఈ కథలో పితృ కన్యలను వివాహమాడే అత్యంత ప్రాచీనమైన ఆచారం కనబడుతోంది. ఏకోదరులైనా అన్నా చెల్లెళ్ళు పెళ్ళి చేసుకోవడం ఈజిప్టు దేశంలో ఉండేది. ఆ దేశపు నాగరికత చాలా ప్రాచీనం. ఆ ఆచారం కూడా అంత ప్రాచీనమే. దశరథ జాతకంలోని రామకథ అంతటి పురాతన కాలానికి సంబంధించినదన్న సంగతి ఇందువల్ల స్పష్టమవుతుంది.

వేదకాలంలో కూడా పితృకన్యల వివాహాలకు సాక్ష్యాలున్నాయి. యమ, యమి ఏకోదరులు కామసంబంధంగల జంట. యమ అన్న పదానికి జంట అన్న అర్థం కూడా ఏర్పడింది. మరీ అత్యంత ప్రాచీన కాలంనాటి సంప్రదాయాన్ని యథాతథంగా దశరథ జాతకం కథనం చేసింది. బుద్ధుని కాలానికి పితృకన్యలతో పెళ్ళి అనే ఆచారం

అడుగంటింది. అయినా ప్రాచీన గాథను మార్చకుండా బౌద్ధులు కథనం చేశారంటే వాళ్ళ సత్యనిరతిని మెచ్చుకోవాలి. మన కాలంనాటి ఆచార వ్యవహారాలకు, నైతిక విలువలకు అనుకూలంగా పురాణాలను దిద్దేయడం మన మానసిక దౌర్బల్యాన్ని సూచిస్తుంది.

మన పూర్వీకుల పూర్వీకులు విడ్డూరమైన ఆచారాలను పాటిస్తే వాటిని తెలుసుకోనాలని ఈనాడు అత్యున్నత నాగరికతగల దేశాల్లోని ప్రజలు పూర్వీకులు సైతం ఒకనాడు అనాగరికులే. ఇవాళ మనకి జుగుప్స కలిగించే పెళ్ళి పద్ధతులను పాటించేవారు. అన్నా చెల్లెళ్ళ వివాహాన్ని దశరథ జాతకం కథనం చేస్తే, అన్నదమ్ములిద్దరూ ఒకే భార్యతో కాపురంచేసే ఆచారాన్ని బౌద్ధ ప్రభావంగల మరొక రామకథ చెప్తుంది. అది ఖోటాన్ రామాయణం.

# ఖోటాన్ రామాయణం

ఖోటాన్ చైనా దేశంలో వుంది. తిబెత్తుకు సమీపమే. ఇక్కడి రామాయణ కథ బౌద్ధ జాతక కథలాగ వుంటుంది.

దశరథుడు సమర విజయుడైన రాజు. అతడికి సహస్రబాహుడనే వీరపుత్రు డున్నాడు. సహస్రబాహుడు ఒకనాడు అడవిలో వేటకు వెళ్ళాడు. అక్కడ ఒక బ్రాహ్మణుడు తపస్సు చేసుకొంటున్నాడు. అతని దగ్గర చింతామణి, కామధేనువూ ఉన్నాయి. అవి కోరికలు తీరుస్తాయి. వాటి ప్రభావంవల్ల బ్రాహ్మణుడు రాజుకూ, అతని పరివారానికి విందు చేశాడు. సహస్రబాహుడు కామధేనువును అడిగాడు. దానిని తన పరివారంచేత తోలించుకొనిపోయాడు. ఆ బ్రాహ్మణుడికి పరశురాముడనే కొడుకున్నాడు. అతడు తపస్సుచేసి పరశువును సంపాదించాడు. పరశు రాముడు సహస్రబాహుణ్ణి సంహరించాడు.

సహస్రబాహుడికి రైస్మణుడు, రాముడు అని ఇద్దరు కుమారులు. వాళ్ళ తల్లి ఆ ఇద్దరిని దాచేసింది. పన్నెండేళ్ళ తరువాత ఆ కుమారులు బయటకు వచ్చారు. రైస్మణుడు కోశరక్షణలో నిపుణుడు. రాముడు అస్త్రవిద్యాపారంగతుడు. ఈ అన్నదమ్ములకు తమ తండ్రి పరశురాముడి చేతిలో మరణించిన సంగతి తెలిసింది. వెంటనే ఇద్దరూ బయలుదేరి కొండలమీద ఉన్న పరశురాముణ్ణి పట్టి, బంధించి, వధించారు. పరశు రాముణ్ణేకాక, పద్దెనిమిది లక్షల మంది బ్రాహ్మణులను కూడా సంహరించారు.

ఇది ఇలా వుండగా, దశగ్రీవుడనే ఒక రాక్షసుడున్నాడు. అతనికి తన కూతురువల్ల మరణం రాసిపెట్టి వుంది. అతని రాణి ఒక పుత్రికను కన్నది. జ్యోతిష్కుల సలహావల్ల దశగ్రీవుడు ఆ బిడ్డను ఒక పెట్టెలో పెట్టి నదిలో పారవేశాడు. ఒక ఋషికి ఆ పెట్టె దొరికింది.

అతడు ఆ బిడ్డను పెంచాడు. ఒక ఆరామంలో ఒక గిరి గీసి అందులో వుంచాడు. పక్షులు సైతం ఆ గిరి దాటి ఆ బిడ్డను సమీపించలేవు. ఒక పెద్ద రాబందు ఆ బిడ్డను సర్వదా సంరక్షిస్తూ ఉంటుంది. ఈమె పేరు సీత.

రైస్మణుడూ, రాముడూ సీతను చూశారు. ఇద్దరూ మోహితులయ్యారు. ఆమెను మొదట సమీపించలేకపోయారు. తరువాత ఇద్దరూ ఆమెకు సపర్యలు ఒకరి తర్వాత ఒకరు చేయసాగారు. నూరు కన్నుల లేడి ఒకటి అక్కడకు వచ్చింది. అన్నదమ్ములిద్దరూ దాని వెంట వెళ్ళారు. దశగ్రీవుడు ఆకాశం నుంచి దిగివచ్చాడు. భిక్ష అర్థించాడు. గిరి దాటలేకపోయాడు. రాబందు అతనితో పోరాడింది. దశగ్రీవుడు ఆ పక్షి ముందు నెత్తురుతో ఎర్రబడిన తగరపు ముద్దలు పడవేశాడు. వాటిని తిని పక్షి మరణించింది. దశగ్రీవుడు సీతను ఎత్తుకుపోయాడు.

రైస్మణుడు, రాముడు తిరిగివచ్చారు. సీత కనబడలేదు. శోకతప్తులయ్యారు. జంబుద్వీప మంతా సీతకోసం గాలించారు. వానర భూమికి వచ్చారు. అక్కడ ఒక ముసలికోతి కళ్ళుమూసుకొని కూర్చొని వుంది. ఆ వానరుడు అంత వృద్ధాప్యంలోనూ ఇంకా బలమున్నవాడు. రైస్మణుడూ, రాముడూ ఆ బలానికి భయపడి, సిగ్గుపడి వెళ్ళిపోయారు. ఇద్దరు చెరొక దిక్కునా వెళ్ళి సీతకోసం అన్వేషించారు.

పన్నెండేళ్ళు ఇలా వెతికి వెతికి ఆ అన్నదమ్ములు ఒక నువ్వుల చేనులో కలుసుకున్నారు. ఇద్దరూ కలసి కూర్చొని "చింతామణి" కోసం దుఃఖించారు. ఆ తరువాత సోదరులు, ఇద్దరు వానరులు తమలో తామ్ము దెబ్బలాడుకొనడం చూశారు. ఆ వానరులు తండ్రి రాజ్యంకోసం పోరాడుకొంటున్నారు. వీళ్ళలో ఒకడి పేరు సుగ్రీవుడు, రెండోవాడు పేరు నందుడు. రాముడు నందుడికి సహాయం చేశాడు. నందుడి తోకకు ఒక అద్దం కట్టుకోమని చెప్పాడు. తేడా తెలిశాక సుగ్రీవుణ్ణి సంహరించి, నందుడికి రాజ్యం ఇచ్చాడు.

సీతను అన్వేషించడానికి నందుడు వానరులను పంపాడు. వారం రోజులు గడువు పెట్టాడు. విఫలులై తిరిగివస్తే కళ్ళు పీకించేస్తానన్నాడు. ఆరు రోజుల దాకా వానరులకు సీత వర్తమానం తెలియలేదు.

ఆరో రోజున ''లపూస'' అనే ఆడ కోతి ఓక ఆడ కాకీ, దాని పిల్లలూ మాట్లాడుకోవడం విన్నది. పిల్లకాకులు ఆకలేస్తున్నాయన్నాయి. "కొంచెం ఓపిక పట్టండి. దశగ్రీవుడు సీతను ఎత్తుకుపోయాడు. వానరులకు ఈ సంగతి తెలియదు. రేపు ఎలాగు నందుడు వాళ్ళను చంపించి వేస్తాడు. మీకు కోతి మాంసంతో విందు చేస్తాను" అని తల్లికాకి చెప్పింది. ఈ సంభాషణ విన్న లపూస అన్వేషిస్తున్న వానరుల వద్దకు వెళ్ళింది. వాళ్ళని ఏడిపించి ముప్పతిప్పలు పెట్టింది. ఒక మగకోతి దానిని ఎలాగో వంచించి, సీత వర్తమానం తెలుసుకొంది. వానరులు సీత జాడలు లక్ష్మణుడికీ, రాముడికీ చెప్పారు. సోదరులు వానరసేనతో కదిలారు.

నందుడికి ఒక వరం వుంది. అతని చేతులతో నీళ్ళమీద పారేసిన రాళ్ళు తేలుతాయి. నందుడు వారధి కట్టాడు. దశగ్రీవుడి పురాన్ని వానరసేనతో చేరుకొన్నారు. కోతులు పారిపోకుండా వారధిని వెంటనే నాశనం చేశారు.

వానరసేన చేస్తున్న గోలను దశగ్రీవుడు విన్నాడు. ఆగ్రహించాడు. అతని మంత్రులు ఇద్దరూ హితోపదేశం చేశారు. జంబూ ద్వీపపు కథలు ఎన్నో చెప్పారు. స్త్రీవల్ల చెడిపోయినవాళ్ళ జీవితాలు వివరించారు. దశగ్రీవుడు వాళ్ళ హితబోధ చెవిని పెట్టలేదు. ఆ మంత్రులిద్దరూ దశగ్రీవున్ని విడిచిపెట్టి జంబూ ద్వీపవాసులతో చేరారు. జంబూ ద్వీపవాసులు లంకాపురంలో ప్రవేశించారు.

దశగ్రీవుడు నిష్ఠలో వున్నాడు. ఉపవాసం చేస్తూ, ఆరాధనలు చేస్తూ యుద్ధ ప్రయత్న దీక్షలో వున్నాడు. నందుడు ఆ తపస్సును చెడగొట్టడానికి అంతఃపురంలో చేరి దశగ్రీవుని భార్యతో సంభాషించాడు.

దశగ్రీవుడు ఆకాశానికి ఎగిరాడు. సముద్రంలోంచి ఒక విషసర్పాన్ని తీసి సేనపై ప్రయోగించాడు. నాగాస్త్రంవల్ల రాముడు మూర్ఛపోయాడు. నందుడు అమృత సంజీవమూలికకోసం హిమవత్పర్వతానికి వెళ్ళాడు. పేరు మరచిపోయి కొండనే కొంత పెకలించుకొని వచ్చాడు. రాముడు స్వస్థుడయ్యాడు. దశగ్రీవుడు మళ్ళీ ఆకాశంలో కనిపించాడు. ఈసారి సీత అతని బాహువుల్లో ఉంది. రాముడు మళ్ళీ మూర్ఛపోయాడు.

దశగ్రీవుడి జాతకాన్ని చూశారు. అతని ఆయుప్పట్టు కాలిబొటన వ్రేలులో ఉంది. రాముడు దశగ్రీవున్ని ఆబొటనవ్రేళ్ళు చూపించమన్నాడు. దశగ్రీవుడు చూపించాడు. రాముడు బాణం వేశాడు. దశగ్రీవుడు పడిపోయాడు. ఆతణ్ణి బంధించారు. దశగ్రీవుడు లొంగిపోయాడు. కప్పం కట్టడానికి అంగీకరించాడు. అందుచేత దశగ్రీవుణ్ణి వధించలేదు.

ఈ విషయం తరువాత రైస్మణుడు, రాముడు సీతతో నూరేళ్ళు జీవించారు. ప్రజలు అసంతృప్తులయ్యారని రాముడు విచారించాడు. రైస్మణుడు ప్రజలకు కానుకలు ఇచ్చి తృప్తిపరచ చూశాడు. ప్రజల అపహాస్యాలకు తానే బాధ్యురాలు కనుక సీత భూగర్భంలోకి ప్రవేశించడానికి నిశ్చయించుకొంది. రైస్మణుడూ, రాముడూ తమమీద తమ సైన్యంపైన తిరగబడిన సముద్రంలో నాగులను ఓడించి జంబూ ద్వీపానికి తిరిగి వచ్చాడు.

అన్ని జాతక కథలలోలాగే ఈ కథ చివర బుద్ధుడు పూర్వ జన్మలో తానే రైస్మణుడిననీ, మైత్రేయుడు రాముడనీ చెప్తాడు. శాక్యమునే రైస్మణుడు కాబట్టి ఖోటాన్ రామాయణంలో అన్నదమ్ముల పేర్లలో ముందెప్పుడూ రైస్మణుడి పేరే వస్తుంది. తరవాతనే రాముడి పేరు.

ఈ ఖోటాన్ రామాయణం క్రీస్తు శకం తొమ్మిదో శతాబ్దానికే ప్రచారంలో ఉంది.

# లావోస్‌లోని రామకథలు

ఖోటాను రామాయణంలో అన్నదమ్ములిద్దరూ ఒకే ఆలుతో కాపురం చేసే ఆచారం కనబడుతుంది. అయితే ఆమె వాళ్ళ చెల్లెలు కాదు. దశరథ జాతకంలో సీత రాముడికి చెల్లెలే కాక పట్టమహిషి. మరొక బౌద్ధ ప్రభావంకల రామకథలో రామలక్ష్మణులిద్దరూ అన్నదమ్ములే. సీత వాళ్ళ చెల్లెలే, అయితే ఆమె రావణుని భార్య.

ఈ బౌద్ధ ప్రభావంగల రామ కథ పేరు రామ జాతకం. ఇది లావోస్‌లో ప్రచారమయింది. దీని ప్రకారం దశరథుడు, విరులహుడు అన్నదమ్ములు. పెద్దవాడు దశరథుడు బలహీనుడు, అందుచేత రాజ్యం అతనికి చెందలేదు. రెండవవాడు విరులహుడు. ఇంద్రప్రస్థపురానికి రాజయ్యాడు. దశరథుడు అరణ్యాలు పట్టిపోయాడు. ఆ అడవుల్లోనే రెండు రాజధానులు కట్టుకొన్నాడు, విరులహుడి కుమారుడు రావణాసౌనుడు దశరథుడి రాజ్యానికి వచ్చి, అతని కూతురు శాంతను ఎత్తుకు పోయాడు.

శాంతకు ఇద్దరు అన్నలున్నారు. వాళ్లు రామలక్ష్మణులే. వాళ్ళు తమ కుటుంబానికి జరిగిన అవమానానికి పగతీర్చుకోడానికి బయల్దేరారు. ఇంద్రప్రస్థపురాన్ని 'చేరుకొనేలోగా ఈ అన్నదమ్ములిద్దరూ ఎన్నో సాహస కార్యాలు చేశారు. జానపద చిత్రాలలోని నాయకుల్లాగా దారి పొడుగునా పెళ్ళిళ్ళు చేసుకున్నారు. చివరకు వాళ్ళు ఇంద్రప్రస్థం చేరుకున్నారు. రావణాసౌనుడితో రాపడ్డారు. శాంతను రాజీవణుడు పెళ్ళి చేసుకున్నాడు.

ఇది లావోస్ ''రామ జాతకం''లో ప్రథమభాగం. ఇందులో పితృ కన్యల వివాహంపట్ల సంఘంలో వచ్చిన మార్పు వ్యక్తమవుతుంది. ఏకోదరులైన అన్నాచెల్లెళ్ళ వివాహాలు నిషేధమయ్యాయి. కాని పినతండ్రి పెత్తండ్రి పిల్లలయితే నిరాక్షేపణీయంగా పెండ్లాడవచ్చు. ఈజిప్టు దేశం

లోని ప్రాచీన ఆచారం పరిణామం చెంది ఈనాటి ముస్లిం ఆచారంగా ఎలాగ రూపొందినదీ దశరథ - రామ జాతకాలలోని పరిణామాలవల్ల తెలుసుకో వచ్చును.

దశరథ జాతకంలోని సీత, రామజాతకంలో శాంత అయింది. దశరథ జాతకంలో సీతాపహరణం లేనేలేదు. పాదుకాపట్టాభిషేకమే ముఖ్య కథ. అయితే దశరథ జాతకంలో రామ లక్ష్మణ భరతులు ముగ్గురే అన్నదములు. అందులో దశరథుడు ఆడినమాట తప్పి, చెప్పిన వరం ఇయ్యలేదు. బౌద్ధ గ్రంథాలలో కనబడే మరొక రామకథలో దశరథుడికి నలుగురు కొడుకులూ, వరం ఇక్కడ కూడా కనబడతాయి.

చైనా భాషలో ఉన్న షట్పారమితా సూత్రాలలో "దశవిలాసాల రాజు నిదానం" అన్న కథ ఒకటి ఉంది. దశవిలాసాలరాజు జంబూ ద్వీపానికి అధిపతి. ఆ కాలంలో మనుష్యులు పదివేల సంవత్సరాలు జీవించేవారు. రాజుకు నలుగురు భార్యలు. ఒక్కొక్క భార్యకో కుమారు డున్నాడు. పెద్దభార్యకొడుకు రాముడు, రెండవ భార్య కొడుకు లోమనుడు, మూడవవాడు బ-ర-దు-డు, నాల్గవవాడు శత్రుసంహారకుడు. రాముడికి నారాయణ శక్తులున్నాయి. అదృశ్యవ్యక్తులనైనా శబ్దాన్ని బట్టి బాణమేసి చంపగలడు.

రాజుకు మూడవ భార్య అంటే ఇష్టం. ఆమెకో వరమిచ్చాడు. అవసరమైనప్పుడు అడుగుతానంది. రాజు వ్యాధిగ్రస్తుడయ్యాడు. రాముడికి యువరాజు పట్టం కట్టాడు. రాజుకు వైద్యోపచారాలు చేస్తున్న మూడవభార్య మండిపడింది. తన వరం కోరుకొంది. బ-ర-దు-డికి పట్టం కట్టి రాముడి వనవాసం అడిగింది. లోమనుడు రాముణ్ణి తిరగబడ మన్నాడు. రాముడు తండ్రిమాటను తలదాల్చాలి అన్నాడు. బ-ర-దు-డు అప్పుడు రాజ్యంలో లేడు.

రామ లోమనులు పన్నెండేళ్ళు వనవాసానికి అరణ్యానికి వెళ్ళారు. బ-ర-దు-డు రాజ్యానికి వచ్చాడు. తండ్రి చావు, అన్న వనవాసం తెలుసుకొన్నాడు. అరణ్యానికి వెళ్ళిన అన్నను కలుసుకొన్నాడు. రాజ్యం స్వీకరించమన్నాడు. రాముడు రానన్నాడు. తన పాదుకలను (తోలు చెప్పులు) బ-ర-దు-డికి ఇచ్చాడు. వాటికి పట్టంకట్టి బ-ర-దు-డు పాలించ

సాగాడు. రాముడికి నిరంతరం సందేశాలు, లేఖలు బ-ర-దు-డు పంపుతూ ఉండేవాడు. గడువు పూర్తయ్యాక రాముడు రాజ్యంలోకి వెళ్ళి సింహాసనం ఎక్కాడు. రామరాజ్యంలో సకాల వర్షాలు పడేవి. పంచధాన్యాలు పండేవి. జనులంతా ధర్మపరులు.

ఇంతే ఈ నిదానంలోని కథ. ఇందులో సీత ప్రసక్తే లేదు. దశరథ జాతకంలో రాముడు తృణ పాదుకలు ధరించేవాడు. ఈ నిదానంలో తోలుచెప్పులు తొడుక్కున్నాడు ఈ చిన్న విషయం సమాజంలో ఎంత మార్పు వచ్చిందో చెప్తుంది. గడ్డితో చెప్పులు వేసుకొనడం పరిశ్రమల ప్రాథమిక దశను సూచిస్తుంది. పశుచర్మాన్ని శుభ్రపరచి చెప్పులు కుట్టడం అన్నది కొంత ఉన్నత పారిశ్రామిక దశ.

లావోస్‌లో రకరకాల రామకథలు ఉన్నాయి. షట్పారమితా సూత్రాల నిదానంలో ఉన్న రామకథ దశరథునికి నలుగురు భార్యలని చెప్తుంది. లావోస్ రామాయణాల్లో ఒకటైన "లాంగ్ ప్రబంగ్" అనేది దశరథుడికి నలుగురు భార్యలని చెప్పడమే గాక నాలుగో భార్య పేరు మండోదరి అని విశదపరుస్తుంది. దశరథునికి మండోదరి వల్ల సీత పుట్టింది. అంటే సీత రాముడికి ఏమౌతుందో చెప్పనక్కర్లేదు. ఈ చుట్టరికాన్ని విస్మరించడానికి లావోస్‌లో ప్రయత్నాలు జరిగినట్టు మనం గుర్తించవచ్చు. బ్రహ్మచక్రం అనే మరొక రామాయణ పాఠంలో లావోస్ వాసులు సీత రావణాసురుని ఉద్యానవనంలో ఒక చెట్టుకు పుట్టిందని చెప్పుకొంటారు. ఈ వార్తను ఒక ముని కన్నక రాజుకు చెప్పాడు. ఆ రాజు సీతను తెచ్చుకుని పెంచుకొంటాడు.

లావోస్‌లో ఇన్ని రకాలుగా రామాయణ పాఠభేదాలు ఉన్నా ప్రముఖంగా ప్రచారమైన కథ వేరొకటి ఉంది. దానిని నా సమగ్రాంధ్ర సాహిత్యం మూడవ సంపుటంలో పొందుపర్చాను. ఆ రామాయణ వివరాలు చెప్తాను.

చంద్రపురి ససత్తానాగ మహానగర అనే ప్రదేశాన్ని దశరథ అనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అతని కుమార్తె పేరు నంగ్‌చంద్ర. ఆమెను రావణుడనేవాడు ఎత్తుకుపోయాడు. ఇతడు ''ఇంద్రప్రస్థనగర్'' పాలకుడైన విరులహుడి కుమారుడు. దశరథుడు రావణుని సంహరించగల

పుత్రుణ్ణి ప్రసాదించమని ఇంద్రుణ్ణి ప్రార్థిస్తాడు "ప్రలమ్" అనే దేవపుత్రుణ్ణి ఇంద్రుడు పంపిస్తాడు. ప్రలమ్ తన తమ్ముడితో బాటు నంగ్‌చంద్ర కోసం వెళతాడు. చెల్లెల్ని విడిపించి తీసుకొని వస్తాడు. ప్రలమ్ చెల్లెల్ని విడిపించి తీసుకొని వచ్చినా, భార్యను పోగొట్టు కుంటాడు. ఆమె పేరు సీత ఆమెను ఎత్తుకుపోయినది కూడా రావణుడే!

రావణుడి పూర్వ వృత్తాంతం ఏమిటంటే : విరులహుడు కొడు కుని బహిష్కరిస్తాడు. రావణుడు లంకలో రాజ్యం ఏర్పరచుకొన్నాడు. ఒకసారి ఇంద్రుడి అమరలోకాన్ని చూడడానికి రావణుడు వెళ్ళాడు. అక్కడ ఇంద్రుని అజాగ్రత్తను వినియోగించుకొని ఒక అంతఃపుర కాంత శీలాన్ని చెరుస్తాడు. ఆమె ప్రతీకారం కోసం తపస్సు చేస్తుంది. భూలోకానికి దిగి వచ్చి రావణుని కుమార్తెగా జన్మించి, అతణ్ణి సంహ రించడానికి ప్రయత్నిస్తుంది, రావణుడు ఆమెను లంక నుండి వెళ్ళగొడతాడు. తెప్పలో కొట్టుకుపోతున్న ఆమెను ఒక ముని రక్షించి, ఆమెకు సీత అని పేరు పెడతాడు.

సీత సౌందర్య కీర్తి దశదిశలకు విస్తరిస్తుంది, ప్రలమ్ కూడా అది విన్నాడు. ఆమెను పరిణయమాడ నిశ్చయించుకొంటాడు. ఆమె తన కూతురే అన్న సంగతి తెలియక రావణుడు కూడా ప్రలమ్‌తో పోటీకి వస్తాడు. ముని దగ్గరవున్న దివ్య ధనస్సును ప్రలమ్ ఒక్కడే వంచగలిగి సీతను పెళ్ళాడుతాడు. (ఇక్కడే మాయలేడి సంఘటన, సీతాపహరణం జరుగుతాయి.) ప్రలమ్ సీతకోసం అన్వేషణ మొదలు పెడతాడు. అయితే అతడి విపత్కరకర్మ వలన మూడేళ్ళపాటు ప్రలమ్ వానరుడుగా మారిపోతాడు. అతడికి హనుమాన్ అనే కుమారుడు కలుగు తాడు. మళ్ళా మానవ రూపాన్ని పొందాక ప్రలమ్ తన తమ్ముడూ, హనుమా సహాయం చేయగా ఆ ఇద్దరితోపాటు పెద్ద వానర సైన్యంతో లంకపై దండెత్తి, రావణుని సంహరించి, సీతను తన నగరానికి తీసుకు వెళతాడు.

లావోస్‌లోని ఈ ప్రసిద్ధ రామకథలో వివిధ జాతక కథల్లోని చట్టరికాన్ని మారుస్తూనే మూలానికి విధేయంగా వుండడానికి ప్రయత్నం జరిగింది. రాముడి చెల్లెల్నీ, పెళ్ళాన్నీ రావణుడు విడివిడిగా రెండు

విధాల అపహరిస్తాడు. ఒక కథనం ప్రకారం రాముడు చెల్లెలి పేరు సంగ్‌చంద్ర. ఇంకో కథనం ప్రకారం ఆ చెల్లెలు పేరే శాంత. తెలుగు దేశంలోని స్త్రీల రామాయణం పాటలలో రాముడికి శాంత అనే సోదరి వుంది. హనుమంతుడు రాముని కొడుకు అన్న "విడ్డూరం" ఒక్క లావోస్ రామకథలోనే కాక ఇతర దేశాల రామకథలలోనూ వుంది.

# సయాంలో రామకీర్తి కావ్యం

ఇప్పుడు థాయ్‌లాండ్ అని వ్యవహరిస్తున్న దేశానికి సయాం అన్న పేరు ఉంది. సయాంలో ఒక అయోధ్యా నగరం ఉంది. ఇది బాంకాగ్ నగరానికి ఉత్తరాన 70 కి.మీ. దూరంలో ఉంది. సయాం దేశానికి అయోధ్యయే రాజధాని. రెండేళ్ళు ముట్టడించినా తట్టుకోగల గొప్ప దుర్గమది. క్రీస్తుశకం 1350 నుంచి 1767 దాకా 417 సంవత్సరాలు ఈ అయోధ్యలో పట్టం కట్టుకొని వివిధ వంశాల రాజులు 37 మంది పాలించారు. ఈ ప్రభువులందరూ రామభక్తులే. రామనామధారులే. వాళ్ళ పేర్లలో రామాధిబోధి, రామేశ్వర, రామరాజ, రామాధిపతి మొదలైన పదాలు వుంటాయి. 18వ శతాబ్ది నుంచి సయాంను చక్రివంశపు రాజులు పాలించారు. వీళ్ళందరూ రామనామధారులే. ఒకటవ రాముడు, రెండవ రాముడు అని ఈ రాజులను చరిత్రకారులు పరిగణిస్తారు.

చక్రివంశ సంస్థాపకుడు ఒకటవ రాముడు రామాయణాన్ని మహాకావ్యంగా వ్రాశాడు. దాని పేరు 'రామకియన్' అంటే రామకీర్తి అని అర్థము. ఇందులో వాల్మీకి రామాయణంలో కనబడని బంధుత్వాలూ, సంఘటనలు ఉంటాయి. ఈ శతాబ్దిలోనే ఈ వంశంలోని ఆరవ రామరాజు (1910-25) వాల్మీకి రామాయణాన్ని అనుసరిస్తూ వేరే రామకీర్తిని రచించాడు.

ప్రభువులేకాక ఇతర కవులుకూడా రామకీర్తి కావ్యాలు రచించారు. ప్రజలు అనుసరించేది బౌద్ధమతమే అయినా, రామకథలు సయాంలో చాలా విరివిగా ప్రచారంలో వున్నాయి. శ్రవ్యకావ్యాలుగానే కాక, దృశ్యకావ్యాలుగా బహుళ ప్రచారం పొందాయి. తోలుబొమ్మల ఆటగా, ముసుగు మనుషుల ఆటగా ఆ దేశంలో రామాయణాన్ని ప్రదర్శిస్తారు. తోలుబొమ్మల ఆటను "నంజ్" అంటారు. ముసుగు మనుషుల నాటకాన్ని "ఖోన్" అంటారు. ఈ నాటకంలో రాక్షసులు, వానరులు

ముఖాలకు అట్ట ముసుగులు ధరిస్తారు. దేవతలు, మానవులు సొంత ముఖాలలోనే ఉంటారు.

సయాంలో ప్రభువులు భక్తితో ఆరాధించే - ప్రజలు రక్తితో ఆనందిస్తున్న - రామకథలో రామునికి సీత ఏమవుతుందో గమనిద్దాము. సయాం కవులకు వాల్మీకి రామాయణం అపరిచితంకాదు. అయినా, కొన్ని ప్రాచీన రామకథా విశేషాలను వాళ్ళు తమ రామాయణంలో పొందుపరచి సంరక్షిస్తున్నారు. వాల్మీకి రామాయణం ఎంత విస్తారమైనదో సయాం రామకీర్తి కూడా అంత విస్తారమైనదే షట్కాండలేకాక ఉత్తరకాండలోని కథలు కూడా అక్కడ ప్రచారంలో ఉన్నాయి. సయాం లోని ప్రజలు రామాయణ వ్యక్తుల పేర్లను భిన్నంగా ఉచ్చరిస్తారు. అయినా పాఠకుల సౌకర్యం కోసం మన ఉచ్చారణకు అనువైన గుణింతంతోనే ఆ పేర్లను రెండవసారి వాడినప్పట్నుంచి రాస్తాను.

"తత్సరాతి" మహారాజు 'అయుతియ' పాలిస్తున్నాడు. ఆయనకి ముగ్గురు భార్యలు. పెద్ద భార్య కౌసూర్య, రెండవ భార్య కైయాకేశి, మూడవభార్య సముతేవి. రాజుకు పిల్లలు లేరు. సంతానం కోసం ఏం చేయాలో దశరథుడు మునులను ప్రశ్నించాడు. వాళ్ళు కలైకోట్ ఋషి సహాయం అర్థించమన్నారు.

(కలైకోట్ అన్నది తమిళ పదం. తమిళ రామాయణంలో ఋశ్య శృంగుడిని కలైకోట్ అని వ్యవహరిస్తారు.) కలైకోట్ ఋషి "రోమబత్తన్" మహారాజుగారి అల్లుడు. ఒకసారి రోమపాదుని రాజ్యంలో అనావృష్టి వచ్చింది. కలైకోట్ ఋషి అడుగు పెడితే రాజ్యంలో వర్షం కురుస్తుందని మునులు చెప్పారు. రాజు తన కుమార్తెనే పంపించి, ఋషి తపస్సును భంగం చేయించి రాజ్యానికి రప్పించుకొన్నాడు. (వాల్మీకి రామాయణంలో రోమపాదుడు వేశ్యలను పంపిస్తాడు) దశరథుడు ఋష్య శృంగుణ్ణి తన రాజ్యానికి ఆహ్వానించాడు. యజ్ఞం చేయించమన్నాడు.

యజ్ఞం చేయించడానికి ముందు ఋష్యశృంగుడు కైలాసానికి వెళ్ళాడు. ఈశ్వరుడిని ప్రార్థించాడు. దశరథుని పుత్రునిగా జన్మించమని నారాయణుని కొకమాట చెప్పమన్నాడు. ఈశ్వరుడు చెప్పాడు. నారాయణుడు అంగీకరించాడు. తానేకాక లక్ష్మి, అనంతనాగుడూ, శంఖు,

చక్రాలూ, గద భూలోకంలో అవతరించగలరని చెప్పాడు. హోమ కుండంనుంచి యజ్ఞపురుషుడు ఆవిర్భవిస్తాడని ఈశ్వరుడు చెప్పాడు. అతడి చేతిలో ఒక పళ్ళెం ఉంటుంది. అందులో నాలుగు దివ్యకబళాలు ఉంటాయి. ఆ దేవతా అడల్లో ఒకదాని ముక్కను ఒక కాకి ఎత్తుకు పోతుందని, దక్షిణానికి ఎగిరిపోతుందని ఈశ్వరుడే ఆదేశించాడు.

ఋష్యశృంగుడు యధావిధిగా దశరథునిచేత పుత్రకామేష్టి చేయించాడు. యజ్ఞపురుషుడు పళ్ళెంతో ఆవిర్భవించాడు. కాకి వచ్చింది. దేవతా అడలోని ఒక ముక్కను ఎత్తుకుపోయింది. మిగిలిన వాటినే దశ రథుడు తన ముగ్గురు భార్యలకు ఇచ్చాడు. నలుగురు పుత్రులు పుట్టారు. దేవతా అడలోని ముక్కను ఎత్తుకుపోయిన కాకిపేరు "కాకానాసూన్" ఇది కాకుల రాక్షసి. (వాల్మీకి రామాయణంలో ఇది తాటక.) కాకా నాసూన్ ఆ అడముక్కను దశకణ్ఠుడికి ఇచ్చింది. అతడు 'లంకా' రాజ్యానికి రాజు. "రండ్ - క" అన్నది దాని మొదటి పేరు. "కాకుల గూడు" అని దాని అర్థం. ఈ లంక నీలకలా పర్వత శిఖరంపై ఉండేది. దశకంఠుడు తన భార్య మండోదరిని ఆనందింప చేయడానికి ఆ దేవతా అడలోని భాగాన్ని కాకానాసూన్ చేత తెప్పించాడు. మండోదరి దానిని తిన్నది గర్భవతి అయింది. లక్ష్మి ఆమె కడుపున పుట్టింది. పుడుతూనే "రావణుని చంపు" అన్న మాటలు పలికింది. జ్యోతిష్కుల సలహాపై దశకంఠుడు ఆ బిడ్డను ఒక పెట్టెలో పెట్టి దానిని నీళ్ళలో పారేశాడు. సముద్ర దేవత మణిమేఖల ఆ బిడ్డను సంరక్షించింది.

ఒక నది ఒడ్డున జనకుడు తపస్సు చేసుకుంటున్నాడు. అతడు మిథిలా నగరం ఏలిక పెట్టె కొట్టుకొంటూ అతని దగ్గరకు వచ్చింది. జనకుడు ఒక గొయ్యితీసి అందులో పెట్టెతోబాటు బిడ్డను పూడ్చి పెట్టాడు. వెళ్ళిపోయాడు. కొన్నేళ్ళుపోయాక ఆ జనకుడే అక్కడకు వచ్చి, నేలను దున్నాడు. ఆ పెట్టె దొరికింది. అందులోని బిడ్డ బయట పడింది. ఆమెకు సీత అని పేరు పెట్టారు.

సీతాదేవిని కన్న మండోదరి చరిత్ర చాలా చిత్రమైనది. ఆదిలో ఆమె ఒక కప్ప. ఆ మండూకం నలుగురు ఋషులకు సరిగ్గా సమయానికి ఏదో సహాయం చేసింది. అందుకు కృతజ్ఞతగా ఋషులు ఆ కప్పను

అందమైన కన్యగా మార్చారు. ఆ సుందరాంగిని ఈశ్వరునికి అర్పించారు. ఒకసారి కైలాస పర్వతం చలించింది. ఒరిగిపోయింది. దాన్ని యధాస్థితిలో ఉంచడానికి దశకంఠుని పిలిచారు. అతడు ఆ పర్వతాన్ని ఎత్తి యధాస్థానంలో ఉంచాడు. ఆ వీరకార్యాన్ని ఈశ్వరుడు మెచ్చుకొని ఏం కావాలని దశకంఠుని అడిగాడు. అతడు ఉమాదేవిని ఇమ్మన్నాడు: ఈశ్వరుడు ఇచ్చేశాడు. దశకంఠుడు ఉమాదేవిని ఎత్తుకొని లంకకు బయల్దేరాడు. అయితే, ఆమె దేహం నుంచి ఉద్భవిస్తున్న ఉష్ణతీవ్రతను భరించలేక పోయాడు. దారిలోనే దహించుకు పోవచ్చునన్న భయంతో ఉమాదేవిని నేల పడేశాడు. ఆమెకు మారుగా ఈశ్వరుడు దశకంఠునికి మండోదరిని ఇచ్చాడు.

మండోదరిని తీసుకుని దశకంఠుడు లంకకు బయల్దేరాడు. దారిలో వాలి' అతణ్ణి అడ్డగించాడు. మండోదరిని అపహరించాడు. కిష్కిన్ రాజ్యానికి తీసుకుపోయాడు. వాలి మండోదరితో క్రీడించాడు. ఆమె గర్భవతి అయింది. వాలికి అంగదుడనే మంత్రి వున్నాడు. అతడు మండోదరి గర్భంలోని పిండాన్ని సంకర్షణం చేసి ఒక మేక కడుపులో నిక్షిప్తం చేశాడు. మండోదరిని దశకంఠుని వద్దకు పంపించమని వాలికి సలహా ఇచ్చాడు వాలి అది పాటించి ఆమెను పంపించివేశాడు.

మేక కడుపులో పెరిగిన వాలి, మండోదరుల బిడ్డ జన్మించాడు. ఆ కుర్రవాడికి మంత్రి అంగదుడు తన పేరే పెట్టి వాలికి అప్పగించాడు. వాలి దగ్గరనుండి తిరిగి వచ్చిన మండోదరిని దశకంఠుడు ఏలుకొని కాపురం చేశాడు. అయితే కొన్నాళ్ళకు ఆమె వాలికో బిడ్డను కన్న సంగతి దశకంఠునికి తెలిసింది అతడు మండిపడ్డాడు. ఆ బిడ్డను చంపడానికి వెళ్ళాడు. అయితే, వాలికి పట్టుబడ్డాడు. కొన్నాళ్ళపాటు అంతఃపురకాంతల వినోదంకోసం దశకంఠుడిని బంధితునిగా వాలి కిష్కింధలో వుంచాడు. తర్వాత అగౌరవంగా విడుదల చేశాడు. దశకంఠుడు లంకకు వెళ్ళిపోయాడు. మండోదరితో కాపురంచేస్తూ వచ్చాడు.

ఇదీ సయాం దేశంలోని రామకీర్తి కావ్యంవల్ల మనకు తెలియ వచ్చే సీతారాముల జన్మగాథలు. ఇది వాల్మీకి రామాయణంతో విభేదించినా ఎన్నెన్నో ఘట్టాలు వాల్మీకంలో ఉన్నట్టే ఉన్నాయి. రామ వనవాసం,

దశకంఠుని సోదరి "సుమ్మనఖ" రాముడిని చూసి మరులుకొనడం, పరాభవం, అన్నకు చెప్పి సీతను అపహరింప చేయడం అన్నీ రామకీర్తి కావ్యంలో ఉన్నాయి. సీతాపహరణానికి ముందు దశకంఠుడు మండోదరి సలహాను అడుగుతాడు. ఆమె వారించింది. దశకంఠుడు వినలేదు. సీతను ఎత్తుకొచ్చాడు. లంకలో పెట్టాడు. దాని ఫలితంగా రామరావణ యుద్ధం జరిగింది తనకు సహాయం చేసిన 'సిఫేక్'కు రాముడు లంకా రాజ్యాన్ని ఇచ్చాడు. రావణ వధ తరువాత విభీషణ పట్టాభిషేకం కాగానే మండోదరి మరిదితో కాపురం చేస్తుంది.

సయాం దేశంలోని రామ కథలలో మండోదరి గురించి ఇంత విపులంగా ఉన్నా, ఇప్పటి వాల్మీకి రామాయణంలో మండోదరి ఒకే ఒక్క సర్గలో కనబడుతుంది. ఈ విడ్డూరాన్ని గమనించి సి వి. వైద్యా గారు తమ "ది రిడిల్ ఆఫ్ రామాయణ" అనే గ్రంథంలో ఇలా రాశారు: "రామాయణంలో మొట్టమొదటి సారిగాను, కట్టకడపటి సారిగాను మండోదరి ప్రసక్తి ఉన్న ఈ సర్గ ప్రక్షిప్తమన్న సంగతి తేటతెల్లమవుతున్నది". (పుట-35) వాల్మీకి యుద్ధకాండలోని 114 వ సర్గను రాయలేదని, ఎవరో కల్పించి అందులో కలిపారని వైద్యాగారి వాదం. ఈ సర్గలోనే మండోదరి విలాసం ఉన్నది. ఎవరైనా ఈ కూట కరణం ఎందుకు చేయవలసి వచ్చింది?

ఇతర దేశాల రామ కథల్లో మండోదరి గురించి వివరాలు దొరుకుతాయి. వాటిని పరిశీలిద్దాం:

# మలేషియాలో మండోదరి కథ

మలేషియాలో శ్రీరాముడిని భక్తి భావంతో ఆరాధిస్తారు. అతడు ''దేవ బెరెంబున్'' అవతారమని భావిస్తారు. అంటే ''దేవ పరబ్రహ్మం' అవతారమన్నమాట మలేషియాలో రెండు విధాలైన రామకథలు ప్రచారంలో వున్నాయి. ''వయాంగ్'' (తోలుబొమ్మలు) ఆటగాళు గానంచేసే ''చరిత్ర మహారాజా వన'' అనే కథ బహుళ ప్రచారంలో వుంది. రావణుని ఆ భాషలో ''వన''అంటారు. (మలేషియాలోని రావణునికి పది కాదు, పన్నెండు తలలు. అదనపు తలలు కిరీటం కింద వుంటాయి.) 'రామాయణ గాథ రావణ చరిత్రగా ప్రచారం చెందడానికి కారణం లేక పోలేదు. జైన రామాయణాల గురించి పరిశీలించినప్పుడు ఈ కారణం బోధపడుతుంది. ''చరిత్ర మహారాజా వన''తో పాటు ''హికాయత్ శ్రీరామ'' అనే రామచరిత్ర కూడా మలేషియాలో కావ్య ప్రశస్తిని పొందింది. రావణ చరిత్ర నుంచి, రామచరిత్ర నుంచి తెలియవచ్చే విశేషాలు చూద్దాం.

దశరథుడు మండూరపుర నగరాన్ని పాలిస్తున్నాడు. అతనికి మండూదారి అనే ధర్మపత్ని, బాల్యాదారి అనే భోగపత్ని వున్నారు. మండూదారి చాలా అందకత్తె ఇద్దరు భార్యలున్నా దశరథునికి పిల్లలు లేరు. పురోస్త మహాఋషి దశరథునిచేత పుత్రకామేష్టి చేయించాడు. "గాగక్ సూరు'' ఈ క్రతువును వీక్షిస్తున్నాడు. (ఇతడే కాకాసురుడు.) యజ్ఞపురుషుడు ఆవిర్భవించి, దివ్యకబళాలు ప్రసాదించాడు. గాగక్ సూరుడు ఒక ముద్దను ఎత్తుకుపోయాడు. దానిని రావణునికి ఇచ్చాడు. రావణుడు దానిని భక్షించాడు. పురోస్త మహాఋషి ఆగ్రహించాడు. అన్న కబళాన్ని అపహరించడంచేత రావణుడు దశరథుని పుత్రుని చేతుల్లో మరణిస్తాడని శపించాడు. అంతతో ఊరుకొనక ఆ దశరథ పుత్రుడు

రావణుని కుమార్తెనే వివాహ మాడుతాడని కూడా పులోస్త మహాఋషి భవిష్యం చెప్పాడు.

కాకి ఎత్తుకుపోగా మిగిలిన అన్నకబళాలను దశరథుడు తన ఇద్దరు భార్యలకు ఇచ్చాడు. మండూదారికి రామ లక్ష్మణులు జన్మించారు. బాల్యాదారికి మొదట భరతశత్రుఘ్నులు ప్రభవించారు. తరువాత ఆమెకే "కికేవిదేవి" అనే కుమార్తె జన్మించింది. ఈ బిడ్డలు ప్రవర్ధమానులవు తున్నారు.

రావణుడు మండూదారి అందం గురించి విన్నాడు. దశరథుడు పాలిస్తున్న మండూరపురి నగరానికి వెళ్ళాడు. రావణునికి దశరథుడు ఘనమైన సత్కారంచేసి ఆతిథ్యమిచ్చాడు. శాస్త్రోక్తమైన ఆ ఆతిథ్య సేవలలో ఒక భాగంగా రావణుడు తనకు మండూదారిని ఇమ్మని అడిగాడు. దశరథుడు కాదనలేకపోయాడు. అతిథికి తన అర్ధాంగిని ఇచ్చేశాడు. దశరథుడైతే అలా ఇవ్వగలిగాడుగాని రావణునితో వెళ్ళడానికి మండూదారిక్కి మనస్కరించలేదు. ఆమె తన చర్మంనుంచి ఒక ఛాయా మండూదారిని సృష్టించింది. దానినే రావణునివద్దకు పంపించింది. రావణునికి ఈ మోసం తెలియదు.

ఛాయా మండూదారితో రావణుడు లంకకు వెళుతూ ఉండగా దారిలో "కేసుబ్రీసు" (కశ్యపుడు) కనబడ్డాడు. ఇతడు రాబందుల మూలపురుషుడు. ఈయనను చూసి రావణుడు అపహాస్యం చేశాడు. "నీవు నరుడివా? వానరుడివా?" అని ప్రశ్నించాడు. కశ్యపుడు కోపించాడు. నరవానరుల చేతిలో మరణిస్తావని రావణుని శపించాడు.

ఛాయా మండూదారిని తీసుకొని రావణుడు లంకకు చేరాడు. ఆమెను ఒక గృహంలో పెట్టాడు. దశరథుడు చాలా రహస్యంగా ఆకాశ మార్గాన పయనించి లంకకు వచ్చాడు. ఛాయా మండూదారితో శయనించాడు. ఈ కలయికవల్ల ఆమె గర్భవతి అయింది. ఒక పుత్రికను కనింది. ఆమె జాతకాన్ని చూసి విభీషణుడూ తదితర ఆస్థాన జ్యోతిష్కులు ఆమె వల్లనే రావణుడు మరణిస్తాడని చెప్పారు. వెంటనే ఆ బిడ్డను ఒక పెట్టెలో పెట్టి సముద్రంలో పారేశారు.

ఛాయా మండూదారికి దశరథునికి చాటుగా పుట్టినా "రావణుని కుమార్తె" అయిన ఆ బిడ్డ అలాగే పెట్టెలో కొట్టుకుపోయింది. "దుర్వాత్ పుర్వా"లో ఉన్న కాలి మహాఋషికి దొరికింది. ఆమెను ఆతడు పెంచ సాగాడు.

ఇదీ మలేషియాలోని రామ రావణ కథల వల్ల తెలియవచ్చే సీతా రాముల జన్మకథలు. వాల్మీకి రామాయణంలో లేని ఈ విశేషాలు ఎక్కడ నుంచి మలేషియా కథలలోకి వచ్చాయి? ఆ దేశ ప్రజలు వీటిని కల్పించారని చెప్తే అది అపచారం. ఈ గాథలన్నీ భారతదేశం నుంచే ఆ దేశానికి పయనించాయి. ఈ సత్యాన్ని గుర్తించడానికి దశరథునికి భోగపత్నివల్ల "కికేవిదేవి" అనే కుమార్తె వున్నదన్న సంగతే నిరూపిస్తుంది

ఆధునిక కాలంలో వాల్మీకి రామాయణమే ప్రచారం పొందడం వల్ల వాల్మీకి పూర్వమే ప్రచారంలో ఉన్న వివిధ రామ కథలు మనకు తెలియవు. వైదిక మతానుసారులతోపాటు బౌద్ధులూ, జైనులూ కూడా ఒకే ప్రాచీన సంస్కృతికి వారసులు. వాళ్ళు తమ వాఙ్మయంలో అవాల్మీకాలైన గాథలను భక్తితో భద్రపరచుకొన్నారు. జైన, బౌద్ధ మతాలు వ్యాపించిన ప్రదేశాల్లో అవాల్మీకాలైన రామకథలు కూడా వ్యాపించాయి. మనము ఈనాడు వాల్మీకి రామాయణంలోని ఘట్టాలను విశ్వసించుతున్నట్లు ఆనాటి ప్రజలు వాటిని విశ్వసించారు. సంస్కృతేతర భాషల్లో రామచరిత్రను ఏ కవి అయినా రచించితే అవాల్మీకాలైన రామకథలను అందులో పెట్టకపోతే ఆ భాషా ప్రజలు ఆ చరిత్రను రామాయణంగా అమోదించరు. అందుకే మన ఆంధ్రభాషలోని భాస్కర రంగనాథ రామాయణాలలో కూడా అవాల్మీకాలు చాలా ఉన్నాయి.

దశరథుని కుమార్తె "కికేవిదేవి" కథ బెంగాలీ రామాయణాల్లో ఉంది. ఇది జైన ప్రభావం వల్ల అవసరమైనది. వంగరాష్ట్రంలో ఒక నాడు జైన మతం చాలా ముమ్మరంగా ఉండేది. ఇరవై నలుగురు జైన తీర్థంకరులలో ఇరవై ముగ్గురు వంగ రాష్ట్రంలోని నేటి హజారీబాగ్ జిల్లాలో ఉన్న పారేస్‌నాథ్ పరక్యాలపద్ద సమెత్సేఖరం వద్ద సిద్ధి పొందారు. కొందరు తీర్థంకరులు వంగదేశంలో జన్మించిన వాళ్ళే. మహావీరుడు

సైతం రాఢ దేశంలో బహుకాలం పర్యటించాడు. ఈ కారణాలవల్ల బెంగాలీ రామాయణాలలో జైన ప్రభావం కనబడుతుంది.

మన ఆంధ్రదేశంలో మొల్లలాగ బెంగాల్‌లో చంద్రావతి అనే రచయిత్రి రామాయణం రచించింది. ఈమెను సాహిత్య చరిత్రకారులు మొదట గుర్తించలేదుగాని చంద్రావతి రామాయణం పాటలను బెంగాల్‌లోని ఆబాలగోపాలం పాడుకొంటారు. మైమెన్‌సింగ్ జిల్లాలోని గ్రామీణ ప్రాంతాలలో పడవవాళ్ళు ఆ పాటలే పాడుకుంటారు. పర్వదినాలలో గ్రామీణులందరి నాలుకలపై ఆ పాటలేవుంటాయి. పెళ్ళిళ్ళలో ముఖ్యంగా చంద్రావతి రామాయణంలోని పాటలనే పాడుతారు. మంగళ స్నానాలు చేయించడానికి నీళ్ళు తెచ్చే ముత్తయిదువలు ఈ పాటలే పాడతారు. పెళ్ళికూతుర్ని అలంకరించేటప్పుడు, పెళ్ళి కొడుకుకు కత్తెర వేయించే టప్పుడు చంద్రావతి రామాయణ కీర్తనలు గానం చేయకపోతే అందమే లేదు మైమెన్‌సింగ్ జిల్లాలో రథసప్తమినాడు స్త్రీలు సూర్యోదయం మొదలుకొని సూర్యాస్తమయం దాకా చంద్రావతి రామాయణాన్నే పారాయణ చేస్తారు.

ఇటువంటి పవిత్రమైన కావ్యంలో దశరథుని కుమార్తె ప్రసక్తి వుంది. మలేషియా రామకథలోని ''కికేవిదేవి''గా కాక చంద్రావతి రామాయణంలో ''కుకువా'' దేవిగా కనబడుతుంది. ఈమె కైకేయి కూతురు. మంథర పెంపకంలో పెరిగింది. రావణవధ తరవాత శ్రీరామ పట్టాభిషేకం పిమ్మట సీతారాములు సుఖంగా కాపురం చేస్తున్నప్పుడు ఈ ''కుకువాదేవి'' ఆ కాపురంలో చిచ్చుపెట్టింది. గర్భిణి అయిన సీతను కనికరం లేకుండా రాముడు అడవులకు పంపించడానికి ఈ కుకువాదేవే కారణం. ఈ ఘట్టం గురించి ఇంకోసారి వివరిస్తాను.

ఇప్పుడీ చంద్రావతి రామాయణంలోని విశేషంవల్ల మనం విశ్వసించవలసిన దేమిటంటే- ఇతర దేశాల్లో విడ్డూరంగా కనబడే రామకథా సన్నివేశాలకు ఆ దేశీయుల అభూత కల్పనలు కాక భారతదేశంలోని ప్రాచీన గాథలే కారణం అన్న సత్యాన్ని! మలేషియాలోని రామ రావణ చరిత్రలో మండోదరిని వాలి రావణుని నుంచి అపహరించడం, అంగదుణ్ణి కనడం మొదలైన ఘట్టాలు కూడా ఉన్నాయి. రామ రావణ

యుద్ధం తరవాత మండూదారికి సీత తన కుమార్తె అని కూడా తెలుస్తుంది. ఒక సంప్రదాయం ప్రకారం మలేషియా కథలో రాముడు వనవాసానికి వెళితే ఆ వియోగం భరించలేక మండూదారి మరణిస్తుంది. దశరథుడు కాడు.

దశరథుడు తన భార్య మండూదారిని అతిథి సేవలో రావణున్నికి ఇవ్వడం అన్న అంశం అత్యంత ప్రాచీనకాలపు ఆచారాన్ని తెలియజేస్తుంది. ఈ ఆచారాన్ని వాల్మీకి రామాయణంలో (బహుశా మనం చూడలేము గాని మహాభారతంలో స్పష్టంగా గమనించవచ్చు. ముని శాపం పొందిన పాండురాజు కుంతీదేవిని నియోగంవల్ల పుత్రులను కనమని చెప్తున్న ఘట్టంలో ఈ ఆచార ప్రసక్తి వస్తుంది. ఆంధ్ర మహాభారతం ఆదిపర్వం, పంచమాశ్వాసంలోని 84 వ నెంబరు వచనం చూడండి. దానివల్ల ఉద్దాలకుడనే మహాముని భార్యను ఒక వృద్ధ విప్రుడు అతిథియై వచ్చి పుత్రార్థం కామించాడని తెలుస్తుంది ఆమెకు అప్పటికే ఎదిగిన కొడుకు ఉన్నాడు అతని పేరు శ్వేతకేతుడు. తన తల్లిని ఇంకొకడు కామించాడని తన తల్లిదండ్రులు దానికి సమ్మతించడం చూసి ఆగ్రహోదగ్రుడయ్యాడు. ఆ శ్వేతకేతుడే వివాహ విధులను ఏర్పరచి శాసింపచేశాడు.

ఈ శ్వేతకేతుడి కాలానికి చాలా ప్రాచీనమైన కథ కనుక మలేషియా రామ కథలలో ఉన్న అతిథి సేవా మర్యాదలను మార్చకుండా భక్తి శ్రద్ధలతో భద్రపర్చారు. మండోదరిని రావణునికి ఇప్పించారు. మండోదరి పంచకన్యలలో ఒకరై.

''అహల్యాద్రౌపదీ సీతా
తారా మండోదరీ తథా
పంచాకన్యాః స్మరే న్నిత్యం
మహాపాతక నాశనం''

అనే శ్లోకం ఎంతో ప్రఖ్యాతమైనది. ఈ శ్లోకం వల్ల అహల్య, ద్రౌపది, సీత, తార, మండోదరి అనే అయిదుగురు పంచకన్యలు. వీరిని నిత్యం స్మరిస్తే మహాపాతకాలు నాశనమవుతాయని ఈ శ్లోకం అర్థం.

ఈ పంచ కన్యలలో ఒక ద్రౌపది తప్ప మిగతా నలుగురూ రామాయణంలోని స్త్రీలే కావడం గమనార్హం.

# 'నిప్పులేనిదే పొగరాదు"

మలేషియాలో మండోదరి కథను గమనించాక వివిధ దేశాలలో ప్రచారం పొందిన రామకథలలో కనిపించే 'విడ్డూరాలకు' భారతదేశం లోనే ఆధారాలు వుంటాయనుకొన్నాము. పరిశోధిస్తే ఆ ఆధారాలన్నీ దొరుకుతాయి. కొన్ని "విడ్డూరాలకు" జైన పురాణాలు ఆధారం.

భారతదేశంలో వైదికార్యులు ఎంత ప్రాచీనులో జైనులూ అంత ప్రాచీనులే. యజుర్వేదంలో ఋషభ, అజితనాథ, అరిష్టనేముక లనే ముగ్గురు జైన తీర్థంకరుల పేరుల ప్రస్తావనవుంది. (25-19.) ఋగ్వేదంలో పేర్లు చెప్పకపోయినా "దిగంబర" దేవతలను ఆరాధిస్తూ ఒక సూక్తం వుంది. జైనులలో దిగంబర శాఖ సుప్రసిద్ధమే, ఋగ్వేదంలోనే యజ్ఞయాగాదులను ఆక్షేపించే మగధ దేశవాసుల గురించి కూడా చెప్పే ఋక్కులు ఉన్నాయి. (ఈ సంగతులు యు. డి. బరోదియాగారి "హిస్టరీ అండ్ లిటరేచర్ ఆఫ్ జైనిజం" అనే పుస్తకంవల్ల తెలుస్తున్నాయి.)

ప్రాచీన వైదికార్యులు తమ కాలంనాటికి ప్రచారం చెందిన జానపద గాథలనే స్వీకరించి పురాణాలను అల్లుకొన్నారు. వాల్మీకి కొన్ని కథలను తీసుకొని మనోజ్ఞమైన మహాకావ్యాన్ని విరచించినాడు. దీనిని వైదికులు తమ మత ప్రచారానికి వాడుకొంటూ వాల్మీకి రాయని ఎన్నో సర్గలకు సర్గలే సృష్టించి ప్రక్షిప్తాలను చొప్పించారు. రామాయణం పైన పరిశోధనలు చేసిన ఎందరో మహానుభావులూ, (వీరిలో కొందరు ఆకుంఠిత రామభక్తులే) సంస్కృత సాహిత్య చరిత్రకారులూ ఈ ప్రక్షిప్తాల గురించి విపులంగా వివిధ గ్రంథాలలో చర్చించారు. వాల్మీకి ఆరు కాండలే రాస్తే వైదికులు ఏడవ కాండగా ఉత్తర కాండను కల్పించారు. ఇది

వాల్మీకి రచన కాదన్న సంగతిని శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు తమ "సంస్కృత వాఙ్మయ చరిత్ర''లో ఇలా చెప్పారు:

"పూర్వ రామాయణ కథా రచనముతో నెట్టి పోలికయు లేని డొంకతిరుగుడు రచనయు అందలి కవిత్వం ప్రౌఢశైలి కేరితి నీడుగాని సామాన్య శైలియు, అందలి మాధుర్యములో నావగింజంతైన లేని వర్ణనలు గలిగిన యుత్తరకాండము వాల్మీకి మహర్షి కృతమని రెండును జక్కగా బరించిన విమర్శకు లెవ్వరును జెప్ప సాహసింప జాలరు. అట్లెవరైనా జెప్పినా, వారు చిరకాలముగా వచ్చు పురాణ ప్రసిద్ధికి విరుద్ధముగా జెప్ప జడియుటయే యందు గారణమగును గాని వేరు కాబోదు" (ద్వితీయ - పుట 42). మల్లాదివారు ఆనాడే తమ కాలంనాటి పురాణ ప్రసిద్ధికి జడిసిపోకుండా నిజం చెప్పారు. ఈనాడు ఈ నిర్భయత్వంతోనే మనం మన పురాణ గాథలను పరిశీలించాలి.

ఏమైనా వైదికులు రామాయణంలో ఉత్తరకాండను కల్పించారు. ఇందులో ఎక్కువ భాగం జైనుల రామకథలలో కనిపించే రావణ ప్రాముఖ్యమే అయినా, ఆనాటి ప్రజలలో నాటుకొనిపోయిన ఇతర జైన రామాయణ ఘట్టాలన్నింటికి అందులో చోటు లేకపోయింది. ఆ జైన కథలనే శైవ శాక్త వైష్ణవ ప్రాధాన్యాలకు అనువుగా మలచుకొంటూ వైదికులు మన భారత దేశంలోనే సంస్కృతంలో వాల్మీకేతర రామాయణాలను రచించక తప్పలేదు. ఆనంద రామాయణం, అద్భుత రామాయణం మొదలయినవి ఇలా పుట్టినవే. ఇక వివిధ పురాణాలలో జొప్పించిన రామకథా విశేషాలకు లెక్కలేదు.

ముందు ఉత్తర కాండ ప్రకారం మండోదరి కథ ఏమిటో చూద్దాం. పూర్వం మధుర అనే దేవకన్య ఒకామె ఉండేది. ఆమె సోమవార వ్రతదీక్ష పూర్తిచేసుకొని కైలాసంలోని శివుణ్ణి ఆరాధించడానికి వెళ్ళింది. అప్పుడు పార్వతీదేవి కైలాసంలో లేదు. తన పుత్రుల జన్మదినోత్సవాలకై వెళ్ళింది. శివుడు ఏకాంతంలో వున్నాడు. మధుర మహాదేవుని కొలుచుకొంది. అతడు ఆమెపై మరులుకొన్నాడు. రహస్యంగా సంగమించాడు. అంతలో పార్వతి అక్కడకు వచ్చింది. మధుర వక్షోజాలపై శివుని భస్మపు మరకలు ఆమెకు కనిపించాయి. ఆగ్రహించి

మధురను శపించింది. 13 సంవత్సరాలు కప్పగా ఒక నూతిలో పడి వుండమంది. శివుడు ఈ శాపం విని నివ్వెరపోయాడు. తర్వాత మధుర కప్పగా పడివున్న నూతివద్దకు శివుడు వెళ్ళాడు ఊరడించాడు. పన్నెండేళ్ళ తరువాత ఆమె అందమైన కన్యగా ఆవిర్భవిస్తుందని, ఆమెను ఒక మహావీరుడు చేపట్టగలడని చెప్పాడు.

ఇది ఇలా వుండగా, పూర్వం మయుడు దేవలోకానికి వెళ్ళాడు. అక్కడ దేవకన్యల నృత్యాన్ని చూశాడు. అందులో హేమ అనే అప్సరసను చూసి మరులుకొన్నాడు. దేవతలు ఆ ఇద్దరికి వివాహం చేశారు. మయుడు హేమతో హిమవత్పర్వత సానువుల్లో కాపురం పెట్టాడు. అక్కడ హేమపురం అనే నగరాన్ని కట్టాడు. వాళ్ళకు మాయావి, దుందుభి అనే ఇద్దరు కుమారులు పుట్టారు. పుత్రిక పుట్టలేదన్న చింతతో మయుడూ, హేమా శివుని వరంకోసం తపస్సు చేయసాగారు. వాళ్ళు తపస్సు చేస్తున్నది మధుర కప్పగా పడివున్న బావిచెంతనే. వాళ్ళ తపస్సు ఫలించేసరికి ఈమె శాపకాలం అంతమైంది. అందాల భరిణగా మారి నూతిలోంచి ఆర్తనాదం చేసింది. మయుడూ, హేమా ఆ నూతిలోకి తొంగిచూశారు. పైకి తీశారు. ఆ అసమాన సౌందర్యవతికి మండోదరి అని పేరుపెట్టి ఇంటికి తీసికొనిపోయారు. దిగ్విజయ యాత్రను ముగించుకొని వస్తున్న రావణుడు మయుని ఇంటికి వచ్చాడు. మండోదరిని చూసి మరులుకొన్నాడు. శాస్త్రోక్తంగా వివాహమాడి ఆమెను లంకకు తీసుకుపోయాడు. ఇదీ ఉత్తర కాండలోని మండోదరి జన్మ వృత్తాంతం.

వాల్మీకి పేరు మీద చలామణి అవుతున్న రామాయణంలోనే వైదికులు ఇటువంటి ఘట్టాలను జైన కథల ప్రాచుర్య ప్రభావంవల్ల చేర్చుకోవలసి వచ్చిందంటే వాల్మీకి కృతం కాని ఇతర భారతదేశ రామాయణాల్లో ఎన్ని 'విడ్డూరాలు' చేరడానికైనా ఆస్కారం ఉంది. ఆ విడ్డూరాలే ఇతర దేశాల రామాయణాల్లో మనకు కనబడుతున్నాయి. నిప్పులేనిదే పొగరాదు.

మండోదరి రావణులకు సీత పుట్టిందా? దొరికిందా? ఈ ప్రశ్నలకు మన దేశంలోని ఇతర రామాయణాలలో సమాధానాలు వెతుకుదాం:

# "సీత పుట్టుక లంకకు చేటు"

లంకను నాశనం చేయడానికే సీత పుట్టిందనీ అసలు లంకలోనే పుట్టిందనీ భారతీయులు విశ్వసిస్తారు. "సీత పుట్టుక లంకకు చేటు" అనే సామెత అందుకే ప్రచారంలో ఉంది. అయితే సీత లంకలో ఎలాగ పుట్టిందో, ఎవరికి పుట్టిందో ఒక రామాయణం చెప్పినట్టు ఇంకో రామాయణం చెప్పదు. ఒక పురాణంతో మరో పురాణం ఏకీభవించదు. ఆనంద రామాయణంలో సీత జన్మకథ ఎలా ఉందో చూద్దాం:

పూర్వం పద్మాక్షుడనే రాజు మహాలక్ష్మిని పుత్రికగా పొందాలని తపస్సుచేశాడు. లక్ష్మి ప్రత్యక్షమయింది. తాను పరతంత్ర కనుక విష్ణువుని గూర్చి తపస్సు చేయమని చెప్పింది. పద్మాక్షుడు అలాగే చేశాడు. విష్ణువు ప్రత్యక్షమై కామితార్థంగా ఆ రాజుకు ఒక మాతులుంగ ఫలాన్ని ప్రసాదించాడు. అందులోంచి ఒక సౌందర్యరాశి జన్మించింది. రాజు ఆమెకు పద్మ అని పేరు పెట్టాడు. ఆమెకు యుక్త వయస్సు రాగానే పద్మాక్షుడు స్వయంవరం చాటించాడు. రాక్షసులు అనేకులు వచ్చారు. ఆకాశ నీలవర్ణంచేత ఎవడు తన దేహాన్ని పరిలేపనం కావించుకోగలడో వాడికి పిల్లనిస్తానన్నాడు. పద్మాక్షుడు పెట్టిన నియామకానికి కోపించి స్వయంవర మంటపాన్ని, సర్వసన్నాహాలనీ నాశనం చేశారు

పద్మాక్షుడు మరణించాడు. అతనితో అతని పదివేల మంది రాణులు సహగమనం చేశారు. పద్మ సైతం ఆ విచారాన్ని భరించలేక అగ్నిలోనికి దుమికి అందులోనే ఉంటూంది. రాక్షసులందరూ ఆమె కోసం గాలించి విఫలులై వెళ్ళిపోయారు.

ఒకనాడు పద్మ అగ్నిలోంచి బయటకు వచ్చి విహరిస్తోంది. అప్పుడే రావణుడు తన విమానంలో పయనిస్తున్నాడు. ఆమెను చూశాడు. మోహించాడు. చెరపట్టబోయాడు. పద్మ మళ్ళా అగ్నిలోనికి దుమికింది.

మళ్ళా అందులో సురక్షితంగా ఉంటోంది. రావణుడు అగ్ని కుండాన్ని వెదికాడు. అతనికి పద్మదేహం రత్నపంచక రూపంలో దొరికింది. రావణుడు ఆశాభంగం చెందాడు.

ఆ పంచరత్నాలను అతడు ఒక పేటికలో పెట్టి తనతో లంకకు తీసుకు వెళ్ళాడు. ఆ పెట్టెను మండోదరికి బహూకరించాడు.

ఆ రాత్రి రావణుడు మండోదరిని పిలిచి పంచరత్నాలను శిరోభూషణాలుగా అలంకరించుకోమన్నాడు. మండోదరి ఆ పెట్టెను తెరవడానికి ప్రయత్నించింది. తెరవలేకపోయింది. రావణుడు కూడా ప్రయత్నించి విఫలుడయ్యాడు. పేటికను బద్దలు కొట్టించారు. అందులో పంచరత్నాలకు బదులు బాలపాపగా పద్మ కనిపించింది. పద్మాక్షుని కుటుంబానికీ, రాజ్యానికీ సర్వానికీ నాశనకారణమైన ఆ బిడ్డను లంకలో ఉంచుకొనడం శ్రేయస్కరం కాదని, ఆ బిడ్డను పెట్టెతోపాటు ఎక్కడైనా విడిచి పెట్టమని మండోదరి రావణుని ప్రార్థించింది. రావణుడు అంగీకరించాడు. పెట్టెను మూసేలోగా ఆ బాల "నేను లంకకు మళ్ళా వస్తాను. నిన్నూ, నీ వంశాన్ని నాశనం చేస్తాను" అని రావణుని శపించింది.

రావణుని సేవకులు ఆ పేటికను లంక నుంచి తీసుకొని వెళ్ళి మిథిలలో ఒకచోట భూమిలో పాతిపెట్టారు. అది ఒక బ్రాహ్మణుని పొలం. ఒకనాడు విప్రుడు పొలాన్ని దున్నుకుంటూ వుండగా నాగలికి పెట్టె తగిలింది. బ్రాహ్మణుడు తవ్వి చూశాడు. పెట్టె పూర్తిగా బయటపడింది. నేలలోనూ, గనులలోనూ దొరికిన ద్రవ్యమంతా రాజుకి చెందుతుంది. కనుక ఆ బ్రాహ్మణుడు పెట్టెను తీసుకుపోయి జనక మహారాజుకు సమర్పించాడు. జనకుడు పద్మను పెట్టెనుంచి తీసుకొని 'సీత' అని పేరుపెట్టి పెంచసాగాడు. ఇదీ ఆనంద రామాయణం సారకాండ తృతీయ సర్గలోని సీత పుట్టుకకు సంబంధించిన కథ.

ఈ కథలో జైన ప్రభావం కనబడుతుంది. మణిపద్మాలు పూర్తిగా జైన సంకేతాలు. ఈ తాంత్రిక చిహ్నాల గురించి తర్వాత విశదపరుస్తాను. జైనరామాయణాన్ని "పద్మ చరిత్ర" అనే పిలుస్తారు. ఆనంద రామాయణంలోని లక్ష్మీదేవి అవతారంగా పద్మను మలచడానికి ప్రయత్నాలు జరిగాయి. విష్ణుపత్నిగా లక్ష్మీదేవి పురాణాల్లో రూపం పొందుతున్న

రోజుల్లోని కథ ఇది. విష్ణువుకు ఎంతమంది భార్యలో, ఎవరెవరు భార్యలో, ఇంకా స్థిరపరచని రోజుల్లో జైనుల పద్మను వైదికులు వేదవతిగా మలచుకొన్నట్టు కనబడుతుంది. దీనిని దేవీ భాగవతంలో చూడవచ్చు.

ఇవాళ ఏ హిందువునైనా పిలిచి, బ్రహ్మ భార్య ఎవరు అంటే సరస్వతి అని తడుముకోకుండా చెప్తాడు. అతడే విష్ణువు భార్య పేరు లక్ష్మి అనీ, శివుని భార్యలలో ఒకామె గంగ అనీ చెప్పగలడు. అయితే దేవీ భాగవతం ప్రకారం గంగా, లక్ష్మి, సరస్వతులు ముగ్గురూ విష్ణుమూర్తి భార్యలే. ఈ భార్యలు ముగ్గురితో ఒకనాడు విష్ణుమూర్తి సరస సంభాషణలతో వినోదిస్తున్నాడు. అప్పుడు గంగాదేవి విష్ణువు వంక సాభిప్రాయ సూచకమైన అనురాగ వీక్షణాలతో చూసింది. వెంటనే సవతుల కయ్యం ఏర్పడింది. దానిని సర్దుబాటు చేసుకోలేని స్థితిలో శాపాలు వర్షించాయి. నదీరూపం పొందమని సరస్వతి గంగను శపించింది. గంగకూడా అదే శాపాన్ని సరస్వతికి ఇచ్చింది. భూలోకంలో మొక్కగా పుట్టమని లక్ష్మికి సరస్వతి శాపం ఇచ్చింది. ఈ పరస్పర శాపాల తరువాత విష్ణుమూర్తి లక్ష్మిని చూసి, భూలోకంలో ధర్మధ్వజుడనే రాజు ఇంట తులసిగా జన్మించమన్నాడు.

ధర్మధ్వజుడు అప్పుడు తన సోదరుడు కుశధ్వజునితో పాటు లక్ష్మీదేవిని ఉపాసిస్తూ తపస్సు చేస్తున్నాడు. ఆమె వారికి ప్రత్యక్షమై ఇద్దరికీ చెరొక కుమార్తెగా ప్రభవిస్తానని వరమిచ్చింది. లక్ష్మీదేవే తులసిగా ధర్మధ్వజునికీ, వేదవతిగా కుశధ్వజునికీ పుత్రికా రూపాన జన్మించింది. వేదవతి విష్ణువే తన భర్త కావాలని భావిస్తోంది. ఆమెను శంభుడనే రాక్షసుడు కామించాడు. ఆమె తీక్షణ దృక్కులకు భస్మమై పోయాడు. శంభుడిలాగే రావణుడు కూడా వేదవతిని వాంఛించాడు. ఈసారి వేదవతే భస్మమైపోయింది. ఆ భస్మాన్ని రావణుడు ఒక పేటికలో భద్రపరిచి తనతో లంకకు తీసుకువెళ్ళాడు.

ఒక ఏకాంత ప్రదేశంలో రావణుడు ఆ పేటికను పెట్టాడు. దానిని రోజూ దర్శిస్తూ వుండేవాడు. ఆ పేటిక లంకలో ప్రవేశించినది మొదలు అనర్థాలు ఏర్పడ్డాయి. నారదముని సలహావల్ల రావణుడు ఆ

పేటికను సముద్రంలో పడవేయించాడు. ఒడ్డుకు కొట్టుకు వచ్చిన ఆ పెట్టెను దొంగలు ఎత్తుకుపోయి అడవిలో పాతిపెట్టారు. అది మళ్ళా వాళ్ళకు కనబడలేదు. పేటికలోని భస్మం ఒక బాలిక రూపాన్ని ధరిస్తోంది. ఒక యజ్ఞం చేయాలని జనకుడు ఆ అడవిని కొట్టించి నేలను దున్నిస్తున్నప్పుడు పేటిక బయటపడింది. అందులోని బాలికను తీసుకొని 'సీత' అని పేరు పెట్టి జనకుడు పెంచసాగాడు.

ఇది దేవీ భాగవతంలో కనిపించే సీత జన్మ వృత్తాంతం, బ్రహ్మ వైవర్త పురాణంలోకూడా వేదవతి కథ వుంది. ఇతర పురాణాల్లో కూడా కనబడే ఈ కథల సారాంశం ఒక్కటే. అది "సీత పుట్టుక లంకకు చేటు" అన్నదే. ఇవి క్రమంగా సీతను అయోనిజను చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. ఆదిమ వాల్మీకేతర రామకథలలో వివాహానికి పూర్వం సీతారాములకున్న రక్తసంబంధాన్ని మరపింప చేయడానికి అంచెలంచెలుగా పనికివచ్చాయి. రామ కథలోని ఇతర పాత్రలకు, సీతా రాములకు ఎటువంటి రక్తసంబంధాలు ఉన్నాయో ఇతర దేశాల రామ కథలను మళ్ళా ంచి చూద్దాం.

ఒక రామాయణ కథ ప్రకారం హనుమంతుడు సీతారాముల కుమారుడే!

# హనుమంతుడు ఎవరి కుమారుడు?

పనిలో పని "స్వరాజు పెళ్ళిలో గుర్రాజుకో పోచ" అని సామెత చెప్పినట్టు రాముడికి సీత ఏమౌతుందన్న పరిశోధనతోనే "హనుమంతు డెవరి కొడుకు?" అనే సమస్యను కూడా పరిశీలించడానికి ప్రయత్నిద్దాం. వాల్మీకి రామాయణం ప్రకారం హనుమంతుడు వాయుదేవుని కుమారుడు. ఇందుకే 'పవనపుత్రుడు', 'మారుతి' అనే పేర్లు అతనికి వచ్చాయి. వాల్మీకి రామాయణంలోని చాలా శ్లోకాలలో "హనుమాన్" అన్న మాట రాగానే "మారుతాత్మజః" అనే మాటతోనే పాదపూరణ జరగడం గమనించదగ్గ విషయం.

మాటవరసకు హనుమంతుడి తండ్రి వాయుదేవుడనే ఒప్పుకుందాం. అతని తల్లి ఎవరు? అతడు అంజన కుమారుడనీ, అందుకే అతణ్ణి ఆంజనేయుడంటారనీ చెప్పుకోవచ్చు. ఈ అంజన ఎవరంటే ఆమె అహల్యకు స్వయాన కూతురు. తల్లే కుమార్తెను కోతిని కనుమని శపించింది. ఈ శాపానికి కారణం తరువాత చర్చిద్దాం. ఈ పూర్వ కథల వల్ల హనుమంతుడు అహల్య మనుమడు. అమ్మమ్మ రామపాదం వల్ల శాప విమోచనం పొందితే మనుమడు రామపాదాల చెంత శాశ్వతంగా సేవలు చేస్తూ ఉంటాడు. ఇది ఇవాళ ప్రచారంలో వున్న హనుమద్రాముల సంబంధం.

అయితే, మలేషియాలో చెప్పుకొనే ఒకానొక రామకథవల్ల హనుమంతుడు సాక్షాత్తూ సీతారాముల బిడ్డ! అరణ్యవాస సమయంలో సీతారాములు ఒక కొలనులో జలక్రీడలాడుతున్నారు. నీళ్ళలో ఆ దంపతులు వానరులుగా మారిపోయారు. ఆ రూపంలోనే వాళ్ళు క్రీడించారు. సీత గర్భవతి అయింది. ఆ జల వినోదంలో వాళ్ళు అలాగే ఉండగా లక్ష్మణుడు వచ్చి వాళ్ళను ఒడ్డుకు చేర్చాడు. వాళ్ళకు పూర్వపు మానవ రూపాలు

వచ్చేశాయి. సీత గర్భంలో వున్న వీర్యాన్ని బాయుబాటా (వాయు భట్టారకుడు) సంరక్షణ చేసి, దేవి అంజతి (అంజనాదేవి) గర్భంలో నిక్షిప్తం చేశాడు. శ్రీరాముని సంకల్పం ప్రకారం సహజ కుండలాలున్న మానవ ముఖంతో, వానరదేహంతో హనుమంతుడు అంజనకు జన్మిం చాడు. ఇదీ మలేషియాలో ప్రచారమైన హనుమంతుని జన్మకథ.

సయాం దేశంలో మరొక రకం కథ ప్రచారంలో ఉంది. పూర్వం సాకేతపురాన్ని గౌతముడు పాలిస్తూ ఉండేవాడు. అతనికి కాలా అచనా (కాలాంజన) అనే భార్య హోమకుండంలో లభించింది. ఆ ఇద్దరికి స్వాహా అనే కుమార్తె జన్మించింది. ఇంద్రాది దేవతలు రామకార్యానికి యథాశక్తి తోడ్పడదలిచారు అందుచేత కాలా అచనాతో ఇంద్రుడూ, ఆదిత్యుడూ వ్యభిచరించారు ఇంద్రుడివల్ల కాకాస్పిరి అనే కొడుకూ, ఆదిత్యునివల్ల సుగ్రీబ్ అనే కుమారుడూ ఆమెకు పుట్టారు. తల్లి చేసిన ఆ చీకటి తప్పులను స్వాహా తండ్రికి చెప్పింది. గౌతముడు ఆగ్రహించాడు. ఆ కుమారులను నీళ్ళలో పారేశాడు. వానరులను కమ్మని శపించాడు. (కాకాస్పిరి ఖీట్కిన్‌లో కోట కట్టుకుని సకల వానరులకూ సార్వభౌము డయ్యాడు) భార్య కాలా అచనాను బండరాయివి కమ్మని శపించాడు. (ఈ రాతినే ఇతర రాళ్ళతోపాటు సేతుబంధనానికి వాడుకొన్నారు. అప్పుడే ఆమెకు శాపవిమోచనమైంది.)

ఈశ్వర శాసనంవల్ల వాయువు స్వాహా దేవివల్ల హనుమంతుణ్ణి కన్నట్టు సయాం కథ చెప్తుంది. స్వాహాదేవి హనుమంతుణ్ణి ముప్పయి మాసాలు మోసింది. పుట్టేటప్పుడే హనుమంతుడు పదహారేళ్ళ బాలా కుమారుడిగా పుట్టాడు. అతడు శ్వేతవర్ణుడు. (అందుకే సయాంలో హను మంతుణ్ణి తెల్లకోతి అంటారు.) కొన్ని కథల ప్రకారం హనుమంతుడికి నాలుగు ముఖాలూ, ఎనిమిది చేతులూ అని సయాం దేశీయులు చెప్పు కొంటారు. మన భారతదేశంలో పంచ ముఖాంజనేయుడు ప్రసిద్ధుడే.

హనుమంతుడికి అయిదు ముఖాలు ఎందుకొచ్చాయి? అని తీరు బాటుగా పరిశోధించుదాం. వాల్మీకి రామాయణ రచనా కాలానికి దక్షిణ

భారతదేశంలో వానరపూజ చాలా విరివిగా వుండేది. ఆ కోతిని రాముని బంటుగా చేయడానికి పురాణ కల్పనలు అవసరమొచ్చాయి. ఇవాళ వాల్మీకి రామాయణంలో హనుమంతుడు రామదూత కాని, ఆదిమ రామాయణాలలో వాలినే రామదూతగా ముందు మలచుకొన్నారు. అది లంకలోని రామకథవల్ల తెలుస్తుంది. ఈ కథవల్లనే సీతమ్మకు ముగ్గురు కొడుకులని కూడా తెలుస్తుంది.

శ్రీలంకలో "కొహంబకంకరియ" అన్నది ఒక ముఖ్యమైన జాతర. మేళతాళాలతో, నృత్యగీతాలతో దీనిని జరుపుతారు. ఈ జాతరలో నర్తకులు ప్రాచీన గాథలు కథనం చేస్తారు. అందులో ఒక గాథ 'సీత'కు సంబంధించినది.

శ్రీరాముడు విష్ణుమూర్తి అవతారమేగాని అంతటివాడికి సైతం శని బాధ తప్పలేదు. ఆ దుర్దశలో రాముడు సీతను విడిచిపెట్టి ఏనుగు రూపాన్ని ధరించి అడవుల్లో తిరగసాగాడు. శని మహాదశ ఏడేళ్ళూ ఇలా గడపదలచాడు. రాముడు లేని సమయంలో రావణుడు సీతను లంకకు ఎత్తుకుపోయాడు ఆమె మూడు నెలలు గడువు కోరింది. ఆ మూడు నెలలు ఆమె సౌశీల్య వ్రతం ఆచరిస్తోంది. గడువు దాటాక ఆమె రావణుని చిత్తమొచ్చినట్టు నడుచుకోవచ్చు.

ఏడేళ్ళ తరువాత రాముడు వచ్చాడు - సీత కనబడక వెదకసాగాడు. దారిలో వాలిని కలుసుకున్నాడు. వాలికూడా రాముడి అవస్థలో ఉన్నవాడే. అతని భార్య వానరరాజుతో లేచిపోయింది. వాలి రాముని సహాయం అర్థించాడు. తనకు తన భార్యను సంపాదించుకొనడంలో సహాయం చేస్తే రావణుని మోసగించి సీతను తీసుకువస్తానన్నాడు. రాముడు అంగీకరించి వాలి శత్రువును సంహరించాడు. వాలికి మూడు వరాలు ఇచ్చాడు. నీళ్ళమీద నడవగలగడం, నిప్పులవల్ల హాని తాలగడం, బాణాలవల్ల బాధ లేకపోవడం అనేవి ఆ మూడు వరాలు.

వాలి రావణుని ఉద్యానవనం ప్రవేశించాడు. రావణుని దృష్టిలో పడడానికి చెట్ల ఫలాలని తినసాగాడు. రకరకాల చేష్టలు చేశాడు. కావలివాళ్ళు ఏమీచేయలేకపోయారు. సీతాసమేతుడైన రావణుడు ఇది

పరిక్షిస్తూనే ఉన్నాడు. వాలి తోకకు నూనె గుడ్డలు చుట్టి నిప్పంటించమని సీతే సలహా ఇచ్చింది. వాలి లంకాదహనం చేశాడు. ఆ గందరగోళంలో వాలి సీతను ఎత్తుకొచ్చి రాముడికి అప్పగించాడు.

సీత గర్భవతిగా వున్నప్పుడు రాముడు దేవకార్యాల మీద ఇల్లు వీడి వెళ్ళాడు. అప్పుడు ఉమ సీత దగ్గరకు వచ్చింది. లంకలో సీత ఎలా జీవితం గడిపినది తెలుసుకోవాలని ప్రశ్నించింది. రావణుడు ఎలా వుంటాడో బొమ్మగీసి చూపమంది. సీత బొమ్మ వేసింది. అంతలో రాముడు ఇంటికి వచ్చాడు. సీత బొమ్మను మంచం కింద దాచింది. రాముడు మంచం మీద కూర్చున్నాడు. మంచం ఆడడం మొదలెట్టింది. రాముడు మంచం కింద వెదికాడు. రావణుని చిత్రం కనబడింది. రాముడు ఆగ్రహించాడు. తన తమ్ముడు "శమనుణ్ణి" పిలిచాడు. సీతను అడవుల్లోకి తీసుకెళ్ళి శిరచ్ఛేదం చేయమన్నాడు. శమనుడు సీతను హిమాలయాలకు తీసుకువెళ్ళి ఒక ముని ఆశ్రమం దగ్గర విడిచి పెట్టాడు. ఏదో జంతువు నెత్తురులో తన కత్తి తడిపి రాముడికి చూపించాడు.

ఆశ్రమం దగ్గర సీత నిద్రలేచింది ఏడిచింది. ''వలమిగ'' ఋషి ఆ ఆక్రందన విని ఆమెకు ఆశ్రయమిచ్చాడు. సీత ఒక బిడ్డను కన్నది. ఒకనాడు సీత ఆశ్రమంలో లేనప్పుడు బిడ్డ కిందపడ్డాడు. ఏడవసాగాడు. ఋషి బిడ్డను కానలేకపోతాడు. అందుచేత మంచం మీద ఒక పద్మాన్ని పడవేశాడు. అది బిడ్డ రూపం ధరించింది. సీత తిరిగి వచ్చి మంచంమీద బిడ్డకు పాలిచ్చింది. అప్పుడు మంచంకింద బిడ్డ గుక్కపట్టాడు. ఆ బిడ్డను సీత చూసింది. ఋషి దగ్గరకు వెళ్ళింది. అతడు జరిగింది చెప్పాడు. ఆమె నమ్మలేక పోయింది. తనకు నమ్మకం కలిగేటట్టు ఇంకోసారి ఆ మహత్తు చూపెట్టమంది. ఋషి దర్భపుల్లను తీసుకొని ఇంకో బిడ్డను సృష్టించాడు. సీత ముగ్గురు బిడ్డలను పెంచింది. ఏడోయేడు రాగానే ఆ బిడ్డలు మలయా దేశానికి వెళ్ళి భవనాలు కట్టుకున్నారు. అక్కడే జీవించారు. 'శందవిందు' 'మల' 'కిత్రి' అన్నవి వాళ్ళ పేర్లు.

ఇది సింహళంలో ప్రచారమైన జానపద గాథ. దీనిని గ్రామీణులు పవిత్రమైన పండుగ చేసుకుంటూ పాడుకుంటారు. తరతరాల నుంచి

ఇది అనుశ్రుతంగా వస్తూంది. దీనికి క్రీస్తుశకం 15 వ శతాబ్దం నుంచి సాహిత్య సాక్ష్యాలు ఉన్నాయి. ఈ జానపద గాథను శ్రీ సి ఇ. గోడా కుంబరగారు రాయల్ ఏషియాటిక్ సొసైటీ వారి పత్రిక (1946 పుటలు 14_22)లో తొలిసారి లోకానికి తెలియజేశారు.

శ్రీలంకలో విభీషణాలయాలు ఉన్నాయి. పుత్రసంతానం కోసం విభీషణుడికి మొక్కుకొంటారు. రామాయణంలోని ఒకే ఒక పాత్రకు లంకలో కోవెల ఉన్నట్టు-సీతారాములను తప్పించి-(ఇతర రామాయణ పాత్రలకు లేని) ప్రత్యేక ఆలయ మర్యాద భారతదేశంలో ఆ హనుమంతుడికి మాత్రమే ఉండడం కొన్ని ప్రాచీన మతాచారాలను సూచిస్తున్నది.

# హనుమంతుడు ఎవరి కుమారుడు–2

లంకలోని "కొహంబ కంకరియ"జాతరలో గానంచేసే రామకథలో ఒక విశేషం గమనించాము. వాల్మీకి రామాయణంలో హనుమంతుడు చేసే పనులన్నీ లంకలోని కథలో వాలే చేయడం చూశాము ఒక్క వాలినే 'రామదూత'ను చేసిన ఈ కథ కొంతకాలం కొన్ని ప్రాంతాలలో విరివిగా ప్రచారంలోవుండి, క్రమేణా సింహళంలోని ఒకనొక ప్రదేశంలో ఏడాదికో జాతరలోనే వినిపిస్తోంది. అది అత్యంత ప్రచారంలో వున్నప్పుడు "వాలి రామదూత" అని విశ్వసించే ప్రజలు వున్నట్టుండి వాల్మీకి రామాయణం విన్నారనుకోండి. 'ఇదేమిటి, మన వాలి చేసేపనులు ఇంకొకడు చేస్తున్నాడు?' అని ఆశ్చర్య చకితులు కావచ్చు. కొందరు ఆగ్రహించి ఆవేశపరులు కావచ్చు. వాళ్ళు హనుమంతుణ్ణి రామదూతగా స్వీకరించక పోవచ్చు. కానీ కొన్ని తరాలు గడుస్తూ వుండగా వాలి స్థానంలో హనుమంతుణ్ణి ప్రజలు అంగీకరించడానికి అనువైన కల్పనలు జరిగి వుండాలి.

అటువంటి కల్పనలు జరిగాయి. వాలి కన్న హనుమంతుడే గొప్పవాడు కాబట్టి అతడే రామదూత కావడానికి అర్హుడు అన్న భావం ప్రజల్లో నాటుకొనడానికి దోహదకారులైన కట్టుకథల రచన జరిగింది. ఈ విషయాన్ని కంబ రామాయణంలోని పూర్వకాండ వ్యక్తపరుస్తోంది,

కంబ రామాయణం ప్రకారం హనుమంతుడి తల్లి అంజన. (తండ్రి ఎవరన్న ప్రశ్నకు తరువాత సమాధానం చూద్దాము.) ఆమె గర్భవతిగా ఉన్నప్పుడు కడుపులో ఉన్న హనుమంతుడికి వాలివల్ల చాలా ఇడుములు ఏర్పడ్డాయి. ఈశ్వరుని ప్రసాదంగా అంజనకు ఒక కుమారుడు పుట్టబోతున్నాడని, వాడు మహాబల పరాక్రమవంతుడు కాగలడని

వాలికి నారదుడు చెప్పాడు. నిజంగా అటువంటి బిడ్డే పుడితే వానర సామ్రాజ్యంలో తన స్థానానికి ముప్పు రాగలదని వాలి చాలా భయ పడ్డాడు. ఏం చేయాలో తోచలేదు. నారదుణ్ణే సలహా అడిగాడు.

అంజన గర్భంలో పంచలోహాల ద్రవాన్ని పోస్తేసరి- అసాధ్యం కూలిపోతుంది అని నారదుడు చిట్కా చెప్పాడు. అంజనకు గర్భస్రావం కలిగించడానికి వాలి నిశ్చయించాడు. బంగారం, రాగి, ఇనుము, తగరం, తుత్తునాగం కరిగించి - ఆ అయిదు లోహాల ద్రవాన్ని అంజన గర్భంలోకి చేర్పింప చేశాడు. అయితే ఈ ప్రయత్నం కీడు చేయడానికి బదులు మేలే చేసింది. ఆ పంచ లోహాల ద్రవం బిడ్డను చంపడానికి బదులు అవి అతనికి నిత్య భూషణాలయ్యాయి. అందుకే హనుమంతుడు సహజ కుండలాలతో జన్మించాడు. ఇదీ కంబ రామాయణంలో వాలి తన స్థానం కాపాడు కోవడానికి చేసిన ప్రయత్నం. (చూ॥ వేట్టం మణి గారి పురాణ సర్వస్వం.)

దీనివల్ల వాలి తన స్థానాన్ని కాపాడుకోవడంలో భ్రూణహత్యకు వెనుదీయలేదు. ఇది మహాపాపం. అందుచేత ప్రజల దృష్టిలో వాలిమీద సానుభూతి తగ్గిపోతుంది. రాను రాను అదే జరిగింది. ఒకనాడు వాలిని రామదూతగా నమ్మిన వాళ్ళలోకూడా వాలిపట్ల అనుమానం, అనాదరణ, అసహ్యం మొదలైనవి అంచెలుగా వస్తాయి. నిజానికి వాలి తన స్థానం నిలుపుకొనడానికి తాపత్రయం చెందాడన్న విషయానికి ఇంకో అర్థం చెప్పవచ్చు. వాలిని రామదూతగా నమ్మేవాళ్ళు ఆ స్థానం అతనికి నిలవ డానికి చాలా తాపత్రయ పడ్డారు గాని అది ఫలించలేదని భావించాలి. ఇక్కడే ఇంకో విషయాన్ని గమనించాలి. వాలికి ప్రాధాన్యమున్న కథ శ్రీలంకలో ప్రచారమైతే, ఆ లంకకు అత్యంత సమీపాన వున్న తమిళ దేశపు రామకథలోనే వాలిని ఆస్థానం నుంచి తొలగించే వీరుని జన్మ కథ రూపొందింది. ఇది కేవలం యాదృచ్ఛికం కాదేమో!

అంజన గర్భవాసంలో హనుమంతుడున్నా అది ఆమెకు సహజ గర్భం కాదు. పార్వతీదేవి కడుపులోని శిశువును తీసుకొచ్చి అంజన గర్భంలోనికి చేర్చారు. దీనికి ఒక కారణం వుంది. పూర్వం పార్వతీ

పరమేశ్వరులు గజరూపధారులై విహరించారు. క్రీడించారు. ఆ క్రీడ ఫలితంగా గణేశుడు జన్మించాడు. ఆ తర్వాత ఆ ఆదిదంపతులు అరణ్య సీమలో వానర రూపులై వినోదించి, రమించారు. అందువల్ల పార్వతీదేవి గర్భవతి అయింది. వానరుడికి తల్లిననిపించుకొనడం ఆమెకు మనస్కరించలేదు. ఇది కనిపెట్టి శివుడు తన యోగశక్తులచేత ఆమె గర్భంలో ఉన్న పిండాన్ని సంకర్షణం చేసి వాయుదేవునికి అప్పగించాడు. ఆ పిండం శిశు రూపాన్ని పొంది బాగా ఎదిగే వరకు వాయువు అక్కడక్కడ సంచరించి, ఆ పిమ్మట ఆ బిడ్డను అంజన అనే వానరకాంత గర్భంలోనికి చేర్చాడు. (అప్పటికే ఆమె మగనాలు; ఆమె భర్త పేరు కేసరి.) ఈ గర్భాన్నే వాలి ఛేదించాలని చూశాడు.

శివ వీర్యంవల్ల హనుమంతుడు జన్మించాడన్నది సారాంశం. దీని వల్ల శివ వీర్యాన్ని వాయువు బట్వాడా చేసినవాడే అవుతున్నాడుగాని హనుమంతునికి తండ్రి కావడం లేదు. మరి హనుమంతుడు శివ వీర్య సంజాతుడని, వాయుపుత్రుడని ఏకకాలంలో చెప్పడమెలాగ? ఈ సమస్యను భవిష్యపురాణం పరిష్కరించింది. ఆ పురాణంలోని 'ప్రతిసర్గ పర్వం'లో ఇలా వుంది:

ఒకప్పుడు శివుడు తన రౌద్రాకారంలో కేసరిని ఆవహించి అంజనతో రమించాడు. ఆ తరువాత వాయుదేవుడు కూడా కేసరిని ఆవహించి అంజనతో శయనించాడు. ఈ సంయోగద్వయంవల్ల అంజన గర్భవతి అయింది. అటు పిమ్మట బిడ్డను కన్నాక, వాడు అంద వికారంగా ఉన్నాడని కొండ శిఖరం నుంచి కిందకు విసిరేయబోయింది. అప్పుడు వాయుదేవుడు వచ్చి అడ్డుకొన్నాడు. బిడ్డను రక్షించాడు. ఈ పురాణ గాథవల్ల ఆంజనేయుడికి అసలు తండ్రి కేసరేకాక, శివుడూ, వాయువూ అనే మరో ఇద్దరు తండ్రులున్నట్టు తెలుస్తుంది.

వాయుదేవుని ప్రసక్తి కాక శివ వీర్యం అంజన గర్భంలోనికి ఎలా చేరిందో శివ పురాణం తెలియచేస్తుంది. అందులోని శతరుద్ర సంహితలో ఒక కథ వుంది. శ్రీ మహా విష్ణువు జగన్మోహిని రూపాన్ని దాల్చినప్పుడు ఆ మనోహర సౌందర్యాన్ని వీక్షించి శివుడు మరులుకొని

మహదానంద మోహవిభ్రమముడయ్యాడు. అప్పుడు వీర్యస్ఖలనమైంది. ఆ దివ్య వీర్యాన్ని సప్తఋషులు స్వీకరించి దానిని అంజన గర్భంలో నిక్షిప్తం చేశారు. అందువల్లనే హనుమంతుడు జన్మించాడు.

ఈ శివ పురాణంలోని కథవల్ల పార్వతీ పరమేశ్వరుల కలయిక వల్ల కాక, శివకేశవుల కలయికవల్ల అంజనేయుడు జన్మించినట్టు తెలుస్తూంది. అయితే హరిహర పుత్రుడిగా హనుమంతుడు కాక శాస్తవేన్ అయ్యప్పన్ అనే మరో ద్రావిడ దేవత ప్రసిద్ధుడయ్యాడు.

ఈ కథ లన్నిటివల్లా ఒక్కటి మాత్రం నిశ్చయంగా తేలుతుంది. హనుమంతుడి తండ్రి ఎవరైనా తల్లి మాత్రం అంజన అన్న విషయం రూఢికెక్కసాగింది. అయితే ఈమె పుట్టుపూర్వోత్తరాలు విభిన్నంగా ఉన్నాయి. ఒక సంప్రదాయం ప్రకారం ఈమె పూర్వజన్మ ఈ విధంగా ఉంది:

పూర్వం బృహస్పతి దగ్గర పుంజికస్థల అనే పరిచారిక ఉండేది. ఒకనాడు ఆమె పువ్వులు కోయడానికి తోటలోనికి వెళ్ళింది. అక్కడ ఇతర యువతీ యువకుల ప్రేమ కలాపాలను చూసి ఆమె కామోద్రిక్త అయింది. పువ్వులు కోయకుండా రిక్తహస్తాలతో ఆశ్రమానికి వచ్చి బృహస్పతిని ముద్దులతో ముంచెత్తింది. ఆమె చేసిన అపచారానికి బృహస్పతి ఆగ్రహించాడు. కోతిగా పుట్టమని శపించాడు. ఆమె పశ్చాత్తాపంతో శాపవిమోచన మార్గాన్ని చెప్పమంది. వానరభర్తతో కొన్నాళ్ళు కాపురం చేసి, శివవీర్యంవల్ల హనుమంతుడిని ప్రసవించాక శాపవిమోచనం కలుగుతుందని బృహస్పతి చెప్పాడు. శివ వీరాన్ని ఆమె ధరించిన విధానాన్ని వివిధ కథలు విభిన్న రూపంలో ప్రచారం చేశాయి.

హనుమంతుడు, గణేశుడు ఇద్దరూ పార్వతీపరమేశ్వరుల కుమారులే అన్న భావం మన తెలుగునాటకూడా కొంతకాలం కిందట ప్రచారంలో వుంది కాబోలు! శ్రీశైల దేవాలయములో కనిపించే ఒక అపూర్వశిల్పం ఈ సంగతిని చూచాయగా సూచిస్తున్నది. అందులో గణేశుడు పిల్లనగ్రోవి వాయిస్తూవుంటే ఆంజనేయులు తాళం వేస్తూ వుంటాడు. (చూ॥ కేసి. అర్సన్‌గారి హనుమాన్ ఇన్ ఆర్ట్ అండ్ మైథాలజీ - ప్లేట్ నెం. 98.)

మొత్తంమీద ఈ కథలవల్ల శైవులు ఆంజనేయుణ్ణి తమ వాణ్ణిగా చేసుకొనడం గాని, లేక శైవుల వానర దైవాన్ని వైష్ణవ రామకథకులు తమ దైవానికి బంటుగా చేసుకొనే ప్రయత్నాలు గాని కనబడతాయి. అయినా హనుమంతుడు రాముని కొడుకే అన్న విశ్వాసం మరికొన్ని దేశాల రామకథలవల్ల తెలుస్తుంది. వాటిని కూడా పరిశీలించాక హనుమంతుడికీ శైవులకీ శాయుక్తియులకీ గల సంబంధాలు చూద్దాము.

# హనుమంతుని పుట్టుపూర్వోత్తరాలు

శైవులు శివుడివల్లనే హనుమంతుడు జన్మించినట్టు కథలు సృష్టిస్తున్నప్పుడే ప్రాచీన వైదికార్యులు రాముడే హనుమంతుని తండ్రి అని చాటడానికి ప్రయత్నించినట్టుంది. ఈ ప్రయత్నంలో కిష్కింధ కాండ లోని వ్యక్తులు వేరే ప్రాథమిక రూపాలను సంతరించుకొనడం మనం గమనించవచ్చు. ఈ ప్రయత్నాల అవశేషాలను మలేషియా, లావోస్ రామకథలలో మనం చూడగలం.

మలేషియాలోని ఒక కథ ప్రకారం హనుమంతుడు సీతారాముల ఇద్దరి కుమారుడని ఇంతకు ముందు వ్యాసాల్లో ఒకదానిలో చూశాం. ఇప్పుడు లావోస్ దేశంలో చెప్పుకొనే మరొక రామకథ గమనిద్దాం. దీని వల్ల హనుమంతుడి తండ్రి రాముడే అని తెలుస్తుంది. తల్లి మాత్రం సీత కాదు.

నిజానికి లావోస్ రామకథలో హనుమంతుడు సీతాపహరణం తరువాత జన్మిస్తాడు. రావణుడు సీతను ఎత్తుకుపోయాడు. ఆమె కోసం రాముడు అరణ్యాలలో అన్వేషిస్తున్నాడు. ఆ అన్వేషణలో అతడు ఒక చెట్టుక్రిందకు చేరాడు. దాని పండు తిన్నాడు. ఆ పండు తినీ తినగానే రాముడు ఒక కోతిగా మారిపోయాడు. అలాగ ఆ వానరరూపంలో అతడు మూడేళ్ళపాటు ఉండిపోయాడు.

అదే అరణ్యంలో 'ఫెన్‌గ్సి' అనే మునికన్య వుంది. ఆమె కూడా రాముడు ఏ చెట్టుపండు తిన్నాడో ఆ చెట్టు పండే తిన్నది. అందుచేత ఆమెకూ, రాముడికీ హనుమంతుడు పుట్టాడు. హనుమంతుడి తల్లి దండ్రుల గురించి తెలిసింది కనుక, ఈ లావోస్ కథను ఇక్కడతో వదిలిపెట్టవచ్చునుగాని, ఈ కథలో మరొక 'విడ్డూరం' కనపడుతుంది. కనుక మరింత పరిశీలిద్దాం.

వానర రాముని భార్య అయిన 'ఫెన్‌గ్సీ'కి 'సంగ్‌కిబ్' 'ఫబికన్' అనే ఇద్దరు సోదరులున్నారు. వీళ్ళ తల్లి శీలాన్ని తండ్రి శంకించాడు. ఆ అన్నదమ్ములిద్దర్నీ చిన్నప్పుడే నదిలోకి పారేశాడు. వాళ్ళు ఈదుకుని అవతలిగట్టు చేరుకొన్నారు. కాశి అనే నగరం కట్టుకొన్నారు. సంగ్‌కిబ్ (సుగ్రీవుడు), ఫబికన్ (వాలి)ల మధ్య ఏదో కారణం వల్ల విరోధం ఏర్పడింది వీళ్ళలో వాలికి రాముడు సహాయం చేశాడు. సుగ్రీవుణ్ణి సంహరించాడు. అతని భార్యను రాముడే వివాహం చేసుకున్నాడు. ఈ ఇద్దరికే అంగదుడు జన్మించాడు. హనుమంతుడూ, అంగదుడూ అన్నదమ్ములు గనుక ఆ ఇద్దరూ కలిసి సీత కోసం అన్వేషించారు.

ఈ లావోస్ రామకథలో హనుమంతుడు రాముడి కొడుకు కనుక సహజంగా అతనే రాముడి తరువాత రాజ్యం చేశాడు. రావణ వధ జరిగాక హనుమంతుడు వానర రూపాన్ని విసర్జించాడు. రాముడితో కలసి అయోధ్యకు వెళ్ళాడు. తండ్రితో పాటు రాజ్యం చేసి కొన్నాళ్ళకు హనుమంతుడు రాజ్యాన్ని పరిత్యజించాడు. వానప్రస్థానికి వెళ్ళిపోయాడు. ఇదంతా హనుమంతుడు రాముడి ఔరసపుత్రుడు కావడంవల్ల జరగవలసిన సహజ కార్యాలు.

ఈ లావోస్ రామ కథవల్లనే కాక ఇండోనీషియాలో మిగిలిన సాక్ష్యాల వల్లకూడా రాముడే హనుమంతుడి తండ్రి అని చెప్పవచ్చు. ఇండోనీషియాలో హనుమంతుడిని భక్తితో ఆరాధిస్తారు. అతడి బలపరాక్రమాలూ, మహత్తర శక్తులూ కీర్తించే స్తోత్రాలు అక్కడే గ్రంథస్థమై ఉన్నాయి. "కీలక" అనే స్తోత్రంలో హనుమంతుడిని "రామచంద్ర సూనుడు" అని పేర్కొన్నారు. దీనివల్ల లావోస్‌లో లాగే ఇండోనీషియాలో కూడా రాముడు హనుమంతుడి తండ్రి అనే విశ్వాసం ప్రబలమైనట్టు మనం చూడవచ్చు.

ఈ వివిధ కల్పిత గాథలన్నీ మన దేశం నుంచే ఆ దేశాలకు ఆదిలో వెళ్ళాయి. ఆ ప్రాచీన కాలంలోని రామాయణ గాయకులు గానం చేసే ఈ వివిధ జన్మవృత్తాంతాలు అక్కడ ఇంకా కనబడుతున్నాయి గాని, మనదేశంలో మరుగుపడ్డాయి. సత్యం తెలుసుకోవాలన్న జిజ్ఞాసతో పరిశోధకులు తవ్వి పైకి తీస్తేనే తప్ప మన దేశంలో కనబడే ఇటువంటి

సాక్ష్యాలు బయటపడవు. హనుమంతుడి పుట్టు పుర్వోత్తరాల గురించి లావోస్ మలేషియా ఇండోనీషియా రామకథలు చెప్పేటన్ని విడ్డూరాలు మన దేశంలో సైతం నిజానికి లేకపోలేదు. మాటవరసకి ఆనంద రామాయణంలో హనుమంతుడి జన్మకథను చూస్తే ఈ సంగతి విశదమవుతుంది. దాన్ని చూద్దాం:

సంతానం కోసం దశరథుడు పుత్రకామేష్టి చేశాడు. యజ్ఞ పురుషుడు ప్రత్యక్షమయ్యాడు. పాయసాన్నాన్ని ప్రసాదించాడు. దానిని దశరథుడు తన భార్యలు ముగ్గురికి పంచి ఇచ్చాడు. కైక తన భాగాన్ని పారేసింది. ఈ అదను కోసమే సరిగ్గా ఒక గ్రద్ద కాచుకొని ఉంది. కైక పారేసిన ఆ పాయసాన్ని అది ఎత్తుకు పోయింది. (ఈ గ్రద్ద సువర్చల అనే అప్సరస. బ్రహ్మ శాపంవల్ల పక్షి రూపాన్ని పొందింది.) ఆ గ్రద్ద ఆ పాయసాన్నాన్ని అలాగ నోట కరుచుకొని ఎగురుతూపోగా దాని ముక్కు నుంచి కొన్ని మెతుకులు కింద పడ్డాయి. అవి పడుతున్న చోట అంజన తపస్సు చేసుకుంటున్నది. ఆ మెతుకులు ఆమె చేతిలో పడ్డాయి. వాటిని ఆమె భక్షించింది. దివ్య శక్తులు గల ఆ పాయస భక్షణం వల్ల అంజనకు హనుమంతుడు జన్మించాడు.

లావోస్ రామకథ ప్రకారం హనుమంతుడు రామకుమారుడైతే ఈ ఆనంద రామాయణ కథనంవల్ల అతడు రామ సమానుడవుతున్నాడు. ఏ దివ్య-పాయసాన్నంవల్ల రాముడు జన్మించాడో అదే పాయసాన్నంవల్ల హనుమంతుడు ప్రభవించినట్టు ఈ వైనం విశదపరుస్తూంది. (సీత కూడా ఈ విధంగానే కాకి ఎత్తుకుపోయిన పాయసాన్నంవల్ల పుట్టినట్టు మలేషియా లోని రామకథ కథనం చేయడం మనం ఇంతకుముందు గమనించాం.)

పురాణ వ్రాతల పుట్టుపుర్వోత్తరాల గురించి ఈ విధమైన పరిశోధన మన పూర్వులు కూడా చేసి మానేసినట్టు కనబడుతుంది. 'సురుల జన్మం, శూరుల జన్మం, ఏరుల జన్మం ఎవరు తెలుసుకోగలరు?' అన్న ప్రశ్నతో దానిని విరమించారు. అయితే ఈ ఆధునిక కాలంలో ఏ నది ఎక్కడ పుట్టిందో ఎన్ని మలుపులు తిరిగిందో ఏయే వాగులను తనలో కలుపుకుందో ఏయే ప్రాంతాలలో ప్రవహిస్తుందో ఎన్ని చీలికలు చీలి ఎక్కడ సముద్రంలో కలుస్తుందో భూగోళ శాస్త్రజ్ఞులు బొమ్మలువేసి

మరీ చెపుతున్నారు. మన పురాణాలూ, ఇతిహాసాలూ జీవనదులవంటివి. వాటి ప్రవాహ స్వరూపాన్ని మనం తెలుసుకోవడం అవసరం.

ఇవాళ మనకు మతసంబంధమైన సంకుచిత దురభిమానాలు లేవు. జైనమైనా, బౌద్ధమైనా, వైదిక బ్రాహ్మణ మతమైనా మనకు ఒకటే. అవన్నీ ఒకే ఒక్క కుదుట్లోని మనుష్యుల మతాలే. మన ప్రాచీనుల ఉమ్మడి సంస్కృతికి అవి నిక్షేపాలు. నేడు ఆ మూడు వాఙ్మయాల నుంచి మరుగునపడిన విషయాలను సేకరించి సమన్వయం చేసుకొంటేనే గాని మన ఆదిమ సంస్కృతి నిసర్గ స్వరూపాన్ని వీక్షించలేము. ఆంత్రోపాలజిస్టులు ఏ విధంగా ఆదిమ జాతులవారి కథా గేయాలు, వీరగాథలు, పొడుపు కథలు, సామెతలు పరిశీలించి వాళ్ళవాళ్ళ మైథాలజీని అర్థం చేసుకొనేందుకు ప్రయత్నిస్తారో అలాగే మనం కూడా పురాణ గాథల పురాతన శిథిలాలను సహృదయంతో అర్థంచేసుకొని సమన్వయం చేయాలి.

హనుమంతుడిని శైవులూ తదితరులో తమ వాడుగా సొంతం చేసుకొనడానికి కారణాలు ఉన్నాయి. వాటిని పరిశీలిద్దాం.

# హనుమంతుడు ఎవరి ద్వారపాలకుడు?

రుద్రుడు అనార్యదైవం. అలాగే హనుమంతుడు కూడా ఇంకో అనార్యదైవం. ఈ ఇద్దరిని ఆర్యులు తమ దేవతల కోవలో కలుపుకొన్నారు. రుద్రాంశ సంభూతుడు లేక రుద్రావతారుడైన హనుమంతుడిని రాముడి బంటును చేశారు. అయితే, ఆదిలో హనుమంతుడి మీద హక్కు శైవులకే వుండేది. దీనిని వాళ్ళు అంత సులభంగా వదులుకోలేదు. చాలా పెద్ద యుద్ధమే జరిగింది. భారతదేశంలోని ఇతర ప్రాంతాలలో ఈ యుద్ధం గురించి చెప్పకొనకపోయినా వంగ రాష్ట్రంలో మాత్రం కావ్య రూపంలో గ్రంథస్థం చేశారు. కృత్తివాసుడు, కవిచంద్రుడు మొదలైన కవులు రామాయణాలు రాశారు. రామ కావ్యాలు రచించారు.

అటువంటి గ్రంథాలలో "శివ రామేర్ యుద్ధ" మన్నది ముఖ్యమైనది. శివుడికి, రాముడికి జరిగిన యుద్ధాన్ని ఈ కావ్యము కథనం చేస్తుంది.

వనవాసకాలంలో లక్ష్మణుడు కందమూలాలు, పళ్ళూఫలాలు సేకరించడానికి ఒక వనంలో ప్రవేశించాడు. అది శివుడి వనం. హనుమంతుడు ఆ వనానికి ద్వారపాలకుడు. అనుమతి లేనిదే లోనికి ప్రవేశించిన లక్ష్మణుడి మీద అతడు కలబడ్డాడు. ఇద్దరూ పోరాడసాగారు. అది దీర్ఘకాలం జరిగింది. లక్ష్మణుడు ఎంతకూ తిరిగి రాలేదేమా అని రాముడు ఆందోళన చెందాడు. తమ్ముడిని వెదుక్కుంటూ రాముడు బయలుదేరాడు. లక్ష్మణ, హనుమానులు యుద్ధంచేస్తున్న చోటుకు చేరుకున్నాడు. రాముడు రాగానే శివుడు కూడా అక్కడకు వచ్చాడు. ఇద్దరూ కలబడ్డారు. హోరాహోరిగా యుద్ధం చేశారు. ఆ భీకర యుద్ధంలో ఏ ఒక్కరూ విజయం పొందలేకపోయారు.

చివరకు ఈ శివ రామయుద్ధాన్ని శివుడూ, రాముడూ ఆపివేశారు. సంధి చేసుకొన్నారు. ఆ సంధి షరతుల ప్రకారం హనుమంతుడి సేవలను శివుడు రాముడికి ధారపోశాడు. ఆనాటి నుంచి తన పాత ఏలిక అయిన శివుడితో హనుమంతుడికి తెగతెంపులయ్యాయి. అప్పటినుంచే హనుమంతుడు రాముని బంటయ్యాడు. శివుని ద్వారపాలకుడు రాముని పాదసేవకుడయ్యాడు.

ఈ సందర్భంలో వాల్మీకి రామాయణంలోని ఉత్తరకాండను కొంచెం జ్ఞాపకం తెచ్చుకొవాలి. అందులో రావణుడు తనకు గల శాపాలను తానే చెప్పాడు. వానరునివల్ల హాని కలుగుతుందని నంది అతడిని శపించాడు. నంది శివుడి ద్వారపాలకుడు. రావణునికి నంది కోతిలా కనబడ్డాడు. అందుకే "కోతిముఖం" అని ఈసడించాడు. వెంటనే "ఆ కోతి వల్లనే నీకు మూడుతుంది" అని నంది శపించాడు. అందుకే లంకలో హనుమంతుడి పరాక్రమం చూశాక 'హనుమంతుడు నిజంగా ఆ నందికేశ్వరుడే కాబోలు" అని రావణుడు చాలా భయగ్రస్తుడయ్యాడు. (సుందరకాండ 50 వ సర్గ 35 వ శ్లోకం.) వృషభం కాక వానరం శివుడి ద్వారపాలకుడిగా ఒకనాడు ఉండేవాడని వాల్మీకి రామాయణం కూడా పరోక్షంగా ఒప్పుకొంటున్నది. అయితే ఇంతకూ హనుమంతుడు ఒక్క శివుడి ద్వారపాలకుడే కాడు, బుద్ధుని ద్వారపాలకుడనీ బౌద్ధగ్రంథాలు చెబుతాయి.

బెంగాలీభాషలోని రామాయ్ పండితుడనే కవి 'శూన్యపురాణ'మనే బౌద్ధకావ్యాన్ని క్రీస్తుశకం 10 వ శతాబ్దిలో రచించాడు. అత్యంత ప్రాచీన సంప్రదాయాలు అందులో కనబడతాయి. బుద్ధదేవుని ఆలయపు దక్షిణ ద్వారాన్ని హనుమంతుడు సంరక్షిస్తూ ఉంటాడని ఆ పురాణం చెబుతుంది. చంద్రుడు పశ్చిమ ద్వారాన్ని, సూర్యుడు తూర్పు ద్వారాన్ని కాపాడుతూ వుంటారు. ఈ సంగతినే శూన్యపురాణం ఇలా చెబుతుంది : "పొశ్చిమొ కొటల్ చంద్రో, దఖినతె హనుమంతొ పూర్బొదికె సుజ్జో అధికార్" (పుట 36).

బౌద్ధుల శూన్యపురాణం ప్రకారం హనుమంతుడు ఒక ద్వారపాలకుడు మాత్రమే కాడు. గొప్ప నిర్మాణదక్షుడు, శిల్పి. ఏవైనా బృహ

న్నిర్మాణాలు చేయవలసివస్తే హనుమంతుడి కౌశలాన్ని వాడుకొనేవారు. ఒకసారి సువర్ణరంజిత స్నానఘట్టాన్ని నిర్మించవలసి వచ్చింది. అందుకు హనుమంతుడే సమర్థుడు. దానిని అతడు చక్కగా పూర్తిచేశాడు. అందుకు సంతోషించి బుద్ధదేవుడు అతనికి తాంబూల సత్కారం చేశాడు. ఇలాగే శూన్యపురాణంలో హనుమంతుడి ప్రసక్తి చాలాసార్లు వస్తుంది.

ఈ సంగతులను తెలియచేస్తూ దినేష్‌చంద్రసేన్ గారు తమ ''బెంగాలీ రామాయణాలు'' అనే గ్రంథంలో ఇలా రాశారు :

"This indicates that some of the indigenous traditions of pre-historic India have survived in the vernaculor literatures, and that they refer to the remote age when Ramayana had not yet described the exploits of the Ape god.'' (పుట 54).

నిజమే; చారిత్రక విభాతసంధ్య ఉదయించడానికి పూర్వ ఘడియల్లో ఉంటున్న కొన్ని స్థానిక సంప్రదాయాలు కొన్ని దేశీయ సాహిత్యాలలో బతుకుతున్నాయి. అప్పటికి రామాయణం హనుమంతుడి వీర కృత్యాలను ఇంకా వర్ణించడం మొదలు పెట్టలేదు. అయితే, పై కథలలో శైవుల ద్వారపాలకుణ్ణి బౌద్ధులు కైవసం చేసుకున్నారో, లేక బౌద్ధుల ద్వారపాలక శిల్పాని శైవులు సొంతం చేసుకొన్నారో తెలియదు.

అయితే, ఈ ''ద్వారపాలకత్వం'' అనే అంశం ఇతర దేశాల రామాయణాలలో కనబడుతుంది. సాక్షాత్తు హనుమంతుడు కాకపోయినా అతని మాతామహుడు ఈ ద్వారపాలన చేశాడు. మలేషియాలోని ఒక రామకథ ప్రకారం గౌతముడు దశరథుని ద్వారపాలకుడి తమ్ముడు. (ఇంకొక రామకథ ప్రకారం గౌతముడు సాక్షాత్తు దశరథుని తమ్ముడు.) ఈ గౌతముడికే అహల్య వల్ల అంజన అనే కూతురు కలిగింది. ఆ అంజన కుమారుడే హనుమంతుడు. కాని ఈ మలేషియా రామకథలో హనుమంతుడి తల్లి అంజన అయినా తండ్రి మాత్రం రాముడే. అంజన తపస్సు చేసుకొంటున్నప్పుడు రాముడు చూసి ఆమెను మోహిస్తాడు. అతడి దివ్య వీర్య బిందు ద్వయాన్ని వాయుదేవుడు తీసుకువెళ్ళి ఆమె చేత అరగింప చేస్తాడు. హనుమంతుడు ఆమెకు జన్మించాక అతని కర్ణ

భూషణాల వల్లనే రాముడు తన బిడ్డను గుర్తిస్తాడని అశరీరవాణి ప్రకటిస్తుంది.

మలేషియాలోని ఇంకొక రామకథ ప్రకారం గౌతముడు దశరథుని తమ్ముడని పైన గమనించాము. అందువల్ల రాముడు గౌతముడికి కొడుకు వరస అవుతాడు. గౌతముడి కుమార్తె అయిన అంజనను చూసి రాముడు మరులుకొని ఆమెవల్ల బిడ్డను కంటే, రాముడికి సీత ఏమౌతుందన్న ప్రాథమిక ప్రశ్నలోని వావివరసల సమస్యే మళ్ళా ఇక్కడ మొలకెత్తుతుంది. అత్యంత ప్రాచీనమైన రామకథలలో ఎందుకీ నిషిద్ధ రక్తసంబంధం గురించి ఇంతగా తెలియవచ్చే ఘట్టాలను నిక్షిప్తం చేశారు? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం చాలా సులభమే. ప్రతి జాతి వంశ పారంపర్యంగా చెప్పుకొనే ప్రాచీన జ్ఞాపకాలను భక్తి శ్రద్ధలతో కాపాడుకొంటుంది. సంస్కృతిని సగర్వంగా నిలుపుకొంటుంది. మన ప్రాచీనులు అంతే చేశారు. ఆదిమకాలంలో ఏకోదరులు భార్యాభర్తలుగా జీవించేవారు. ఈ సంగతి బౌద్ధవాఙ్మయంలోకన్నా జైనవాఙ్మయంలో ప్రప్రథమ తీర్థంకరుని చరిత్రలో స్పష్టంగా కనబడుతుంది. ఆ చరిత్రను పరిశీలిద్దాం.

# జైన గ్రంథాలలో తొలి వావివరుసలు

మన ప్రాచీన చరిత్రను అర్థం చేసుకోవాలంటే వైదిక, బౌద్ధమతాలకు అనుబంధాలైన పురాణ, ఇతిహాసాలతోపాటు జైన పురాణాలను, సంప్రదాయాలను కూడా అధ్యయనం చేయాలి. క్రిందటి శతాబ్దంలో పాశ్చాత్య పండితులు వైదిక వాఙ్మయం మీదా, బౌద్ధగ్రంథాల పైనా ఎంతో కృషి చేశారు. జాకొబీ వింటర్‌నిట్జ్ వంటి కోవిదులు జైనమతం గురించి చిన్న గ్రంథాలు వ్రాసినా పెద్ద పరిశీలన మిగిలిపోయింది. ఈ శతాబ్దంలో భారతీయ, పాశ్చాత్య విద్వాంసులు ఆ కొరతను తీర్చుతున్నారు. బరోడా విశ్వవిద్యాలయంలో జైన వాఙ్మయంపై మంచి పరిశోధన జరిగింది. మంచి వ్యాసాలూ, ప్రామాణిక గ్రంథాలూ ప్రచురితమయ్యాయి.

జైన పురాణాలను బౌద్ధగాథలతో వైదికార్యుల ఇతిహాసాలతో తులనాత్మకంగా పరిశీలించితే చాలా కొత్త వ్యాఖ్యానాలకు అవకాశాలు కలుగుతాయి. జైన పురాణాలు వైదికార్యుల అష్టాదశ పురాణాలకు చాలా దగ్గరలో ఉంటాయి. రెండింటిలోనూ కొందరు వ్యక్తుల పేర్లు సమానంగానే ఉంటాయి. కొందరి చరిత్రలు కూడా సమానంగానే ఉంటాయి. జైనుల ప్రసిద్ధ పురాణ పురుషులను విష్ణుమూర్తి లీలావతార పురుషులను చేయడానికి వైదికార్యులు ప్రయత్నించారు. ఉదాహరణకు జైనులకు ఇరవైనలుగురు తీర్థంకరులున్నారు. వారిలో ప్రప్రథమ తీర్థంకరుని పేరు ఋషభుడు. ఇతడిని విష్ణుమూర్తి దాల్చిన ఇరవైరెండు లీలావతారాలలో ఎనిమిదవ అవతారంగా భాగవతం పేర్కొంటుంది. (చూ. పంచమ స్కంధం.) విష్ణుపురాణం ద్వితీయాంశంలోని ప్రథమాధ్యాయంలో కూడా ఋషభుని ప్రసక్తి వుంది. అయితే భాగవత విష్ణుపురాణాలలో కనిపించే ఋషభ చరిత్రవల్ల మన ప్రాచీన సాంస్కృతిక పరిణామం విశదమవదు.

జైనగ్రంథాలలో ఆదీశ్వర చరిత్ర ముఖ్యమైనది. ఇదే ప్రథమ తీర్థంకరుడైన ఋషభనాథుని చరిత్రను చాలా విపులంగా చెబుతుంది. ఇది హేమచంద్రసూరి రచించిన త్రిషష్ఠిశలాకాపురుష చరిత్ర అనే పది పర్వాల పురాణంలో ప్రథమ పర్వం (ఈ పురాణంలోని సప్తమ పర్వం లోనే జైన రామాయణం వుంది.) దాని సంగతి తర్వాత పరిశీలిద్దాం. గైక్వాడు ప్రాచ్య గ్రంథమాలలో ఈ గ్రంథం అచ్చుపడింది. అందులోని ఋషభ చరిత్రను మనం తర్కించుకొనే సమస్యను విశదం చేయడానికి వివరిస్తాను.

జైనుల మత గ్రంథాల ప్రకారం మొత్తంమీద ఈ విశ్వం నిత్యమైనది. శాశ్వతమైనది. దానికి ఆద్యంతాలు లేవు. కాలచక్రం నిరంతర పరిభ్రమణం చెందుతూ ఉంటుంది. ఆ పరిభ్రమణాన్ని రెండు మహత్తర యుగాలుగా విభజించారు. ఒక యుగాన్ని అవసర్పిణి అంటారు. రెండో దాన్ని ఉత్సర్పిణి అంటారు కాలచక్రం కిందికి దిగుతున్నప్పుడు అవసర్పిణి యుగం, పైకి లేస్తున్నప్పుడు ఉత్సర్పిణి యుగం. కాలచక్రానికి ఆరు కమ్ములు ఉన్నాయి. వాటిని అరము లంటారు. అవసర్పిణి యుగ లక్షణం ఏమిటంటే - మంచివన్నీ క్రమంగా అంతరిస్తూ చెడ్డవాటికి చోటు ఇస్తాయి. ఉత్సర్పిణి యుగంలో దీనికి విరుద్ధంగా జరుగుతుంది. కాలచక్రం ఒక సంపూర్ణ పరిభ్రమణం ముగించడానికి ఇరవై కోటి కోటి 'సాగరోపమ' సంవత్సరాల వ్యవధి పడుతుంది. (కోటి కోటి అంటే కోటిని కోటి పెట్టి గుణించడమన్నమాట. జైన గ్రంథాలలో ఒక 'సాగరోపమ' ఎన్ని సంవత్సరాలుంటాయో చెప్పారు.) ప్రస్తుతం జరుగుతున్న కాలం అవసర్పిణి యుగంలోని అయిదవ అరం. ఇది ఇరవైరెండు వేల సంవత్సరా లుంటుంది.

జైనులకు 45 పవిత్ర గ్రంథాలు ఉన్నాయి. అందులో ''జంబూ ద్వీప ప్రజ్ఞాప్తి'' ఒకటి. దీనిలో ప్రప్రథమ అరం యొక్క వర్ణన ఉంది. ఆ కాలంలో భారతక్షేత్రం చాలా మనోహరమైన దేశం. ఎక్కడా ఎగుడు దిగుడులు లేక భూమి అంతా సమతలంగా ఉండేది. ఆ కాలంలోని మనుష్యులను యుగళాలు అని పిలిచేవారు. ఎందుకంటే, అందరికీ

ఒక కొడుకూ కూతురూ కవలబిడ్డలుగా పుట్టేవారు. ఆ ఏకోదరులు పెరిగి పెద్దవారయ్యాక భార్యాభర్తలుగా కాపురం చేసేవారు.

*సృష్టిలో ఇది సహజం. జంతుజాలంలోని ఏకోదరుల గురించి రాబర్టు బ్రిఫాల్ట్సు ఏం రాశాడో చూడండి :

The African reedbuck usually brings forth two young at a birth, a male and a female; these when they become mature, pair with one another and the race is thus prepetuated by the union of brothers and sisters. The same appears to be true of most of the smaller species of antelopes., It is also the invariable rule among the red deer. A tigress also has has usually two cubs, one male and one female; they remain with their mother for two or three years until sexually mature, when they settled for themselves.

(Robert Briffaults
The Mother Vol. I, P. 205)

(సాధారణంగా ఆఫ్రికన్ రీడ్‌బక్ చూలుకు రెండు పిల్లలను ఈనుతుంది. ఒకటి మగది, రెండోది ఆడది. యుక్తవయస్సు రాగానే ఈ రెండూ ఒకదానితో ఒకటి జత కడతాయి. అన్నల, చెల్లెళ్ళ కలయిక వల్ల జాతి కొనసాగుతూ ఉంటుంది. జింకల్లోని చిన్న జాతుల్లో రమారమి ఇదే వాస్తవంలాగ కనబడుతూంది. ఎర్ర లేళ్ళలో కూడా ఇదే నిత్య నియమం. ఆడపులి కూడా సాధారణంగా రెండు పిల్లలను ఈనుతుంది. అందులో ఒకటి మగది. రెండవది ఆడది. లైంగికంగా పెద్దవయ్యే వరకు అవి తల్లితో గడిపి, తరువాత కాపురం పెడతాయి.)

సృష్టిలోని ఈ యుగళ జీవితాన్ని గమనించే కాబోలు జైనులు పౌరాణిక ఊహలను మలచుకొని ఉంటారు.

ఆ సత్యకాలంలో ప్రజలందరూ ధర్మనిరతులు, దాక్షిణ్యవంతులు. వాళ్ళు కల్పవృక్షచ్ఛాయలో జీవించేవారు. ఆ తరువులు కోరినవన్ని

ప్రసాదించేవి. ప్రజలందరూ ఆజానుబాహువులు.... అంత పొడుగుకు తగ్గ దృఢకాయం ఉండేది. వాళ్ళ ఆయుర్దాయం లక్షలూ, కోట్ల సంవత్సరాలు. యుగళాలు చాలా ఆనందంగా తృప్తిగా వుండేవారు. ఆనాటి జనసంఖ్య చాలా స్వల్పం యవధాన్యం, చెరుకుగడలు పుష్కలంగా పండేవి. అయితే వాటినెవరూ తినేవారు కారు. ఇది మొదటి అరం సంగతి. తర్వాత రెండు అరంలలో మంచి వెన్నెన్నో క్రమక్రమంగా అంతరించ సాగాయి. ప్రజలు చెడిపోయి క్షీణదశలో పడ్డారు. వాళ్ళ పొడుగూ, ఆయుర్దాయం తగ్గిపోసాగాయి. ఏవో కొన్ని వృక్షాలు మాత్రమే తిండీ బట్టా ఇస్తూ ఉండగా యుగళాల సంఖ్య పెరగడం ప్రారంభమైంది. అసూయా, ఆశ ప్రజల మనస్సులో ప్రవేశించాయి. కుటుంబాలు వృద్ధి చెందడం మొదలెట్టాయి.

మూడవ అరం ముగిసేటప్పుడు ఏడుగురు కులకారులు ఉండే వారు. వీళ్ళే ఆయా కుటుంబాల వంశ పురుషులు. వీళ్ళలో విమల వాహనుడు మొదటివాడు. నాభి కడపటి కులకారుడు. ఈ ఏడుగురే యుగళాలకు నీతి నియమాలను నిర్దేశించే స్మృతికారులు.

నాభి కులకారుడు వినితాపురంలో నివసించేవాడు. (ఇది కాశ్మీరా నికి ఉత్తరాన ఉందని గ్రంథకర్తలు భావిస్తున్నారు. దీనికి తూర్పున అష్ట పదపర్వతం అనగా కైలాసం ఉంటుంది. ఈ పురానికి దక్షిణాన మహా శిల్పం, పశ్చిమాన సుశైలం, ఉత్తరాన ఉదయాచలం ఉన్నాయి.) చైత్ర మాసంలో నాభి భార్య స్వప్నంలో ఒక వృషభాన్ని చూసింది. కనుక మగ బిడ్డకు ఋషభుడు అని పేరు పెట్టారు. ఆడబిడ్డ పేరు సుమంగళ. ఋషభుడు కాశ్యపగోత్రుడు. అతనికోసం ఇంద్రుడు చెరకు గడలు తీసుకొచ్చి సమర్పించాడు. ఋషభుడు వాటిని ఆరగించాడు. ఇక్షు కాండాన్ని భుజించడం చేత అతని వంశాన్ని ఇక్ష్వాకు వంశం అని పిలవ సాగారు.

భారత క్షేత్రంలోని ఆనాటి యుగళాలందరూ ఋషభుడిని రాజుగా ఎన్నుకున్నారు. తన రాజ్యపాలనలో ఋషభుడు 72 ముఖ్యమైన కళలను, శాస్త్రాలను తన ప్రజలకు నేర్పాడు. స్త్రీలకు అవసరమైన 64 విద్యలను

వాళ్ళకు బోధించాడు. వీటిలో సంగీత నృత్యాలు ఉన్నాయి. కుమ్మరం కమ్మరం వంటి వృత్తి విద్యలను కూడా ఋషభుడు తన ప్రజలకు నేర్పాడు.

కులాచారం ప్రకారం ఋషభుడు తన కవలసోదరి సుమంగళను వివాహం చేసుకొన్నాడు. అయితే అతడు సునంద అనే మరో యువతిని కూడా పెళ్ళి చేసుకోవలసి వచ్చింది. సునంద కవల సోదరుడు చిన్నప్పుడే మరణించాడు. ఋషభుడికి సుమంగళవల్ల భరతుడు, బ్రాహ్మి అనే కొడుకూ కూతురూ కవలలుగా జన్మించారు. సునందవల్ల బాహుబలుడు, సుందరి అనే కవలలు పుట్టారు. ఈ బిడ్డలకు యుక్తవయస్సు వచ్చేసరికి, ఒక తల్లిబిడ్డలు భార్యాభర్తలుగా జీవించడంలోని అనర్థాలను ఋషభుడు గమనించి ఆ ఆచారాన్ని నిషేధించాడు. ఇంకో పెద్ద సంస్కరణనుకూడా ప్రవేశపెట్టాడు. సుమంగళవల్ల తనకు పుట్టిన భరతునికి సునందవల్ల పుట్టిన సుందరిని భార్యగా నిర్దేశించాడు. అలాగే బ్రాహ్మిని బాహుబలునికి భార్యగా ఇచ్చాడు.

ఇది జైనుల ప్రథమ తీర్థంకరుడయిన ఋషభనాథుని చరిత్రవల్ల తెలిసే తొట్టతొలుత వావివరుసలు. ఒక తల్లిబిడ్డలు పెళ్ళిచేసుకొనే ఆచారాన్ని ఋషభుడు నిషేధించాడు. కనుక ఆ ఆచారాన్ని తెలియజేసే బౌద్ధుల దశరథ జాతకంలోని కథ అంతకన్న ప్రాచీనమని భావించడంలో తప్పులేదు. అలాగే ఆదినాథుడు సవతితల్లుల బిడ్డలు పెళ్ళిచేసుకోవచ్చునని శాసించాడు. కనుక సీతారాములను సవతితల్లుల బిడ్డలుగా చిత్రించే దూరప్రాచ్య దేశాల రామకథలు ఋషభనాథుని తర్వాత రూపం సంతరించుకొన్నవని చెప్పవచ్చు. ఋషభనాథుని కాలంలో కూడా రామకథాగేయాలు ప్రచారంలో వుండేవి. కొన్ని జైన గ్రంథాల ప్రకారం ఆది నాథుడే మొదట రామకథను కథనం చేశాడు. అయితే ఇది చారిత్రక విరుద్ధమని, అరవయ్యో తీర్థంకరుడైన సువ్రతముని కాలంలో రూపు దాల్చిందని ప్రతీతి.

జైన వాఙ్మయంలో కూడా విభిన్న రామాయణాలు ఉన్నాయి. వాటిలో వానరులకు, రాక్షసులకు సంబంధ బాంధవ్యాలు ఉన్నాయి.

సురవరం ప్రతాపరెడ్డి గారి మాటలో చెప్పాలంటే జైన రామాయణం ప్రకారం "సీత అయోనిజ కాదు, రాముడు ఏకపత్నీవ్రతుడు కాడు. హనుమంతుడు నిత్య బ్రహ్మచారికాడు ......... లక్ష్మణునికి ఎనమండుగురు పట్టపు భార్యలు, పదహారువేలు పైగా పెండ్లాలు." ఈ సంగతులు చెప్పి ప్రతాపరెడ్డిగారు ఒక సందేహం వెలిబుచ్చారు. "(పదహారువేల పెళ్ళాల) గుంపు నంతయు భాగవతమందు శ్రీకృష్ణుల వారికి అంటకట్టినారు. ఈ భేద మే పౌరాణికుని వలన జరిగెనో దురూహ్యము" అన్నారు. జైన సంప్రదాయం తెలుసుకొంటే ఇదేం ఊహకందని విషయం కాదు. ఆ సంప్రదాయం పరిశీలిద్దాం:

# జైన వాఙ్మయంలో రామాయణ కావ్యాలు

జైనులు రామచంద్రుణ్ణి సిద్ధ పరమాత్మునిగా భావిస్తారు. రాముడు చరమ దేహధారి. (పునర్జన్మ లేకుండా నిర్యాణం తరువాత కైవల్యాన్ని పొందే దేహధారులను చరమదేహధారులంటారు.) జైనధర్మమైన అహింసను పరిపూర్ణంగా పాటించిన మహనీయుడు. అందుకే జైన సంప్రదాయం ప్రకారం వాలిని, రావణుని లక్ష్మణుడే సంహరిస్తాడుగాని రాముడు చంపడు రావణవధ వల్ల ప్రాప్తించిన పాపాన్ని లక్ష్మణుడు "పంక ప్రభ" అనే నరకంలో పడ్డాడు. ఇటువంటి పాప కర్మను జైనులు రాముడికి అంట నీయ లేదంటే ఆ సిద్ధపరమాత్మునిపై వాళ్ళకు గల పూజ్యభావం తెలుస్తుంది. (బ్రహ్మహత్యా దోషాన్ని పోగొట్టడానికి వైదికార్యులు రాముడిచేత శివలింగ ప్రతిష్ఠ చేయించక తప్పలేదు.)

జైన వాఙ్మయంలో రామాయణ కావ్యాలు చాలా వున్నాయి. జైనులు రాముణ్ణి పద్ముడని కూడా పిలుస్తారు. అందుకే జైన వాఙ్మయంలో రామకథను పద్మచరిత్ర, పద్మపురాణం అని పేర్కొంటారు. ప్రాకృత సంస్కృత భాషలలో కొన్ని రామాయణ గాథలున్న కావ్యాల గురించి ఆచార్య హీరాలాల్, ఆర్. కపాడియా, డి. ఎల్. నరసింహాచారి గార్లు తమ పరిశోధక వ్యాసాలలో తెలియజేశారు.

ఆదిలో విమలసూరి జైనమారహత్తి 21 వ అధ్యాయంలో "పౌమ చరియ" అనే పేరుతో రామాయణం కథనం చేశాడు. పౌమచరియ అంటే పద్మచరిత్ర అని అర్థం. విమలసూరి గ్రంథాన్ని దిగంబర జైన శాఖకు చెందిన రవిసేనుడు "పద్మ పురాణం" అనే పేరుతో సంస్కృతీకరించాడు.

జైనుల మహాపురాణంలో ఆది పురాణం, ఉత్తర పురాణం అనే రెండు భాగాలున్నాయి. ఉత్తర పురాణాన్ని గుణభద్రుడు రచించాడు.

ఇందులో రామకథ ఉంది. భువనతుంగసూరి ''సియాచరియ'' (సీతా చరిత్ర) అనే 465 శ్లోకాల కావ్యాన్ని రచించాడు. ఇక్కడే "రామలఖణ చరియ'' కూడా రాశాడు. జినదాసుడు రామదేవ పురాణం విరచించాడు. పద్మనాభుడు రామచరిత్రం రాశాడు. జైన గ్రంథావళిలో "రామనాటకం" ప్రసక్తి ఉంది. రామచంద్ర గణి రఘువిలాస నాటకం, రాఘవాభ్యుదయ నాటకం విరచించారు. శాంతిసూరి, అమరదాసులు చెరొక సీతా చరిత్రను రాశారు. బ్రహ్మనేమిదత్తుడు సంస్కృతంలో సీత చరిత్రం చెప్పాడు. గోవిందభట్టు కుమారుడు హస్తిమల్లుడు 'మైథిలీ కల్యాణ నాటకం' అనే సీత నాటకాన్ని రాశాడు. కూచి భట్టారకుడు నందిముని కవి పరమేష్ఠి సిద్ధసేనుడు పద్మనంది సకలకీర్తి మొదలైనవారు కూడా జైన రామాయణ కావ్యాలను రాశారు.

జైన రచయితలలో హేమచంద్రసూరి. బహుముఖ ప్రజ్ఞాశాలి, ఘూర్జర దేశవాసి. క్రీస్తుశకం పదకొండవ శతాబ్దం వాడు. ఇతడిని కలి కాల సర్వజ్ఞుడు అంటారు. వ్యాకరణం, ఛందస్సు, అలంకారం, నిఘంటువులను ఒక పక్క వ్రాస్తూ ప్రబంధాలను ఇంకొక వైపు రచించిన పండిత కవి ఇతడు. జైనుల పుణ్య పురుషుల చరిత్రలను వర్ణించే త్రిషష్టి శలాకా పురుష చరిత్రను హేమచంద్రుడు పది పర్వాల మహాకావ్యంగా విరచించారు. అందులోని సప్తమ పర్వంలో రామచరిత్ర వుంది. వాల్మీకి రామాయణంతోను ప్రాచ్య దేశాలలో ప్రచారం పొందిన రామ కథలతోను హేమచంద్రుని రామాయణాన్ని తులనాత్మకంగా పరిశీలించితే ఎన్నో విశేషాలు బయటపడతాయి.

ప్రాకృత సంస్కృతాలలో విరివిగావున్న ఈ జైన రామాయణా లను కన్నడంలో చాలామంది కవులు అనువదించారు. క్రీస్తుశకం 978లో చాముండ రాయరు 'త్రిషష్టి శలాకా పురుష పురాణం' అనే కావ్యాన్ని కన్నడించాడు. ఇది గుణభద్రుని సంస్కృత గ్రంథానికి అనువాదం. కన్నడ సాహిత్యంలో ఈ కావ్యాన్ని చాముండరాయ పురాణం అని పిలుస్తారు. ఇతని తరువాత నాగచంద్రుడు, మాఘనంది సిద్ధాంతి కుము దేంద కవి, నయ సేనుడు దేవప్ప, దేవచంద్రుడు చంద్రసాగరవర్ణి

అనే కవులు జైన రామాయణాలను కన్నడ భాషలో చెప్పారు. కర్ణాటక దేశంలో లాగే తెలుగు, తమిళదేశాలలో కూడా పూర్వం జైనమతం ప్రచారంలో వున్నా జైన రామాయణాలు ఒక్క కన్నడంలోనే తప్ప ఇతర ద్రావిడ భాషలలోగాని ఇతర భారతీయ భాషలలో గాని కనిపించకపోవడం విశేషమే.

బౌద్ధమతానికి ఆచార్య నాగార్జునుణ్ణి ఇచ్చినట్టే జైన మతానికి కుంద కుందాచార్యుడనే మహాదార్శనికుడిని ఆంధ్రదేశం కానుక చేసింది. తెలుగుదేశంలో ఒకప్పుడు జైనమతం మూడు పువ్వులు ఆరు కాయలుగా ఉండేది. జైనమత గురువులకు, ఆలయాలకు రాజాశ్రయం పుష్కలంగా ఉండేది. దానిని తొలగించడానికి వీరశైవులు, వైదిక బ్రాహ్మణ్యం చాలా పోరాటం సల్పారు. మల్లికార్జున పండితుడు, తిక్కన సోమయాజి గారు రాజసభల్లో జైనులతో మహోగ్రమైన వాదాలు సల్పారు. గణపతి దేవచక్రవర్తి ముప్పయి ఆరు జైన వసతులను కూల్చదోయించి, అందులో వున్న అసంఖ్యాక జైనులను నరికించి, "చంపి, చెండి, చిందరవందర చేసి చక్కాడి"నట్టు సిద్ధేశ్వర చరిత్ర చెబుతుంది. ఆంధ్రదేశంలో జైన మతం అస్తమించినా దాని గుర్తులు మిగిలి ఉన్నాయి. "ఆంధ్రలో జైన చిహ్నాలు" (జైన్ వెస్టిజెస్ ఇన్ ఆంధ్ర) అనే గ్రంథంలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు చాలా విపులంగా ఆ అవశేషాల గురించి చెప్పారు.

జైన మతంతో దేశానికి ఇంత సంబంధం వుంది. కనుకనే తెలుగు రామాయణంలో అవాల్మీకాలైన సంఘటనలు, సన్నివేశాలు, వృద్ధారాలు ప్రవేశించాయి. జానపదులు స్త్రీలు పాడుకొనే రామాయణ గేయాలలో విశేషంగా ప్రచారం పొందడంవల్ల అవాల్మీకాలైన సులోచన కథ, జంబు మాలి వృత్తాంతం, కాలనేమి కథ, రావణుని పాతాళహోమం మొదలైనవి రంగనాథ, భాస్కర రామాయణాలలో చోటు చేసుకొన్నాయి. ఉత్తర కాండ సంపూర్ణంగా జైన ప్రభావం వల్లనే విరచితమై, వాల్మీకి పేర చెలామణీ కావలసి వచ్చింది.

జైన వాఙ్మయంలో రామకథలేకాక భాగవత కథల కథనంకూడా ఉంది. క్రీస్తుశకం 609కి పూర్వమే సంఘదాసు అనే శ్వేతాంబర జైనుడు "వసుదేవ హిండి" అనే సుదీర్ఘ వచన కావ్యం విరచించాడు. (ఇందులో

బౌద్ధ జాతక కథలలో లాగా అక్కడక్కడ పద్యాలుకూడా ఉంటాయి.) దీనినే వసుదేవ చరియ అని కూడా పిలుస్తారు. ఇది శ్రీకృష్ణుని తండ్రియైన వసుదేవుడి దేశాటనాలు, వీరకృత్యాలు మొదలైన వాటిని వర్ణిస్తుంది. దానితోపాటు ఎందరెందరో పూర్వ పురుషుల చరిత్రలు కూడా చెబుతుంది. ఇది ఒక రకంగా గుణాఢ్యుని 'బృహత్కథ'కు జైనప్రత్యామ్నాయం అని చెప్పవచ్చు. వసుదేవ హింది ప్రాకృత భాషలో ఉంది. ఇది చాలా ప్రాచీన కావ్యం. ఇందులో సంఘదాసు రామ చరిత్ర కూడా విపులంగా కథనం చేశాడు. విమలసూరి రచించిన పౌమ చరియలోని రామాయణా నికి, దీనికి భేదాలు ఉన్నాయి.

జైన రామాయణాలలో విమలసూరి రచనే చాలా ప్రాచీనం అని చెప్పాలి. కడపటి తీర్థంకరుడైన మహావీరుడు నిర్యాణం చెందిన 530 సంవత్సరాల తర్వాత తన రామాయణాన్ని రచించినట్టు విమలసూరి స్వయంగా సొంత మాటలలో చెప్పుకొన్నాడు. మహావీరుడు క్రీస్తు పూర్వం 527 వ సంవత్సరంలో నిర్యాణం చెందినట్టు చరిత్రకారులు అంగీకరిస్తున్నారు కనుక క్రీస్తుశకం ప్రారంభమైన మొదటి మూడు నాలుగేళ్ళలో విమలసూరి రామచరిత్ర రచించాడు అంటే ఇప్పటికి పంతొమ్మిది వందల డెబ్బయి రెండు సంవత్సరాలుగా జైన రామకథ ప్రచారంలో ఉందన్నమాట!

అసలు జైనుల రామాయణాన్ని ఎందుకు కథనం చేశారు? వాల్మీకి రామాయణంకన్నా విపులంగా ఎందుకు విరచించారు? అనే ప్రశ్నలు సహజంగా వస్తాయి. జైనమతం ప్రకారం కాలచక్రంలో అరవై ముగ్గురు శలాకా పురుషులు వర్ధిల్లుతారు. (అందుకే సంస్కృతంలో వీరిని త్రిషష్టి శలాకా పురుషులంటారు.) ఈ అరవై ముగ్గురిలో ఇరవై నలుగురు తీర్థంకరులు, పన్నెండు మంది చక్రవర్తులు, తొమ్మిది మంది వాసుదేవులు, తొమ్మిది మంది బలరాములు, తొమ్మిదిమంది ప్రతి వాసు దేవులు వుంటారు. (చక్రవర్తి పదవిని, వాసుదేవ బలదేవ పదవులను 'లబ్ధి' లంటారు.) ఎంతో పుణ్యం చేసుకొంచేనేగాని ఏ లబ్ధి దొరకదు. ప్రస్తుత కాల చక్రంలో 63 శలాకా పురుషులు భారతదేశాన్ని అలంక రించారు. వీరిలో శ్రీరాముడు ఎనిమిదవ బలరాముడు, లక్ష్మణుడు

ఎనిమిదవ వాసుదేవుడు. లక్ష్మణుడు సంహరించిన రావణుడు ఎనిమిదవ ప్రతి వాసుదేవుడు. ఈ ముగ్గురూ శలాకా పురుషులు కాబట్టి, చెప్పుకోతగ్గ చరిత్ర కలవాళ్ళు కాబట్టి జైనులు తమ వాఙ్మయంలో రామకథకు అంత ప్రాధాన్యం ఇచ్చారు.

హిందువుల దశావతారాలలో పరశురామ, దశరథరామ, బల రామావతారాలు మూడు వరుసగా వుండడం గమనించదగ్గది. పాంచ రాత్ర ఆగమాలలో వాసుదేవులు "కేశవ నారాయణ మాధవ గోవింద అచ్యుత'' మొదలైన ఇరవైనాలుగు వ్యూహాలను అధిష్టించుతారు, ఇది జైన ప్రభావం కావచ్చు. ఈ దృక్పథంతో చాలా రంగాలలో తులనాత్మక పరిశీలన అవసరం. ప్రస్తుతం వాల్మీకి రామాయణంతో విభేదించిన జైన రామాయణం విశేషాలను గమనిద్దాం.

# జైన రామాయణాలలో విరుద్ధ విషయాలు

రావణుడు ఆదర్శ ప్రభువు. మూడు ఖండాలలో అతడికి శత్రువన్నవాడే లేడు. ఎందరో విద్యాధర నృపులు సామంతులై అతడిని సేవించెడివారు రావణుడు అడుగుపెట్టిన దేశం పాడిపంటలతో, సిరి సంపదలతో తులతూగి, కరువు కాటకాలు లేక భూలోక స్వర్గంలాగ పుణ్య ప్రదేశం అవుతుంది. రావణుడు పుణ్యప్రదేశాలను సందర్శించేవాడు. తీర్థంకరులకు ఆలయాలు కట్టించాడు. కేవలులు కావించే ధర్మబోధనలు భక్తిశ్రద్ధలతో వినేవాడు. జైనధర్మాలలో ముఖ్యమైన అహింసను తాను ఆచరించడమే కాక ఇతరులచే ఆచరింపచేసేవాడు. అందుకే పశువులను వధించే యజ్ఞయాగాదులను ఆపించేవాడు. (యాగాలు చేసేవాళ్ళను చంపించలేదు.)

ఇది జైనుల దృష్టిలోని రావణపాత్ర. ఇటువంటి మంచివాడిని వైదికార్యులు క్రూరంగా చిత్రించేసరికి బింబిసారుడు బాధపడ్డాడు. వివిధ రామకథలు విన్నాడు. వాటిలోని వ్యాఘాతాలకు నొచ్చుకున్నాడు. ఏది నిజమైన రామకథ? రావణుడు ఎటువంటివాడు? రామాయణంలో ఇన్ని అభూత కల్పనలు ఎందుకు వచ్చాయి? ఇటువంటి ప్రశ్నలు అతడిలో ఉదయించాయి. తన సందేహాలను నివృత్తిచేసుకొనడానికి అతడు మహావీరుని శిష్యుడైన గౌతముడి చెంతకు చేరాడు. వినయంగా నమస్కరించి ప్రశ్నించాడు:

"విద్యాధరులలో అత్యంత బలపరాక్రమ సంపన్నుడైన రావణుడు వానరుల చేతిలో ఎలా పరాజయం పొందాడు? కుంభకర్ణుడు ఆరునెలల పాటు నిశ్చింతగా, ఆకలిదప్పులు లేక ఎంత గోలచేసినా, రోకళ్ళతో పొడిచినా, చెవులలో పిడుగులు పడినా నిద్రపోగలగడం నమ్మతగ్గదేనా? ఇంతకన్నా విడ్డూరం- మృత్యు సన్నిధియైన నిద్రనించి లేచి లేవగానే

కుంభకర్ణుడు ఏనుగులను, దున్నపోతులను ఎలా భక్షించగలుగుతాడు? రావణుడు తదితర రాక్షసులు సదాచార వర్తనులైన జైనులు కదా? వాళ్ళు ఎటువంటి జుగుప్సా పశ్చాత్తాపం లేకుండా ఎలాగ మానవ రక్తాన్ని త్రాగగలిగారు? మానవ మాంసాన్ని తినగలిగారు? అయ్యో, ఇప్పుడు విరచితమైన రామకథలన్నీ అసత్యాలు, అక్రమాలు, అత్యంత వక్ర భాష్యాలు, వికృతాలు అని తోస్తున్నాయి. నా సందేహాలు నివృత్తి చేస్తారా?''

శ్రేణికరాజు ఈ విధంగా ప్రశ్నించాక గౌతముడు సవిస్తరంగా సమాధానం చెప్పాడు: ''రాజా! శ్రేణికా! సావధానుడవై విను. పూర్వం శివలులు రామకథలను కథనం చేశారు. వారు చెప్పిన దానినే నేను విశదం చేస్తాను. రావణుడు నరమాంసం భక్షించే రాక్షసుడు ఎంత మాత్రం కానేకాడు ఇప్పటి దుష్ట దుర్మార్గ పౌరాణికులు కథనం చేస్తున్న వన్నీ సత్యదూరాలే" అని, అనుశ్రుతంగా వస్తున్న జైన సంప్రదాయ సిద్ధమైన రామాయణాన్ని గౌతముడు శ్రేణిక రాజుకు వినిపించాడు. ఈ సంప్రదాయాన్నే విమలసూరి ప్రప్రథమంగా ''పౌమ చరియ'' లో గ్రంథానికి ఎక్కించాడు. ఇతని తర్వాత గుణభద్రుడు ఉత్తర పురాణంలోను, సంఘదాసు వసుదేవ హిందీలోను, హేమచంద్రుడు త్రిషష్టి శలాకా పురుష చరిత్రలోను రామకథలు కథనం చేశారు.

చిత్రం ఏమిటంటే, బింబిసారుడు తన కాలంలో ప్రచారం చెందిన రామకథలలో పరస్పర విరుద్ధాలున్నాయని అసలు కథ వినిపించుకొన్నా క్రమేణా జైన రామాయణాలు ఒక దానితో ఒకటి భేదించసాగాయి. విమలసూరి ప్రకారం సీత అయోనిజ కాదు. జనకుడికి, అతని భార్య విదేహకు అందరు మానవ కన్యల్లాగే సీత సహజంగా జన్మించింది. కాని గుణభద్రుడు సంఘదాసు సీత రావణుడి కుమార్తె అని, జనకుడికి నాగేటి చాలులో దొరికిందని చెబుతారు. (హేమచంద్రుడు విమలసూరినే అనుస రించాడు )

ఈ విభేదాలు ఎలా వచ్చాయి? ఎందుకొచ్చాయి? ముఖ్యంగా సీత పుట్టుక విషయంలో వైదికార్యుల లాగే జైనులలో కొందరు ఎందుకు అసహజ కల్పనలు కావించవలసివచ్చింది? ఈ ప్రశ్నలకు సమాధానాలు

సులభంగానే చెప్పవచ్చు. జైనులలో దిగంబరులని, శ్వేతాంబరులని రెండు శాఖలున్నాయి. శలాకా పురుషుల దివ్యగాథలను దిగంబరులు పురాణాలంటారు. శ్వేతాంబరులు "చరిత్ర"లంటారు. ఈ రెండు మాటలే వాళ్ళ దృక్పథాలను విడమరచి చెబుతాయి

దిగంబరుల పురాణాలకు, వైదికార్యుల పురాణాలకు చాలా పోలిక లున్నాయి. అందుకే గుణభద్రుడూ సంఘదాసూ చెప్పిన రామకథలలోని చాలా అంశాలు వాల్మీకి రామాయణానికి దగ్గర్లో వుంటాయి. అభూత కల్పనలు, అసహజ జన్మలు, అతీత కృత్యాలు అందుకే వీటిలో చోటు చేసుకున్నాయి. శ్వేతాంబరుల "చరిత్ర"లు వీటి జోలికి అట్టే పోలేదు. జైనులు విశ్వసించే కర్మ సిద్ధాంతం ప్రకారం సంభవించే పునర్జన్మలు దేహాంతరధారణం ఖేచరీగమనాలు వంటివి తప్పిస్తే శ్వేతాంబరుల చరిత్రలు హేతువాదం దరిదాపులలోనే వుంటాయి. అందుకే మాయ లేడి, సేతు బంధనం వంటివి ఇందులో కనబడవు.

జనకుడికి అతడి భార్యకు సీత సహజంగా జన్మించిందని శ్వేతాం బరులు చెప్పారు, బాగానే వుంది. అయితే ఋషభనాథుని కాలందాకా ఏకోదరులైన అన్నా చెల్లెలు యుగళంగా కాపురం చేయడం సనాతన ధర్మం. ఈ ప్రాచీన సదాచారాన్నే బౌద్ధుల రామకథలు తమలో భద్ర పరుస్తున్నాయి. శ్వేతాంబర జైనులు దీనిని మార్చి వేయడం అధర్మం కాదా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. మార్పులు అనివార్యం పురాతన గాథలు కాలక్రమేణా రూపాంతరం పొందడం కట్టుకథల లక్షణాలలో ఒకటి. అయితే ఆ రూపాంతరం మూలకథలోని ముఖ్యాంశానికి విభిన్నంగా ఉండదు దేశ కాల పరిస్థితులకు అనుకూలంగా చేదు సత్యాలకు పంచదారపూతలు, సాంస్కృతిక విరుద్ధమైన వాటికి సముచితమైన సవరణలు పురాణోత్పత్తిలో జనులు ప్రవేశ పెడతారు.

ఉదాహరణకు బ్రెజిల్ దేశంలోని "షెరంటే" జాతి అనాగరకు లకు మిషనరీలు బైబిలులోని ఆదాము హవ్వల కథ చెప్పారు. ఏథెన్· తోటలో నగ్నంగా ఆదాము హవ్వలు జీవిస్తున్నారు. దేవుడు వాళ్ళను ఫలానా చెట్టుపళ్ళను మాత్రం తినవద్దన్నాడు. వాళ్ళు ఆ ఆజ్ఞను పాటి స్తూనే ఉన్నారుగాని ఒకనాడు ఒక సర్పం వచ్చి ఆ పండు తినమంటూ హవ్వాని ప్రలోభపెట్టింది. దాని మాటలు విని హవ్వా ఆదాముచేత పళ్ళ

కోయించింది. వాటిని తినగానే వాళ్ళకు ఎక్కడలేని సిగ్గూ వచ్చింది. తమ మర్మాంగాలను కప్పుకొన్నారు. బైబిల్‌లోని ఈ కథలో షెరంటే ప్రజలు ఒక చిన్న సవరణ ప్రవేశపెట్టారు. ఆదాము హవ్వాలు అన్నా చెల్లెళ్ళన్న సంబంధాన్ని కల్పించారు. ఎందుకంటే, షెరంటే ప్రజలు బట్టలు కట్టుకోరు. నగ్నంగా ఉండడం వాళ్ళలో తప్పులేదు. దిసమొలతో ఉన్న స్త్రీ పురుషులు పరస్పరం చూసుకొంటే సిగ్గుపడవలసిన అవసరం లేదు. అయితే, ఆ తెగలో అన్నాచెల్లెళ్ళ కామ సంబంధం మాత్రం చాలా పాపం. అందుకే వాళ్ళు ఆదాము హవ్వాలను అన్నా చెల్లెళ్ళను చేయవలసి వచ్చింది. లేకపోతే తప్పు పని చేశామని బాధపడవలసిన అవసరం వుండదు.

వివిధ రామాయణాలలో వైదికార్యులు, జైనులు ఈ షెరంటే ప్రజలు చేసినదానికి వ్యతిరేకమైన కల్పనలు చేయవలసి వచ్చింది. ఆదర్శ పాత్రలకు లోపాలు వుండకూడదు. కనుక శ్వేతాంబర జైనులు సీతారాములకు వేరువేరు తల్లిదండ్రులను సృష్టించుకొన్నారు. అయితే ప్రాచీన కథా బీజాన్ని విస్మరించకుండా సీత రూపాన్ని చూసి ఆమె సోదరుడే మరులుకొన్న ఒక ఘట్టాన్ని సృష్టించారు. సీతను కామించి ఆమెను వివాహమాడదలచిన ఆ సోదరుడి పేరు భామండలుడు, ఇతని కథను విమలసూరి హేమచంద్రుడు సవిస్తరంగానే కథనం చేశారు. ఆ సంగతులు పరిశీలిద్దాం.

# జైన రామాయణంలో సీతాకల్యాణం

మిథిలా నగరాన్ని జనకుడు పాలిస్తున్నాడు. అతని భార్య పేరు విదేహ. వాళ్ళకు ఒక పుత్రుడు, ఒక పుత్రిక కవల బిడ్డలుగా జన్మించారు. బిడ్డలు పురుటికందులుగా ఉన్నప్పుడు సౌధర్మ స్వర్గం నుంచి ఒక దేవ మూర్తి మిథిలకు వచ్చాడు. అతడు పూర్వజన్మలో పింగళుడనే పురో హితుని కుమారుడు. ఎన్నో పుణ్యకర్మలవల్ల సౌధర్మ స్వర్గవాసి కాగలి గాడు. అయినా ఒక ప్రత్యేక శత్రుత్వాన్ని మరచిపోలేకపోయాడు. బహుజన్మల నుంచి కీర్తిమండలుడనే వ్యక్తి తన విరోధి. ఇప్పుడతడు జనకుని కుమారునిగా జన్మించాడని పింగళుడు యోగదృష్టితో చూశాడు. పగ తీర్చుకొనడానికి వచ్చాడు.

పురిటి కందును పింగళుడు పట్టుకొన్నాడు. బండ రాళ్ళమీద మోది ఆ బిడ్డను చంపదలిచాడు. అయితే, అంతలోనే శంకించాడు. ''పుణ్యవశం చేత నేను స్వర్గవాసి నయ్యాను. మళ్ళా పాపం చేసి అంతు లేని జన్మ పరంపరల క్లేశాన్ని ఎందుకు అనుభవించాలి?'' అని ప్రశ్నించు కొన్నాడు. ఆ పురిటికందును వివిధ రత్నాభరణాలతో అలంకరించి వైతాఢ్య పర్వతశ్రేణుల దక్షిణపార్శ్వంలో వున్న రత్ననూపురపురం లోని నందన వనంలోనికి మెల్లగా జారవిడిచాడు. ఈ దృశ్యాన్ని రత్న నూపుర పురాధిపతి చంద్రగతి వీక్షించాడు. ఆశ్చర్యచకితుడయ్యాడు. సంతానహీనుడైన ఆ విద్యాధర ప్రభువు బిడ్డను ఎత్తుకున్నాడు. తన భార్య పుష్పవతి చేతికిచ్చాడు. ఆమె ఆనాడే మగబిడ్డను కన్నట్టు రాజ్యంలో చాటింపచేశాడు. రత్నకాంతు లీనుతూ ప్రకాశించుతున్న ఆ బిడ్డకు భామండలుడని నామకరణం చేశారు.

అక్కడ మిథిలానగరంలో మగబిడ్డనుకానక విదేహ విలపించింది. బంధువులందరిని దుఃఖసాగరంలో ముంచివేసింది. బిడ్డను అన్వేషించ మని అన్నిదిక్కులకు పరిజనులను జనకుడు పంపాడు. ఎంత కాలానికి బిడ్డ జాడ తెలియలేదు. జనకుడు తన పుత్రికకు సీత అని పేరుపెట్టాడు.

మిథిలానగరాన్ని అర్ధ బర్బరులు, ఆతరంగతములు మొదలయిన మ్లేచ్ఛులు ముట్టడించారు. వారిని ఓడించడానికి సహాయం కోరుతూ జనకుడు తన స్నేహితుడు దశరథుని వద్దకు దూతలను పంపాడు. దశరథుడు తన కుమారులు రామలక్ష్మణులను మిథిలకు పంపాడు ఆ వీర కుమారులు మ్లేచ్ఛులను అవలీలగా ఓడించారు. జనకుడి బరువు తొలగించారు. కృతజ్ఞతా సూచకంగా జనకుడు తన కుమార్తె సీతను రాముడికి వధువుగా ఇవ్వదలచాడు.

అంతకుముందే నారదుడు సీత అందం గురించి విన్నాడు. ఆమెను కన్నులారా చూద్దామని అంతఃపురంలో అడుగు పెట్టాడు. అతని కపిల జడలు, కపిల కన్నులు, కుంభోదరం, కౌపీనం, ఊగాడే శిఖ, ఒక చేతిలో గొడుగూ, ఒక చేతిలో దండం చూసి సీత బెదరి పోయింది. భయకంపితురాలై "ఓయమ్మో!" అని కేక వేసి ఆమె భవనాంతర్భాగంలోనికి పారిపోయింది. దాసిస కన్యలు, పెగ్గడికత్తెలు నారదుని అడ్డగించారు. అతన్ని మెడ పట్టుకుని, శిఖ పట్టుకుని ఆడించారు. ద్వారపాలకులు యమదూతలలాగా వచ్చారు, 'చంపండి' అని ముందుకు దూకారు. వాళ్ళబారి నుంచి తప్పించుకుని ఆకాశానికి ఎగసి నారదుడు పారిపోయాడు. వైతాఢ్య పర్వతాన్ని చేరుకుని ఆలోచింపసాగాడు.

"పులిబారి నుంచి తప్పించుకొన్న గోవులాగ ఆ దాసీజనుల గుప్పిళ్ళ నుంచి తప్పించుకొన్నాను. అసంఖ్యాక విద్యాధరవీరులు నివసించే ఈ వైతాఢ్య పర్వతాన్ని అదృష్టవశాన చేరుకున్నాను. ఈ దక్షిణ శ్రేణిలో ఇంద్రసమానుడు, చంద్రగతిసూనుడూ, దోర్బల సంపన్నుడూ అయిన భామండలుడనే విద్యాధర యువకుడు ఉన్నాడని విన్నాను. సీత చిత్రపటాన్ని లిఖించి ఆమె అందాన్ని అతనికి విందు కావిస్తాను. ఆ సుందరాకారుడు సీతను బలిమిని చేకొంటాడు. నా పగ తీరుతుంది'' అని నారదుడు భావించాడు.

అనుకొన్నదంతా నారదుడు ఆచరించాడు. మూడు లోకాలలో ఈడులేని సీత లావణ్యాన్ని భామండలునికి చూపించాడు. వెనువెంటనే ఆ యువకుడు కామ మోహితుడయ్యాడు. వింధ్యాద్రికి సమాకర్షితమైన మత్తగజంలాగ అతనికి నిద్ర కరువైంది. అన్నపానాదులపట్ల విరక్తి

దయ్యాడు. తపోనిష్ఠలో నిమగ్నుడయిన తాపసిలాగ కడుమౌనం వహిం చాడు. కుమారుని స్థితి పరికించిన చంద్రగతి ఆరాటం చెందాడు. కార ణాలు చెప్పమని ప్రశ్నించాడు. భామండలుడు బదులు చెప్పలేదు. అతని మిత్రులు ఉన్న సంగతిని విన్నవించారు. నారదుడు ఒక చిత్రపటాన్ని తీసుకొని వచ్చాడని, అందులో వున్న చిన్నదాని వన్నెలు చూసి యువ రాజు మరులుకొన్నాడని రాజుకు తెలియజేశారు.

చంద్రగతి నారదుని రావించాడు. "ఎవరా సుందరి? ఆమె తల్లి దండ్రు లెవరు?" అని అడిగాడు. నారదుడు వివరాలను చెప్పాడు. చంద్రగతి వాటిని విన్నాక తన కుమారుడికి ధైర్యం చెప్పాడు. 'విచా రించకు, సీత నిన్ను వివాహమాడుతుంది' అని భుజం తట్టాడు. చపలగతి అనే విద్యాధరుణ్ణి పిలిచి, జనకుని బంధించి వెనువెంటనే తన సన్నిధిలో నిలపమని చెప్పాడు. ఆ రాత్రి పరులకు కనబడకుండా చపలగతి మిథిలకు చేరుకొన్నాడు. జనకుని బంధించి రత్ననూపురపురానికి తీసుకొని వెళ్ళాడు. రాజసమక్షంలో నిలిపాడు. బంధు వాత్సల్యంతో జనకుడిని కౌగలించుకొని చంద్రగతి సముచితాసనం చూపించాడు. "నీ పుత్రిక సీత అతిలోక సౌందర్యవతి. నా పుత్రుడు భామండలుడు తక్కువ వాడు కాడు. వాళ్ళిద్దరు వివాహమాడుట సముచితం. ఈ కల్యాణం నేడే జరగనీ! మన నెయ్యం వియ్యమవుతుంది" అని చంద్రగతి చెప్పాడు. జనకుడు సమాధానం చెప్పాడు: "కన్యలు ఒక్కసారే వాగ్దత్తలు కాగలరు. నా సీతను నేను రాముడికి ఇవ్వదలచినట్టు ప్రకటించాను. ఆమెను అన్యు లకు ఎలా ఇవ్వగలను?"

అందుకు చంద్రగతి ఇలా అన్నాడు: "మన మైత్రి వృద్ధి చెందా లని నిన్ను రావింప చేశాను. సీతను అపహరించి తీసుకురావడం ఏమంత కష్టమైన పనికాదు. నీ బిడ్డ రాముడికి వాగ్దత్త అయినా మమ్మల్ని ఓడించిన పిదపే అతడు ఆమెను చేపట్టగలడు. 'వజ్రావర్తం' 'అర్ణవావర్తం' అనే రెండు దివ్యధనుస్సులు మా యింట ఉన్నాయి. వాటిని కులదేవతల కోవెలలో మేము కొలుచుకొంటూ వుంటాము. వేయిమంది యక్షులు వాటిని కనిపెట్టుకొని ఉంటారు. అసదృశ ప్రకాశవంతమైన ఆ ధనుస్సులు భావి రామునికై భావి శార్ఙ్గధరునికై నిర్దేశించబడ్డాయి. వాటిని నీతో

తీసుకువెళ్ళు, దాశరథి ఆ రెంటిలో ఏ ఒక్కటి ఎక్కుపెట్టినా సీతను పరిణయమాడవచ్చును."

ఈ నిబంధనలకు జనకుణ్ని బలవంతాన చంద్రగతి అంగీకరింప చేశాడు. జనకుడితో వింటిజంటతో పుత్రసమేతుడై చంద్రగతి మిథిలకు వెళ్ళాడు. జనకుడిని అంతఃపురంలో విడిచిపెట్టి సపరివారుడై చంద్రగతి నగర పరిసరాలలో విడిశాడు. జనకుడు జరిగిన సంగతులను విదేహకు చెప్పాడు. ఆమెకా వార్త హృదయశల్యమైంది. 'అక్కటా' దుర్విధి! ఆ నాడు నా పుత్రుని నాకు దూరం చేసినా నీకు తృప్తి కలగలేదా? నేడు నా పుత్రికనూ మాకు దూరం చేస్తావా? అన్యుల నిర్బంధం మీద ఆడ పిల్లను ఎవరికో ఇవ్వడం పాడికాదే! రాముడు విల్లు ఎక్కుపెట్టలేక పోతేకాని వాడికి కన్య నివ్వక తప్పదే?'' అని ఆమె విలపించింది. ''దిగులు చెందకు దేవీ! రాఘవుని అమోఘ పరాక్రమం నాకు తెలుసు. ఆ మేటి కోదండం అతని చేతుల్లో కోమల లత కాగల''దని జనకుడు ధైర్యం చెప్పాడు.

ఆ విధంగా విదేహకు తెలియజెప్పి జనకుడు ప్రాతఃకాలాన ఆ అసమాన చాపద్వయాన్ని ఆరాధించాడు. సభలో ఒక సముచిత వేదిక పైన వాటిని భద్రపరచాడు. సీతా స్వయంవరాన్ని చాటించాడు. ఎందరో విద్యాధరులు విచ్చేశారు. సభలో ఆశీనులయారు. చెలికత్తెలు వెంటరాగా దివ్యాభరణ భూషితురాలైన జానకి భువికి దిగివచ్చిన దేవకన్యలాగ సభ లోకి ప్రవేశించింది. ఆ దివ్య చాపాలకు పూజలు కావించి, రాముడిని హృదయంలో నిలుపుకుని చూపరుల నేత్రాలకు అమృతవాహిని లాగ సీత అక్కడ నిలబడింది. నారదుని చిత్రానికి అన్నివిధాలా సరిపోయిన అసమాన సౌందర్యం మూర్తీభవించిన సీత రూప లావణ్యాన్ని ప్రత్య క్షంగా వీక్షించగానే భామండలుని వలపు వ్యాధిగా మారింది.

జనకుడి నేత్రహస్తుడు స్వయంవర నిబంధన ప్రకటించాడు. "ఈ వింటి జంటలో ఏ ఒక్కదానినైనా ఎక్కుపెట్టగల వీరునికే తన పుత్రి కను ఈయగలమని జనక మహారాజులు తేలియజేస్తున్నారు'' అని చెప్పాడు. బలసమన్వితులైన విద్యాధర రాజులు ఒక్కొక్కరే ఎక్కు పెట్టాలనే కోరికతో వింటిజంటను సమీపించారు. ధగధగ లాడుతున్న

మహాసర్పాల మధ్య వున్న ఆ ధనుస్సులను వాళ్ళు సమీపించ లేకపోయారు. వింటిజంట నుంచి వెలువడుతున్న తీక్షణ విస్ఫులింగాలు శరీరాలను దహించగా లజ్జవలన అవనత శిరస్కులై వాళ్ళు అన్య ప్రదేశాలకు నిష్క్రమించారు.

అంతట దశరథసూనుడు రాముడు, కర్ణభూషణాలు అల్లాడగా గజరాజ గంభీర గమనంతో చాపాన్ని సమీక్షించాడు. ఇతర రాజులతో పాటు చంద్రగతి వాకిట హాసాలు చేస్తూ ఉండగా, జనకుడు ఆందోళనా చిత్తుడు కాగా, వజ్రపాణి వజ్రాయుధాన్ని చేగొన్న విధంగా లక్ష్మణా గ్రజుడు నిర్భీతుడై వజ్రావర్తమనే ఆ మహాధనుస్సును చేతపట్టాడు. విషసర్పాలూ, విస్ఫులింగాలూ అదృశ్యమయ్యాయి. ఆయఃపీఠంపై ధనుస్సును నిలిపి వేణు కాండాన్ని వంచినట్టు దానిని ధానుష్క శిఖా మణి దాశరథి వంచి నారి తొడిగాడు. చెవిదాకా నారి సారించాడు. భూ దివనమ్ముల మధ్య తన విజయ ఢంకా ధ్వానాన్ని వినిపిస్తున్నదా అన్నట్టు కావించిన ధనుష్టంకారం మోగింది. మైథిలి అతని మెడలో స్వయంవర మాలికను వేసింది. రామభద్రుడు వింటి నారిని తొలగించాడు!

వెను వెంటనే రామాజ్ఞచేత లక్ష్మణుడు "అర్ణవావర్త" ధనుస్సును ఎక్కుపెట్టి అందరినీ ఆశ్చర్యచకితులను గావించాడు. మింటి చెవులు చిల్లులు పడేటట్లు వింటి మోతను కావించి నారిని తొలగించాడు. ఆశ్చర్య సంభ్రమచిత్తులైన అష్టాదశ విద్యాధర నృపతులు, దివ్యలావణ్యవతులైన తమ తమ కుమార్తెలను లక్ష్మణునికిచ్చారు. పరిభవఖిన్నులైన పరివారంతో బాధామగ్నుడైన భామండలునితో చంద్రగతి తన నగరానికి వెడలిపోయాడు. దశరథుడు సపరివారంగా సంతోషంగా మిథిలకు తరలి వచ్చాడు. సీతారాముల కల్యాణం వైభవోపేతంగా జరిగింది.

ఇది త్రిషష్టి శలాకా పురుష చరిత్రలో శ్వేతాంబర జైన సంప్రదాయం ప్రకారం హేమచంద్రుడు చెప్పిన సీతాకల్యాణ గాథ. ఇందులో సీతకు ఆమె సోదరునితో వివాహాన్ని జైనులు చాలా చాకచక్యంగా తప్పించారు. ఈ జైన గాథలు ఇతర దేశాలకు ఎగుమతి అయ్యాయి. కొత్త రూపాలు సంతరించుకొన్నాయి. వాటిని పరిశీలిద్దాం.

# పెట్టెలో దొరికినదెవరు సీతా, కౌసల్యా?

వాల్మీకి రామాయణం ప్రకారం రాముడు శివధనుస్సు విరిచాడు. జైన రామాయణం ప్రకారం విల్లుమోపెట్టి బాణం విడిచాడు. జైనుల సంప్రదాయం దూరప్రాచ్యం వరకు వ్యాపించింది. కంబోడియా రామాయణం "రామకీర్తి"లో విల్లువంచి అమ్ము విడవడమే వర్ణించారు. వాస్తవానికి ఇక్కడ మూడు వర్ణనలున్నాయి. రాముడు నారి సారించి శరం వదలడం మొదటిది. జనకుడి దూతలు ఈ సన్నివేశానికి చిలవలు, పలవలు చెక్కి, రాముడు విల్లు మోపెట్టాక పదివేల పిడుగులూ మెరపులూ పుట్టించాడన్న అతిశయోక్తులు దశరథునితో చెప్పడం రెండవ వర్ణన, ఈ కథనం విన్న దశరథుడు ఆ వైనాన్ని తాను మంత్రులకు, పరివారానికి తెలియజేస్తూ ఆ పిడుగులూ, మెరపులూ పుట్టడానికి కారణం ఊహించి ధనుస్సు విరిగిపోయిందని చెప్పడం మూడవ వర్ణన. ఈ ధనుర్భంగాన్ని ఆలంకారికంగానే తీసుకోవాలని వ్యాఖ్యాతలు భావిస్తున్నారు.

ఏమైతేనేం ఈ మూడు వర్ణనలలోనే జైన సంప్రదాయంలోని సంఘటన వాల్మీకానికి విధేయంగా ఎలా మారుతుందో విశదమవుతోంది. ఇది "కట్టె-కొట్టె-తెచ్చె'' అన్నట్టు సూటిగా స్పష్టంగా కనబడే ఉదాహరణ. అయితే అన్ని సన్నివేశ పరిణామాలు ఇంత సులభంగా గ్రాహ్యాలైతే బాగానే ఉండును. కాని జైన రామాయణంలోని కొన్ని ప్రాథమిక భావాలు అంచెలుగా పరిణామం చెంది దట్టంగా అల్లుకొన్న పొదల్లాగ కనబడతాయి. ఒక తీగె లాగితే డొంకంతా కదిలి మూలం కనబడుతుంది.

జైన రామాయణం (శ్వేతాంబరం)లో జానకి జనకుడికీ, అతని భార్యకూ సహజంగా జన్మించిన మానవ కన్య; కాని వాల్మీకి రామాయణంలో మాత్రం అయోనిజ. జనకుడు భూమి దున్నుతుండగా పెట్టెలో దొరికిన బిడ్డ. ఈ పెట్టె ఎక్కడినుంచి వచ్చింది? ఎలా వచ్చింది? అనే

ప్రశ్నలు కోకొల్లలు పుడతాయి. వాటికి తగిన సమాధానాలు వాల్మీకి రామాయణం ఆరు కాండల్లోనూ దొరకవు. బాలకాండలో సీత పుట్టుక గురించి వివరణ ఎక్కడా ఏమీ కనబడదు. అయోధ్యాకాండ చివరలో అనుసూయాదేవికి సీత స్వయంగా తన కథ చెబుతుంది.

"మిథిలాపతి వీరుడు. జనకుడనే పేరు. వాడు ధర్మవేత్త. క్షేత్ర కర్తలందు అభిరతుడు. న్యాయంగా దేశమేలుతున్నాడు. అతడు నాగలి చేతబట్టి మండలాకార క్షేత్రాన్ని దున్నుతూ వుండగా భూమిని చీల్చు కుంటూ నేను ఉద్భవించాను. ముష్టి నిక్షేప తత్పరుడైన నరపతి ఒళ్ళంతా దుమ్ము నిండిన నన్ను చూసి విస్మితుడయ్యాడు. సంతాన రహితుడైన అతడు నన్ను తన స్నేహాంకాన కూర్చోబెట్టుకొని, ఇది నా కూతురు అన్నాడు.'' (అయోధ్య 188: 27-30.)

సీత స్వయంగా చెప్పిన ఈ కథలో పెట్టె ప్రసక్తి లేదు. కాని బ్రహ్మ వైవర్తపురాణంలోనూ ఆనంద రామాయణంలోనూ సీత జనకునికి పెట్టెలోనే దొరుకుతుంది. ఆమె ఆ పెట్టెలో ఉండడానికి కారణం ఏమిటి? రావణుడు ఆమెను ఆ మందసంలో పెట్టి, పెట్టె సముద్రంలో పారేయడంవల్ల అలా దొరికిందని చెప్పారు. అయితే ఆదిలో రావణుడు పేటికలో పెట్టి పారవేసింది సీతను కాదు, కౌసల్యనే! ఈ ఉదంతం కూడా ఆనంద రామాయణంలోనే వుంది.

రావణుడు తనకు హరిచేతుల్లో మరణం ఉందని బ్రహ్మవల్ల తెలుసుకున్నాడు, ఆ హరి దశరథునికి కౌసల్యకు జన్మించబోతాడని కూడా తెలుసుకున్నాడు. అప్పటికి ఆ ఇద్దరికీ వివాహంకూడా కాలేదు. రావ ణుడు కౌసల్యను అపహరించి ఒక పెట్టెలో పెట్టి సముద్రంలోని ఒక చేప కడుపులో పెట్టాడు. దశరథుణ్ణి గంగలో ముంచేశాడు. శని విరగ డయిందనుకొన్నాడు. కాని దశరథుడు ఒక దీవి దగ్గర లేచాడు. అక్క డికే ఆ మందసంకూడా చేరింది. అతనికే దొరికింది. వెంటనే కౌసల్యను గాంధర్వవిధిని పెళ్ళిచేసుకొన్నాడు. (ఈ కథమీద కొంతవరకే శ్వేతాం బర జైన రామాయణ ప్రభావం ఉంది.)

ఈ విడ్డూరపు కథను విపులంగా ప్రబంధపక్కీని ''కౌసల్యా పరి ణయం'' అన్న పేరుతో వావిలకొలను సుబ్బారావుగారు తెలుగులో ఎనభై

సంవత్సరాల కిందట రచించారు. ఈ కథను కావ్యం చేయడానికి కమ్మని కారణం ఒకటుంది. సుబ్బారావుగారి తల్లి కనకమ్మగారు తాము అత్తవారింటికి వచ్చిన కొత్తలో ఈ కథను విన్నారు. ఆమె మరిదిగారు మహారాష్ట్ర భాషలోని కౌసల్యా పరిణయాన్ని చదివి వినిపించారట. చిన్నప్పుడు విన్న ఈ కథ ఆమె మనస్సులో బాగా నాటుకొంది. తన కుమారుడు మంచి కవి అనిపించుకొన్నాక ఈ కథను జ్ఞాపక మున్నంత వరకు ఆయనకు చెప్పి కావ్యం వ్రాయమన్నారు. విన్నంతవరకు అది వింతగా ఉండటం వల్ల సంపూర్ణంగా దానిని తెలుసుకోదలచి సుబ్బారావు గారు తెలిసిన స్నేహితులను, పండితులను ప్రశ్నించారు. సంస్కృతాంధ్ర పుస్తక విక్రేతలకు ఉత్తరాలు రాశారు. కాని మనోరథం సఫలం కాలేదు. చివరకు వెంకటగిరిలో ఉన్న సంకలవల్లి వెంకటసుబ్బయ్యగారు "వాల్మీకులకు మున్ను నారదుండు వోలె నెరింగించినారు." సుబ్బయ్యగారు లేఖా మూలంగా చెప్పిన కథను సుబ్బారావుగారు మాతృకగా తీసుకొని కృతిని రచించారు.

కౌసల్యా పెట్టెలో దొరికిన కథ ఆనంద రామాయణంలో వున్నా మనకు మహారాష్ట్ర భాషనుంచి దిగుమతి అయింది వావిలకొలను సుబ్బారావుగారు ఈ ఇతివృత్తాన్ని ప్రబంధంగా రాస్తే అది గ్రంథ రూపంలో రావడానికి ముందుగానే ఈ ఉదంతం యక్షగానంగా అచ్చుపడి వెలుగు చూసింది. పండరి విఠలరావు అనే కవి దాన్ని రాశాడు. ఈయన కూడా మహారాష్ట్ర భాషనుంచే సంతరించినట్టుంది. (విఠలరావు కౌసల్యా పరిణయాన్నే కాక గజగౌరీవ్రతం, శ్రీరామవిజయం అనే రామాంజనేయ యుద్ధం గాథలను కూడా యక్షగానాలుగా రాశాడు. గజగౌరీవ్రతం మహారాష్ట్రంలో చాలా ప్రచారం చెందిన కథ.) ఆనంద రామాయణం కూడా మహారాష్ట్ర దేశంలో ప్రభవించింది. ప్రాచుర్యం పొందింది. ఈ రామాయణాన్ని కూడా వాల్మీకే విరచించినట్లు నమ్మమంటారు. అది "శ్రీమచ్ఛతకోటి రామచరితాంతర్గత శ్రీమదానంద రామాయణే వాల్మీకియే" అని ప్రతి కాండాంతంలోను గద్యం ఉంటుంది.

ఆనంద రామాయణాన్ని సైతం వాల్మీకే విరచించి ఉంటే ఈ కథలన్నీ శ్రీమద్రామాయణంలోనే ఎందుకు చెప్పలేదు? అయోధ్యకాండంలో

అనసూయకు సీత చేత చెప్పించిన కథను నిజంగా అసలు వాల్మీకే విర చించాడా? ఇది అనుమానాస్పదమైన విషయం. వాల్మీకికి నారదుడు చెప్పిన రామాయణంలో అగస్త్యుణ్ణి, అగస్త్యభ్రాతని కలుసుకొనడమే వుందిగాని, అంతకుముందు అత్రినీ,అనసూయనూ దర్శించడమనే ఘట్టమే లేదు. అయినా బ్రహ్మ దిగివచ్చి దీవించి వెళ్ళాక కరతలామలకంగా వాల్మీకికి కనబడ్డ రామాయణంలో మాత్రం అత్రి, అనసూయల దర్శనం సీతారాములు చేసుకొన్నట్టు ఆ విషయసూచిక చెప్తుంది. నారదోక్తంలో లేనిది బ్రహ్మ ప్రసాదంవల్ల పుట్టిన రామాయణంలోనికి ఎలా వచ్చింది? ప్రక్షిప్తాలను కూడా ప్రామాణికాలు చేయడానికే రెండో విషయ సూచికను బాలకాండలో చేర్చారని పరిశోధకులు చెప్తారు.

సీతారాములు అత్రినీ, అనసూయనూ దర్శించుకొని సేవించు కొన్నట్టు ఆధ్యాత్మ రామాయణంలో వుంది. అయినా అందులో సీత తన జన్మకథనూ, స్వయంవర గాథనూ చెప్పడం అనే విషయాలు లేనే లేవు. వాల్మీకి రామాయణంలోనూ, తదితర రామాయణాలలోనూ సీత జన్మ వృత్తాంతాన్ని పనిగట్టుకొని ప్రక్షిప్త రచయితలు జొరబెట్టడానికి కారణం లేకపోలేదు.

దిగంబర జైనుల రామాయణంలో సీత పుట్టుక గురించి వేరే విధంగా ఉంది. ఆ కథ సంగ్రహంగా చెప్తాను. రావణుడు తన పూర్వజన్మ లలో ఒకసారి సారసముచ్చయ దేశంలో వరదేవునిగా పుట్టాడు. ఆ జన్మ తర్వాత సౌధర్మ కల్పంలో దేవమూర్తిగా జన్మించాడు. ఈ పుణ్యంవల్ల అతడు లంకాధిపతి అయిన పులస్త్యుడికి అతని భార్య మేఘశ్రీకి పుత్రుడై ప్రభవించాడు. దిన దిన ప్రవర్ధమానుడయ్యాడు. రావణుడు ఒకనాడు మణిమతి అనే సౌందర్యవతిని చూశాడు. ఆమె తపస్సు చేసుకొంటోంది. ఆ అందగత్తెను అతడు పొందచూచాడు. మణిమతి ఆగ్రహించింది. అతని కుమార్తెగా జన్మించి రావణుని సంహరిస్తానని శపథం చేసింది. చనిపోయి మండోదరి గర్భంలో ప్రవేశించింది. కొన్నాళ్ళకు మండోదరి

ప్రసవించింది. ఆడబిడ్డ పుట్టింది. లంకలో అపశకునాలు పుట్టాయి. అనర్థహేతువైన ఆ బిడ్డను ఒక పెట్టెలో పెట్టి పారవేయదలచారు. పేటికను మారీచుడి చేతికిచ్చారు. దాన్ని అతడు తీసుకెళ్ళి మిథిల ఉపవనానికి దగ్గరవున్న శ్మశానంలో పాతిపెట్టాడు. జనకుడు ఒకనాడు యాగభూమికై నేలను పరీక్షిస్తున్నాడు. పెట్టె దొరికింది. అందులో బిడ్డ సజీవంగానే ఉంది. ఆ దిక్కులేని బిడ్డను జనకుడు తీసుకుని సీత అని పేరు పెట్టాడు. తన భార్య వసుధాదేవికి అప్పగించాడు.

దిగంబర జైన రామాయణంలోని ఈ ఘట్టాలు మనకు చాలా పరిచితమైనవాటిగా కనబడతాయి. ఇందులో ఆశ్చర్యం లేదు. ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రాంతాలలో పూర్వం దిగంబర జైనశాఖ చాలా గట్టిగా వ్యాపించింది. అందుచేత వాళ్ళ పురాణాలన్నీ జనంలోనికి వెళ్ళాయి. దిగంబర జైనరామాయణంలోని విడ్డూరాలన్నీ దక్షిణ భారత ప్రజలకు వాస్తవిక విషయాలుగా పరిచితమయ్యాయి. ఆ ఘట్టాలు లేని రామకథలను రామాయణాలుగా పరిగణించని పరిస్థితి ఏర్పడి ఉంటుంది. అందువల్ల దక్షిణాది కవులందరూ వాల్మీకి రామాయణాన్నే అనువదిస్తున్నా విధిగా జైనరామాయణ ఘట్టాలను తమ కావ్యాలలో చొప్పించక తప్ప లేదు. (కన్నడ కవులు అచ్చంగా జైన రామాయణాలనే అనువదించారు.) మన తెలుగు భాషలో రంగనాథ రామాయణం మొట్టమొదటిది. ఇది ద్విపద కావ్యం. భాస్కర రామాయణం రెండవది. ఇది పద్యకావ్యం. ఈ రెండు రామాయణాలలో వాల్మీకంలో లేనివి ఎన్నెన్నో విచిత్రాలు కనబడతాయి. భాస్కర రామాయణంలో సీత పుట్టుక మరో విడ్డూరంగా కథనమైంది. జనకుడికి సీత మేనకవల్ల పుట్టిందట!

# సీత జనకుడే కాదు, జనయిత్రి కూడా బ్రహ్మజ్ఞాని

వాల్మీకి రామాయణంలో లాగే భాస్కర రామాయణంలో కూడా సీతారామలక్ష్మణులు అత్రి ఆశ్రమానికి వెళ్ళారు. ఆ మునీంద్రుడికి నమస్కరించారు. ఆ మహర్షి వారిని దీవించి తన భార్య గొప్పతనాన్ని చెప్పాడు. ఆ మాటలు విని రాముడు సీతను చూచి 'నీ వనసూయని భజియింతుగాక' అని చెప్పాడు. ఆమె అలాగే చేసింది: పతివ్రతా ధర్మాలు బోధించి అనసూయదేవి సీతను ఇలా అడిగింది. ''నిన్ను రాముడు వరించడం పూర్వం కొంత విన్నాను. ఇప్పుడా వృత్తాంతమంతా నీ నోటనే వినాలని వుంది చెప్పు." ఆమె అలా అడగగానే సీత వేడుకతో తన జన్మవృత్తాంతాన్ని కూడా వివరించింది.

"నా జనకుడు జనకుడు. రాజధర్మంతో భూరక్షణం సలుపుతూ ఒకనాడు సకల సహధర్మచారిణి సహితుడగుచు ఉచిత కర్మకు వెళ్ళాడు. నభోమండలం నుండి శ్రావ్యమైన ధ్వనులు వినబడ్డాయి. నా తండ్రి తల యెత్తి చూచాడు. కరకంకణాలూ మణిమయ మంజీరాలు ఝుణధ్వనులు కావించగా ఆ మంజుల శింజానానికి కారణభూతురాలైన మేనక ఆకాశంలో కనబడింది. ఆ అప్సరస రూపానికి ఆయన ఆశ్చర్యం చెందాడు. 'సంతానహీనుడైన నేను ఈ సరోజముఖివల్ల సంతానవంతుడనైతే ఎంతో పుణ్యం చేసుకొన్నవాడినికానా?' అని అనుకొన్నాడు.

నా తండ్రి అలా తలపోస్తూ వుండగా 'నీకు ఈ లతాంగి వల్ల నమరామణీయకమైన వైభవం వెలసే మానస సంతతి కలుగుతుంది.' అని ప్రకటించింది.

ఆ వాక్యాలు విని నా తండ్రి ఆలోచిస్తూ బీజముష్టి నిక్షేపం చేస్తూ ఉండగా (విత్తనాలు పిడికిటితో వెదజల్లుతూ ఉండగా) నేను పృథ్వీ గర్భాన ఆ అనురాగభూషితనై జన్మించాను. ఆ విధంగా నేలను చీలుకొంటూ పుట్టిన నన్ను చూసి మా జనకుడు ఆశ్చర్యం చెంది ఎత్తుకొని సంతాన లాభానికి సంతోషం పొందగా ఆకాశవాణి మళ్ళా ఇలా చెప్పింది: 'సీత పద్ధతిని ఈ సుత భూతలమున పొడమింది కాబట్టి శ్రేయోవృద్ధితో సీత అనే ప్రపంచంలో విఖ్యాతంగా ఉల్లసిల్లుతుంది.' అశరీరవాణి అలా చెప్ప గానే పుష్పవృష్టి కురిసింది.'' (అయోధ్య 432-440)

భాస్కర రామాయణంలో సీత చేత చెప్పించిన ఇంత కథలోను ''ముష్టి నిక్షేపం'' అన్న ఒకే ఒక్కమాట తప్పించి ఇంకేది వాల్మీకి రామాయణంలో లేదు. ఒక్క వాల్మీకి రామాయణంలో అన్న మాటేమిటి? ఏ ఇతర తెలుగు రామాయణాలలో గాని, సంస్కృత రామాయణాలలో గాని ఈ సంగతి కనబడదు. మన దేశంలోనే కాదు- ఇతర దేశాల రామగాథల్లో కూడా మేనక ప్రసక్తి ఎక్కడా కనబడదు. అయితే భాస్కర రామాయణ రచయిత (కుమార రుద్రదేవుడు) ఏ ఆధారం లేకుండా తనంతట తానుగా ఈ జన్మ వృత్తాంతాన్ని కల్పించి వుండడు. సీత మేనకాత్మజ అని చెప్పడానికి ఏదో ఒక సంప్రదాయపు రామకథల్లో బీజం వుండకపోదు. భావి పరిశోధనవల్లగాని ఆ సంగతి బయటపడదు.

ఎంతమందో అప్సరసలుండగా మేనకనే ఈ కవి ఎందుకు ఎంచు కున్నాడు? జనకుడు ''సకల సహధర్మచారిణి సహితుడై '' ఉచితకర్మకు వెళ్ళినవాడు మేనకను "ఇటువంటి సుందరాంగి నా ఇంతమంది భార్య లలో ఏ ఒక్కదాని కడుపునైనా పుడితే బావుండును? అని అనుకోక ఈమెవల్ల నాకు బిడ్డ పుడితే గొడ్డు వీగుతుంది కదా!'' అని ఎందుకు భావించాలి? జనకుడిలాంటి రాజర్షి ఒక్కడే కాదు- విశ్వామిత్రుడు కూడా మేనక అందానికి రెండుసార్లు సమ్మోహితుడయ్యాడు. ఒకసారి అతనికి మేనక శకుంతలను కనింది. శకుంతల తన కథ చెప్పుకుంటూ తన తల్లిని ఇలా ప్రశంసించింది.

ఊర్వశీ పూర్వచిత్తశ్చ సహజన్యాచ మేనకా
విశ్వాచీ చ ఘృతాచీ చ షడేవాప్సరసాం పరాః (ఆది-74-118)

ఊర్వశి పూర్వచిత్త సహజన్య మేనక విశ్వాచి ఘృతాచి అనే ఆరుగురే అప్సరసలలో శ్రేష్ఠులు. ఈ ఆరుగురిలో నలుగురు మరీ ప్రసిద్ధులు ; వీళ్ళ అందాన్ని చూసీచూడగానే గౌతముడు, భరద్వాజుడు, వ్యాసుడు మొదలైన మహామహులు చిత్తచాంచల్యం పొందక తప్పలేదు. దాని ఫలితంగా రేతఃపతనమై ఎందరో పురాణ వ్యక్తులు జన్మించడం జరిగింది.

ఊర్వశిని ఒకసారి మిత్రావరుణులు చూశారు. కామమోహితులయ్యారు. ఆ వేదమూర్తులకు రేతఃపతనమైంది. ఆ వీర్యాలు వ్యర్థం కాకుండా ఊర్వశి వాటిని ఒక కుంభంలో నిక్షిప్తం చేసింది. వాటి మూలంగానే వశిష్ఠుడు, అగస్త్యుడూ జన్మించారు. ఈ మునులిద్దరూ రామాయణంలో ప్రసిద్ధులే. వశిష్ఠుడు ఇక్ష్వాకుల కుల గురువు. అగస్త్యుడు రాముడికి వైష్ణవ శరాసనాలు ఇచ్చాడు. ఈ ఇద్దరికే కాక శ్రీరామ జననానికి అవసరమైన పుత్ర కామేష్టిని చేయించిన ఋష్యశృంగుడు కూడా ఊర్వశివల్ల పుట్టినవాడే. విభాండకుడనే ఋషి ఒకనాడు నదిలో స్నానం చేస్తూ ఊర్వశి అందాన్ని చూశాడు, రేతఃపతనమైంది. ఆ దివ్యవీర్యంతో మిశితమైన జలాలను దగ్గరలో ఉన్న ఒక లేడి తాగింది. దాని కడుపున నెత్తిన కొమ్మున్న ఋష్యశృంగుడు పుట్టాడు. ఈ రామాయణ వ్యక్తులే కాక సాక్షాత్తు మహాభారతాన్ని విరచించిన వేదవ్యాసుడు ఒకసారి ఊర్వశి లావణ్యాన్ని చూసి చంచలుడయ్యాడు. అతడు శపిస్తాడని భయపడి ఆమె తప్పుకొంది. రేతఃపతనమవుతున్న వ్యాసుడు కళ్ళు తెరచి చూస్తే ఎదుట ఒక చిలక కనబడింది. అందుకే శుకుడు జన్మించాడు.

ఇక ఆరుగురు అప్సరసల్లో రెండవదైన పూర్వచిత్త అగ్నీధ్రుడిని మోహింప చేసింది. అతనికి నాభి అనే కుమారుణ్ణి కన్నది. ఈ నాభికే జైనుల మొదటి తీర్థంకరుడైన ఋషనాథుడు జన్మించాడు. ఈ ఋషభుణ్ణే విష్ణుమూర్తి అవతారంగా వైదికార్యులు మలచుకొన్నారు.

ఘృతాచి విశ్వామిత్రుడి తాత అయిన కుశనాభుణ్ణి మోహింపచేసి అతనికి నూరుమంది పుత్రికలను కన్నది. ఈమెను చూసి భరద్వాజుడికి రేతఃపతనమై ద్రోణుడు పుట్టాడు. అరుగురు అప్సరసల్లో విశ్వాచి, సహజన్యల గురించి ప్రసిద్ధ పురాణాలలో ఇటువంటి వివరాలేమి దొరకవు. మేనక గురించి మాత్రం ఇతర విషయాలు తెలుస్తున్నాయి.

ఊర్వశి లాగే మేనక కూడా చాలా ప్రాచీన కాలపు వ్యక్తి. ఈ ఇద్దరి పేర్లూ ఋగ్వేదంలో కనబడతాయి. మన వాఙ్మయంలో ఋగ్వేదం చాలా పురాతనమైనది. అందులోని వ్యక్తులు ఇతిహాసపు పొలిమేర్లలో విహరించే వేల్పులు. కొందరు ఉత్తరోత్తరా రూపం సంతరించుకున్న పురాణాలలో ప్రసిద్ధ వ్యక్తులయ్యారు. కొందరు మరుగున పడ్డారు. మేనక జన్మవృత్తాంతాన్ని విష్ణుపురాణం ప్రథమాంశంలోని పదో అధ్యాయం ద్వారా తెలుసుకోవచ్చు.

పితృదేవతలు రెండు రకాలుగా వుంటారు. ఒక శాఖను అనగ్నులంటారు. (వీళ్ళు యజ్ఞయాగాదులు చేయరు.) రెండో శాఖను సాగ్నులంటారు. (వీళ్ళు యజ్ఞకర్మలు కావిస్తారు.) అనగ్నులను అగ్నిష్వాత్తులని పిలుస్తారు. సాగ్నులను బర్హిషదులంటారు. పితృదేవతలందరికీ ఒకే ఒక్క ఉమ్మడి భార్యవుంది. ఆమె పేరు 'స్వధా.' ఈమెకు మేనా, (లేక మేనక) ధారణి అనే ఇద్దరు కుమార్తెలు పుట్టారు. ఈ ఇద్దరూ బ్రహ్మవాదినులు, యోగినులు, ఉత్తమ సంపన్నులు, సర్వసముదిపగుణులు.

విష్ణు పురాణంలో మేనక గురించి తెలియవచ్చే ఈ గుణాల ప్రకారం ఒక ఊహాగానం చేయవచ్చు. భాస్కర రామాయణంలోని సీత జన్మకథకు మూల రచయితలు సీత తండ్రినే కాక తల్లిని కూడా బ్రహ్మవాదిని చేయదలచి ఈ మార్పు చేశారేమో! జనకుడు మహర్షి, బ్రహ్మజ్ఞాని అన్న సంగతి ఉపనిషత్తులు వేనోళ్ళ చాటుతాయి. ఏ అజ్ఞాతమైన ఉపనిషత్తులోనో ఈ కథ దొరకవచ్చు.

ఇప్పుడు అప్సరసలను కేవలం దేవవేశ్యలుగా పరిగణిస్తున్నా ఒకనాడు వాళ్ళు బ్రహ్మజ్ఞానులు. ఆదిమ సమాజంలోని పూజారులు జలదేవతలు, నీటి సరస్సులని వీళ్ళ పేరే చెబుతూంది. ఆచార్య

డి. డి. కోశాంబిగారు ఊర్వశి మీదా, అప్సరసల మీదా 'మిథ్ అండ్ రియాలిటీ' అనే గ్రంథంలో మౌలికమైన పరిశోధనలు చేశారు వాటిని ఆధారం చేసుకొని ఈ అంశాన్ని ఇంకా విపులంగా పరిశీలించాలి.

ఏమైనా జైనుల రామాయణంలో జనకుని భార్యపేరు ధరణీదేవి, ధారణీదేవి, వసుధాదేవి అనే పర్యాయపదాలుగా కనబడుతూ వుంటే, ఆ ధారణీదేవి అక్కగారైన మేనకను జనకుడికే ముడిపెట్టిన భాస్కర రామాయణం విశ్వసాహిత్యంలో రామాయణ పరిశోధనల దృష్టిలోనికి రావలసివుంది. నిజానికి ఇదొక్కటే కాదు, తెలుగు రామాయణాలలో కనబడే విడ్డూరాలన్నీ పరిశోధకులకే కాక ప్రజల దృష్టిలోనికి రావాలి.

# స్త్రీల రామాయణాలలో చిత్ర విచిత్రాలు

శిష్ట సాహిత్యంలో రామాయణ కావ్యాలు ఎన్ని ఉన్నాయో జానపద సాహిత్యములో అంతకు కొన్ని రెట్లు ఎక్కువగానే రామ కథలు ఉన్నాయి. ఆచార్య బిరుదురాజు రామరాజుగారు చెప్పినట్లు ''జానపదులకు తెలిసినంత శ్రీరామ చరిత్ర పండితులకు తెలియదేమో!" అందుకే భాస్కర, రంగనాథ రామాయణ కర్తలకు తెలియని విశేషాలు జానపదులకు బాగా తెలుసు. ఆదిలో క్రీస్తుకు పూర్వము 315 వ సంవత్సరంలో భద్రబాహుడి నాయకత్వాన జైనులు మగధదేశం నుంచి దక్షిణాదికి వచ్చినప్పటి నుంచి మన జానపదులు రామాయణ గాథలు వింటూనే వున్నారు. వాటిని గేయాలుగా అల్లుకుని పాడుకొంటున్నారు. మన పండితులు వాల్మీకి రామాయణాన్ని చాలా లేటుగా అనువదించారు. అలా ఆంధ్రీకరిస్తున్నప్పుడు తెలుగు నాట ప్రాచుర్యము పొందిన అవాల్మీకాలను తమ కావ్యాలలో చేర్చుకున్నారు.

జానపద సాహిత్యంలోని ఒక విభాగమైన స్త్రీల పాటల్లో సీతా రాములు అచ్చంగా తెలుగువాళ్ళయ్యారు. తెలుగు జీవితంలోని కష్ట సుఖాలు, ఆచార వ్యవహారాలు, ఆట పాటలు, వావి వరుసలు, నోములూ, వ్రతాలూ, పంతాలు, పట్టింపులూ అన్నీ సీతారాములకు నేర్పారు. ఆదిమ జైన రామాయణాల్లోని మూలబీజాలను చెడనివ్వకుండా సన్నివేశాలను తెలుగు మర్యాదలకు తగ్గట్టు మలచుకొన్నారు. అందుకే ఆడవాళ్ళ రామాయణపు పాటల్లోనే ఆహా అనిపించే ఘట్టాలు అడుగడుగునా కనబడతాయి.

స్త్రీల రామాయణపు పాటలలో ''కుశలవ కుచ్చలకథ'' చాలా పెద్దదేకాక ముఖ్యమైనది. దీనిని అచ్చంగా తెలుగువాళ్ళ ఆడకూతురే వ్రాసింది. ఆ తల్లి పేరేమిటో తెలియదుకాని అత్యంత ప్రాచీన కాలపు రామ కథలకు ప్రాణంపోసి కలకాలానికి భద్రపరిచింది. 'ఇది వాల్మీకి రామాయణము తలపున వ్రాసెను ఆ సతి తాను' అని పాట చివర వుంది. అయినా వాల్మీకంలో లేనివి ఎన్నో జైన రామాయణాల నుంచి పిన్నవి ఈ కథలో మలచింది. బెంగాలీ రామాయణాలలో ఒకటైన చంద్రావతి కావ్యానికి దీనికి పోలికలు కనబడతాయి. చంద్రావతి రామకథలో వదిన గారు రావణుని పటం రాయమంటే సీత రాస్తుంది. అందువల్ల రాముడు అనుమానించి సీతను నిండు చూలాలైనా కనికరించక అడవులకు పంపిస్తాడు. కుశలవ కుచ్చల కథలో కూడా వదినగారు ఆజ్ఞాపించిన మీదటే సీత బొమ్మ వేస్తుందిగానీ ఆ ఆజ్ఞకు వేరే కారణం కూడా వుంది.

పట్టాభిషేకం అయ్యాక రాముడు ఒకనాడు వేటకు బయలు దేరాడు. సీత దగ్గర సెలవు తీసుకోడానికి వెళ్ళాడు. "మందగమన నే వేటకు వెళ్ళెద మధ్యాహ్న విధికి వస్తాననెను." సీత "మిమ్ము నెడబాసి నిముష మోర్వను మీతో కూడా వస్తాననెను. నాడు అడవిలో యెవ్వరు లేకుండా చెరగొనిపోయిరి. దానవులైన, నేడయోధ్యలో మనవారుండగ ఏమిభయమే జానకి నీకు? ఎడబాయక మన శాంతవుండగా ఏమికొదవ గావచ్చునె నీకు?'' అని ధైర్యంచెప్పి రాముడు వెళ్ళిపోయాడు. నిజానికి భయమూ కొదవా రెండూ వచ్చాయి అవి శూర్పణఖవల్ల రాకతప్పలేదు.

రామలక్ష్మణుల మీద మోహం, సీతమీద కసీ శూర్పణకు పోలేదు. వగ సాధించాలనుకొంది. 'రామునీత' కెడబాపుదు ననుచు యతివేషము తప్పక దాల్చెను. ఎక్కడనుంచో యతి వచ్చిందని రాముడికి అడవిలో చెప్పారు. ఏ దేశం నీది? ఏం విద్యలు నీకువచ్చు? అని రాముడు అడిగాడు.

"వాడిగట్టి చుక్కల నేరగ నేర్తు
ఏరిన చుక్కలు విడువగ నేర్తు
పారెడు పిడుగుల పట్టగ నేర్తు
పట్టిన పిడుగుల విడువగ నేర్తు

మంచు కుంచానపోసి కొలవగ నేర్తు
అరచేయి పాత్రగా వాడగ నేర్తు
వాన తాడుగా పేనగ నేర్తు
మడుగుపై బెంగువేసి నిద్రింప నేర్తు
చక్రాలుని నారలు వొలువగ నేర్తు
ఇసుకల పొయిబెట్టి వండగ నేర్తు
ఉసిరికాయలు దొంతులు పెట్టగ నేర్తు
ఆలుమగల నెడబాపగ నేర్తు
చింతలెక్కి చిగురు కొయ్యగ నేర్తు
సీతారాముల యెడబాపగ నేర్తు

అని యతివేషంలో వున్న శూర్పణఖ చెప్పింది. అది యతికదా అని రాముడు అంగదుణ్ణి పిలిచి ఆమెను అంతఃపురానికి తీసుకువెళ్ళ మన్నాడు. అంతఃపుర కాంతలందరు ఆమె చుట్టూ చేరారు. శాంత వచ్చి అందరిమీదా మండిపడింది. "యతులకు విద్యలు ఏమి జేయనే? గారడి వారికి విద్యలుగాని" అని తిట్టింది. ఇటువంటి యతిని అంతఃపురానికి పంపించినందుకు అడవిలోవున్న రాముడికి కూడా ఇక్కడనుంచి వడ్డించింది. "చేసేది మర్కట సహవాసము. రాజనీతి లేరీతిగవచ్చు" అని ఎత్తి పొడిచింది. అంతఃపుర కాంతలు వాళ్ళవాళ్ళ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

శూర్పణఖ మాత్రం భయపడలేదు. "కూటిక చేరిన బాపన పడుచువు! కూతలేటికే శాంతరొ నీకు" అని మందలించింది. దీనికి ఇవ్వవలసినది ఇచ్చి పంపించు అని శాంత సీతతో చెప్పింది. శూర్పణఖ తనకు రావణుని పటం కావాలంది. సీతను రాసి ఇమ్మంది. "పది నెలలు చెరనుంటిని కాని పాపకర్ముని కన్నులచూడ, జనకునిగా భావిస్తిని. నేను అంగుష్ఠ మొక్కటి ఎరుగుదును" అని సీత చెప్పింది. అంత మాత్రమే వ్రాయవే అంది యతి. సీత రాసింది. ఆ మీదట యతి అంతా వ్రాసేసింది. ఆ పట్టాన్ని పట్టుకొని ఆకాశవీధిన పోయింది. బ్రహ్మ దగ్గరకు వెళ్ళింది. దానికి ప్రాణం పోయించుకొని వచ్చింది. ఆ పటాన్ని సీత దగ్గర పడేసి చక్కాపోయింది.

ఆ పటం వచ్చి ముందర నిలబడి "రావే పోదము లంకకు ననుచు సీతను పట్టుక ఆపద పెట్టెను." అంతఃపురంలోని వాళ్ళు ఆ పటాన్ని నిప్పులో పడేశారు. పటాన్ని చల్లార్చుకుంటూ పటం వచ్చింది. పాడునూతిలో పడేసి పైన పాషాణాలు పడేశారు. ఆ పాషాణాలను పగుల దన్నుకుంటూ పటం వచ్చి మళ్ళీ సీతను బలవంత పెట్టింది. సీతమ్మ రాముడి మీద ప్రమాణం చేసి ఆ పటాన్ని మంచం కింద దాచింది,

రాముడు వేటనుంచి తిరిగి వచ్చాడు. చుప్పనాతి చేసిన పని ఆత డికి తెలియనివ్వకుండా కప్పిపెట్టారు. రాముడు ఆ రాత్రి మంచం మీద పడుకున్నాడు. పటం వచ్చి పడతోసింది. ఇది సీతమ్మ చేసినపని అను కున్నాడు. "అడుదురు పాడుదురు కవ్వింతురుగాని పడత్రోసుట లివి సరసములటనే" అన్నాడు. ఒంటి మన్ను దులుపుకొని రాముడు పట్టె మంచంపై కూర్చున్నాడు. ఇప్పుడు పటం ఎదురుగా వచ్చింది. రాముడు దాన్ని చూశాడు. సీతను అనుమానించాడు. "నాకని ఇచ్చెను జనకుడు నిన్ను మోహము రావణుపై కద్దనెను. ఎంత మోహము రావణు మీదా? ఎక్కడి స్నేహమె రావణుపైని? హనుమంతునిచే నానవాలంపి అక్కర లేదన వద్ద వాడు? రావణు చంపకనట్టే వుంతును. సుఖమున నుందువు వాడిని గూడి" అని అనరాని మాట లన్నాడు. సీతను అడవులకు పంపించాడు.

సీతా పరిత్యాగానికి ఆడవాళ్ళ రామకథ చెప్పే ఈ కారణం వాల్మీ కంలో కనబడదు. కాని శ్వేతాంబర జైన రామాయణంలో ఉంది. అందు లోను సీత పటం వేస్తుంది. అయితే ఆమె సవతులు కోరడంవల్ల అలా చిత్రించక తప్పలేదు. ఈ జైన సన్నివేశమే కొద్ది మార్పులతో ఆడవాళ్ళ రామాయణంలో చోటు చేసుకుంది. తెలుగు రాముడు కూడా ఏకపత్నీ వ్రతుడు కనుక సవతుల స్థానంలో శూర్పణఖ వచ్చింది. ఈ మార్పు దూరప్రాచ్యానికి పాకింది. అయితే అలా ఖండాంతరాలకు వెళ్ళడంలో తెలుగుమార్పు మరొక మార్పుచెందింది. థాయిలాండ్‌లోని ఒక రామకథలో శూర్పణఖ కాక ఆమె కూతురు "అద్దుల్" అనే రాక్షస కన్య సీతచేత బొమ్మ గీయించి పగ తీర్చుకొంటుంది. లంకలోని రామకథలో ఉమ

సీతచేత పటం రాయిస్తుంది. కంబోడియాలోని రామకథలో ఒక యక్షిణి వచ్చి సీతచేత పటం రాయిస్తుంది. మలేషియాలోని రామాయణంలో కైకేయి కూతురు కుకువా ఈ పని చేయిస్తుంది. బెంగాలీ భాషలోని చంద్రావతి రామాయణంలో కూడా "కుకువాదేవి" మూలంగానే సీత బొమ్మ గీయవలసి వస్తుంది ఈమె కైకేయి కూతురే కాని మంధర నూరిపోయడంవల్ల బొమ్మ గీయించింది.

వివిధ దేశాల రామాయణాలలో ఈ సన్నివేశం ఇన్ని మార్పులు పొందడానికి కారణం ఒకటే ఉంది. అది రాముడి ఏకపత్నీ వ్రతమే. జైనులకు ఆ తొలి రోజులలో ఆ పట్టింపులేదు. కనుక రాముడికీ లక్ష్మణుడికీ బహు భార్యలను అంటబెట్టారు. ఈ జైన సంప్రదాయాన్ని కూడా తెలుగు ఆడవాళ్ళు మరచిపోలేదు. సీతమ్మకు సవతులలో కయ్యం చూచాయగా చూచించారు.

# సీతకు ఎంతమంది సవతులు?

రామాయణ కథా కాలంనాటికి ఏకపత్నీ వ్రతం దేశంలో బాగా వేళ్లూన లేదనుకోవాలి. దీనికి జైన రామాయణంలో దాఖలాలు కనబడ తాయి. అ రామాయణంలో రాముడికీ, లక్ష్మణుడికీ మాత్రమే కాదు - ఈనాడు మనం అస్ఖలిత బ్రహ్మచారిగా భావిస్తున్న అంజనేయుడికి కూడా బహు భార్యలున్నారు.

(మైరావణ కథలో హనుమంతుడు తన కొడుకుతో యుద్ధం చేస్తాడు!) జైన రామాయణంలోనే కాక వాల్మీకి రామాయణంలో కూడా రాముడికి బహు భార్యలున్నట్లు కనబడుతుంది. అయితే, ఈ సంగతి వాల్మీకి వాచ్యంగా కాక వ్యంగ్యంగా చెప్పాడు.

మంథర కైకేయికి దుర్బోధ చేస్తూ ఇలా అంది :

హృష్టాః ఖలు భవిష్యంతి రామస్య పరమాస్త్రియః
అప్రహృష్టా భవిష్యంతి స్నుషాస్తే భరతక్షయే॥

(అయోధ్య 8-14)

"రాముడే రాజైతే అతని ఉత్తమ స్త్రీలు ఆనందిస్తారు. నీ కోడళ్ళు నిర్భాగ్యులౌతారు. భరతుడికి అధోగతే" అని ఈ శ్లోక భావం. "రాముని స్త్రీలు" అనే పదానికి అతని భార్యలు అన్న సూటి అర్థాన్ని కాక దాసీ జనులు అన్న అర్థాన్ని వ్యాఖ్యాతలు చెప్తారు. కైకతో మంథర నీ కోడళ్ళు అని బహువచనంలో చెప్పింది. భరతుడి కెందరు పెళ్ళాలు? ఈ శ్లోకంలో వాల్మీకి ఉద్దేశ మేమిటో సుందరకాండలోని శ్లోకంవల్ల తెలుస్తుంది.

రాక్షస స్త్రీలు బెదిరించగా భయపడి సాక్షాత్తూ సీతమ్మే ఇలా అంది :

పితుర్నిదేశం సమయేన కృత్వా
వనాన్నివృత్తశ్చరిత వ్రతశ్చ

స్త్రీ భిశ్చ మన్యే విపులేక్షణాభి
స్త్వంరంస్యసే వీతభయః కృతార్థః
(సుందర - 28-14)

'పితృవాక్యపరిపాలనం కావించి, వనవాసం ముగించి రాముడు తన ఉత్తమ స్త్రీలను పొంది రమించుచు సుఖముగా ఉండగలడు' అని చెప్పింది. అయోధ్యాకాండలోని ఉత్తమ స్త్రీలు దాసీజనమైతే సుందర కాండలో వాళ్ళతో రాముడు రమిస్తాడని సీత భాషించడం అపచారమే! ఈ శ్లోకం ప్రక్షిప్తమని కొందరంటారు.

నిజానికి బ్రహ్మాండపురాణం ప్రకారం రాముడికి సీత కాక ఇంకో నూట ఇరవై ఎనిమిది మంది భార్యలు. స్కాందపురాణం ఈ లెక్కను సమర్థిస్తుంది. దుర్వాస రామాయణంలో సీత అనుమతి మీద రాముడు పదహారు మంది భార్యలను పెళ్ళి చేసుకొన్నాడు.

రాముడిని అవతారమూర్తిగా భావించే ఈ ఇతర రామాయణాల కర్తల లాగే వాల్మీకి కూడా ఆనాటి ఆచారాన్ని సూచించాడు. జైన రామాయణంలో రాముడికి నలుగురే భార్యలు. సీత, ప్రభావతి, రతినిభ, శ్రీరమ అని వాళ్ళ పేర్లు. లక్ష్మణుడికి అష్టమహిషులున్నారు. విశల్య రూపవతి, వనమాల, కల్యమాలిక, రత్నమాలిక, జితపద్మ, భయవతి, మనోరమ అన్నవి వాళ్ళ పేర్లు. ఈ అష్టమహిషులేకాక లక్ష్మణుడికి పదహారువేలమంది భార్యలు కూడా ఉన్నారు. (లక్ష్మణుడు నవ నారాయణులలో ఎనిమిదవ నారాయణుడు. తొమ్మిదో నారాయణుడైన కృష్ణుడు లాగే ఎనిమిదవ నారాయణుడికి కూడా అదే లెక్కలో మహిషులు, భార్యలు ఉన్నారని జైన సంప్రదాయం చెపుతుంది.)

చారిత్రక పరిస్థితులవల్ల దేశంలో ఏకపత్నీవ్రతం ఆవశ్యకమైంది. అందుకు ఆదర్శప్రాయుడుగా రాముడికి ఇతిహాసకర్తలు మలచుకొన్నారు. బహుభార్యలున్నారన్న సత్యం మరుగున పడేటంత బలంగా ఆదర్శప్రచారం జరిగింది. అయితే కథకు అవిధేయంగా ఇతిహాసాన్ని

మార్చడం అపచారంగా మన కథకులు భావిస్తారు. పూర్వాచారాన్ని సంస్కరించవలసివస్తే భావం చెడకుండా సంస్కరిస్తారు. మనకు తొలి ధర్మశాస్త్రాన్ని రచించేకాలంలో ద్విజులు పెట్టే తద్దినాలలో మాంసం విధిగా ఉండాలి. కాని కాలక్రమేణా మాంసాహారం బ్రాహ్మణులకు నిషిద్ధం అయింది. అయినా ఆచారాన్ని సూచించడానికి మాంసానికి ప్రత్యామ్నాయంగా పిండివంటలు వచ్చాయి. పశువుకు ప్రత్యామ్నాయంగా పిష్టపశువు.

జైన రామాయణంలోని సన్నివేశాలను మన తెలుగు స్త్రీలు ఆకళించుకొన్నారు. రాముడిని ఏకపత్నీవ్రతుడిగా చిత్రిస్తూనే బహుపత్నుల సత్యానికి ఒక కల్పన ఊహించుకొన్నారు. కుశలవ కుచ్చల కథలో ఈ సన్నివేశం చూడండి.

సీతారాములు సొగటా లాడారు. రాముడు ఓడిపోయాడు. సీత గెలిచింది. ఓడిన ధనం రాముణ్ణి అడిగింది. శాంత చతుర వచనాలతో మరదలుతో మాట్లాడుతూంది రాముడు తన నగరికి వెళ్ళిపోయాడు. సీత కోసం ఎదురుచూస్తున్నాడు. ఎంతసేపటికీ ఆమె రాలేదు. విసుగెత్తి "తడవాయెను. జానకి రాదాయెను. తమ్ముణ్ణి పిలిపించెను రాముడు." లక్ష్మణుడు ఏర్పాట్లు కావించాడు. మందగమనలు వచ్చి అందంగా వింజామరలు వీచుతూ ఆకుమడుపులు అందిస్తూ పాదాలు వత్తుతూ రాముడిని కూడి ఉన్నారు. ఆ సందడి ఘనమైంది.

సీత చెవుల పడింది. చూసివద్దామని జానకి .జాలకర్రల వెంట చూసింది. నివ్వెరపడిపోయింది.

'ఏకపత్నీవ్రతుడవు అనుచూ
ఇచ్చెగాక మా తండ్రయితే
యేకపత్నీవ్రతములు అన్నీ
తెలిసెగదా ఈలాగు'

అని రామయ్యని ఎత్తిపొడిచింది. ఆ మాటలు విన్న మగువలు విరుచుకుపడ్డారు.

ఎక్కడి దానవే జానకి నీవు
యెప్పటికి మేమే వున్నాము
అడవుల లోపల నీవు జానినా
అంత వేడుకతో మాతో గూడె
విల్లు విరవగా వచ్చిన దానవూ
యెక్కడి దానవే జానకి నీవూ

ఈ సవతుల కయ్యంతో సీత కళ్ళనీళ్ళు పెట్టుకుంది. శాంత వచ్చింది. తమ్ముడిని మందలించిది రాముడు నిజం చెప్పాడు.

ఆ అబలలు నిజంగా మానవకాంతలు కారు, తన అస్త్రాలే! వాటిని ఆడకూతుళ్ళను చేశాడు. "అక్కరో చూడవే అస్త్రమ్ములూ సీతను పట్టి తెచ్చి వస్త్రమ్ములు" అని చెప్పాడు. సీతకు అనుమానం తీరింది.

ఈ సన్నివేశంలో పూర్వాచారాన్ని సూచిస్తూనే ఏకపత్నీ వ్రతాన్ని తెలుగు స్త్రీలు నిలబెట్టారు. సవతుల మాటలలో ఇంకో సత్యం కూడా ఇమిడి ఉంది. అడవిలో నిన్ను ఎడబాశాక వేడుకతో మాతో రమించా డన్న మాటలు జైన రామాయణంలోని వేరొకఘట్టాన్ని స్ఫురింపచేస్తాయి. సీతను అన్వేషిస్తున్నప్పుడు వివిధ రాజులు రాముడికి పిల్లల నిస్తామన్నారు.

సీత చెర విడిపించాక వాళ్ళను పెళ్ళి చేసుకుంటానని రాముడు మాటిచ్చాడు. అలాగే చేసుకున్నాడు. జైన రామాయణం ప్రకారం వన వాస కాలంలో లక్ష్మణుడు దారి పొడుగునా పెళ్ళిళ్ళు చేసుకొంటూనే ఉన్నాడు. ఈ పెళ్ళిళ్ళు దూరప్రాచ్యంలోని రామకథల్లో కూడా కన బడతాయి.

# ఋగ్వేదంలో సీతారామలక్ష్మణులు

ఎన్నో దేశాల్లో ఎన్నెన్నో రకాలుగా వ్యాపించిన రామకథలను చూశాక తర్కించి దేనికేది మూలమో చెప్పలేక పోవచ్చునుగాని భారత దేశంలో అన్నింటికి వేదాలే మూలం అని విశ్వసించడం ఆచారం. రెండవ ప్రపంచ సంగ్రామ రోజుల్లో హిట్లర్ ''అద్భుతం''గా జయించు కొంటున్న తొలి రోజులలో మనవాళ్ళు కొన్ని కట్టుకథలు పుట్టించారు. ఒక వేద పండితుణ్ణి-అందులోనూ తెలుగువాణ్ణి హిట్లర్ జర్మనీకి రప్పించు కొని వేద రహస్యాలన్నీ చెప్పించుకొని వాటి చొప్పునే మారణాయుధాలు నిర్మింప చేశాడట; వేదమంత్రాల శక్తివల్లనే అలా నెగ్గుకొచ్చాడట! హిట్లర్ పరాజయంతో ఈ కథలూ కంచికి వెళ్ళిపోయాయి. అయినా, మన తత్వం చాలా పాతది. కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధాన్లు ఏమన్నాడు? ''ఈ తెల్లవాళ్ళు చేసే విద్యలన్నీ మన గ్రంథాల్లోంచి ఎత్తుకెళ్ళినవే; ఈ రెయిళ్ళూ గియిళ్ళూ యావత్తూ మన వేదంలో వున్నాయిట!" (అగ్నిహోత్రావధాన్లు వేదపండితుడే. ఈ పట్టెని జటలో అతనంతటివాడు లేడని చెప్పుకొంటారు. అయినా, అతడు ''అష'' అనవలసి వచ్చింది. వేదం యనభై రెండు పన్నాలూ ఒహ దమ్మిడీ పుస్తకాల ఖర్చు లేకుండా చదువుకొన్నాడు కాని అందులో ఏముందో పరిశీలించిన పాపాన పోడు.)

రెయిళ్ళు వేదంలో లేకపోతేనేం రామాయణంలో మాత్రం వున్నా యంటారు. నిజానికి భారతీయ సంస్కృతికి సంబంధించి నంతవరకు వేదంలో లేనిదంటూ వుండరాదంటారు. కాబట్టి పండితులు కూడా వేదానికి రామాయణానికి గట్టి సంబంధం వుందంటూ నమ్ముతారు. వేదవేద్యుడు

రాముడిగా అవతరించినప్పుడు వేదాలు సాక్షాత్తుగా వాల్మీకి రామాయణ రూపం ధరించాయన్న విశ్వాసాన్ని శ్లోకబద్ధం చేశారు.

వేద వేద్యే పరేపుంసి
జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ
త్సాక్షా ద్రామాయణాత్మనా.

ఈ విషయం నిజమో కాదో తెలుసుకోవాలంటే వేద వాఙ్మయాన్ని పరిశీలించాలి. వేదాలూ, బ్రాహ్మణాలూ, ఉపనిషత్తులు చెప్పే కథలు గమనించాలి పాశ్చాత్య పండితులు చాలా శ్రద్ధగా సంకలనం చేసిన "వేదిక్ ఇండెక్సు" ప్రకారం రామాయణ పాత్రలు వేద సాహిత్యంలో ఉన్నాయో లేవో చూడాలి.

ఈ దృష్టితో చూస్తే చూసీ చూడగానే సీతారామలక్ష్మణుల ముగ్గురిపేర్లు ఋగ్వేదంలో కనబడతాయి. కోసల విదేహ రాజ్యాలు శత పథ బ్రాహ్మణంలో కనబడతాయి. ఇక్ష్వాకు వంశం ప్రసక్తి ఋగ్వేదంలో ఒకసారి, అథర్వణవేదంలో ఒకసారి వస్తుంది. అహల్య, ఋష్యశృంగుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు ప్రసిద్ధ వైదిక వ్యక్తులు. ఋగ్వేదంలోని ఏడవ మండలమంతా వసిష్ఠునికే చెందుతుంది. అలాగే తృతీయ మండలం పూర్తిగా విశ్వామిత్రుడిది. ఈ ప్రఖ్యాత ఋషుల పరస్పర వైరుధ్యం కూడా వైదిక గాథలవల్ల తెలుసుకోవచ్చు. విష్ణువు ప్రసక్తి ఋగ్వేదంలో చాలా మార్లు వస్తుంది. జనకుడు శతపథ జైమినీయ బ్రాహ్మణాలలో, బృహదారణ్యక, కౌశీతకీ ఉపనిషత్తులలో కనబడతాడు. భరతుడు వ్యక్తిగా ఒకసారీ భరత ప్రజలు సమష్టిగాను ఋగ్వేదంలో గోచరిస్తారు.

రామాయణంలోని చాలా పాత్రలు ఇలాగ వైదిక వాఙ్మయంలో కనబడుతున్నా (ఒక్క వశిష్ఠ విశ్వామిత్రుల విషయంలో తప్ప వీళ్ళకు పరస్పర సంబంధాలు లేనేలేవు.) వైదిక వాఙ్మయంలో రాముడనే పేరు నాలుగుసార్లు కనబడుతుంది. ఋగ్వేదం పదవ మండలంలో ఒక రాముడున్నాడు (93 - 14.) ఇతడు మాయవ వంశంవాడు కావచ్చు.

శతపథ బ్రాహ్మణంలో ఒక ఆచార్యుని పేరు రాముడు. ఇతడు ఉపతస్విన వంశం వాడు. కనుక రామజౌపతస్విని అని ఇతణ్ణి పిలుస్తారు. జైమినీయ ఉపనిషత్ బ్రాహ్మణంలో ఒక రామక్రాతు జాతేయుడు. వైయాఘ్రపద్యుడు అనే ఉపదేశికుడి పేరు రెండు వంశాలలో కనబడుతుంది. ఐతరేయ బ్రాహ్మణంలో ఒక రాజమార్గవేయుడి ప్రసక్తి వుంది. ఇతడు శ్యాపర్ణుల పురోహితుడు. ఈ రాములలో ఏ ఒక్కడూ ఇక్ష్వాకు వంశం వాడు కాకపోవడం గమనార్హం. అయితే ఇక్ష్వాకు వంశం ఋగ్వేద కాలంనాటికే చెప్పుకోదగ్గ వంశమే.

ఈ వైదిక రాములకు ఇక్ష్వాకు వంశంతోనే కాదు- సీతతో కూడా ఏమీ సంబంధం లేదు. ఋగ్వేదంలో ఒకసారి పేర్కొనబడ్డ లక్ష్మణుడు రాముడి తమ్ముడు కాదు. బ్రాహ్మణాలలో, ఉపనిషత్తులలో ప్రముఖుడైన జనకుడికి సీతతోగాని రాముడితోగాని సంబంధం ఎక్కడా కనబడదు. ఋగ్వేదంలో సముచితస్థానం ఏర్పరచుకొని, విష్ణువు అవతారాలేమి ఎత్తలేదు. వైదిక రాముడికి విష్ణువుకి సంబంధం లేదు.

ఋగ్వేదంలోని సీత రాముడి భార్య కాదు- ఇంద్రుడి పెళ్ళాం. తైత్తిరీయ బ్రాహ్మణం (2.3.10) ప్రకారం చంద్రుడి పెళ్ళాం. బహుశా ఇందువల్లనే రాముడికి రామచంద్రుడనే పేరు వచ్చిందని (వీబరు, జాకోబీ వంటి) పండితులు భావిస్తున్నారు. ఋగ్వేదం 4 వ మండలంలోని ఈ ఋక్కులు చూడండి:

అర్వాచి సుభగేభవ సీతే వందా మహేత్వా।
యాథానః సుభగస యథానః సుఫల సని॥
ఇంద్రః సీతాం నిగృహ్ణాంతు తాం పూషాను యచ్ఛతు
సాఽపయస్వతీ దుహాం ఉత్తరాం సమాం (5.67)

"ఓ సౌభాగ్యవతి సీతా! మమ్మి చేరు. మమ్మి సౌభాగ్యవంతులుగా సఫలలుగా చేస్తావని నిన్ను పూజిస్తున్నాము. ఇంద్రుడు సీతను గ్రహించుగాక! పూషుడు నిర్దేశం చేయుగాక! పాలు నిండారిన నీవు మా కోసం ఉత్తరోత్తరా ప్రవహించుదుగాక!" అని ఈ ఋక్కులు సీతను స్తుతించుతున్నాయి. ఈమె వ్యావసాయిక దేవత. కౌశిక సూత్రాలలోని

అద్భుతాధ్యాయంలోనూ పారస్కర గృహ్య సూత్రాలలోనూ పంటపొలం వేలుపుగా సీతను ఆరాధించడం కనబడుతుంది. (ఈ సూత్రాలు వైదిక వాఙ్మయంలో చాలా అర్వాచీనమైనవి.) ఈ సూత్రాలలో సీత అత్యంత సౌందర్యవతి. ఇంద్రుడి (పర్జన్యుడి) భార్య. తైత్తిరీయ బ్రాహ్మణంలోని సీత సోముడిని వలచింది. ఆమె కోరిక ఫలించడానికి సోముడిని పొంద డానికి సీత తండ్రి ఆమెను "స్థాగర అలంకార" భూషితురాలిని కావిం చాడు (వాల్మీకి రామాయణంలో అనసూయ అంగరాగం ఇచ్చినట్టు). తైత్తిరీయంలో సీత చంద్రుణ్ణి పొందింది. వాల్మీకంలో రామచంద్రుణ్ణి పొందింది. ఋగ్వేదంలోని సీత కథే వాల్మీకి రామాయణానికి మూల కందమని పాశ్చాత్య పండితులు నిరూపించడానికి ప్రయత్నించారు. ఇంద్రుడే రామచంద్రుడన్నారు. ఆ మాట కొస్తే శ్రీరాముడే బలరాము డన్నారు. ఈ వాదంలో నిజం లేకపోలేదు.

# సీతారామాంజనేయులు ఎవరై వుంటారు?

పందొమ్మిదవ శతాబ్దంలోనే పాశ్చాత్య పండితులు రామాయణంపై చాలా విపులమైన పరిశోధనలు చేశారు. కొందరు గంభీరమైన అధ్యయనం చేశారు కొందరు పేలవమైన ప్రతిపాదనలు చేశారు. కొందరు విశిష్టమైన విశ్లేషణ కావించారు. కొందరు మౌలికమైన పరిశోధనా పత్రాలు ప్రకటించారు. ఒకరిద్దరు ప్రామాణికమైన నిర్ణయాలు సూచించారు.

ఈ పండితు లందరిలో ఉద్దండుడు డాక్టర్ హెర్మన్ జాకోబీ అనే జర్మనీ దేశపు విద్వాంసుడు, ఈయన "డాస్ రామాయణ'' అనే పరిశోధక వ్యాసం ప్రచురించాడు. అది తదనంతర పరిశోధకులకు మార్గదర్శకమైంది. అందులో వైదిక వాఙ్మయంలోని సీత, వాల్మీకి రామాయణంలోని సీత ఒకరే అని ప్రతిపాదించాడు. తన వాదాన్ని సక్రమంగా వివరించాడు.

''ఋగ్వేదంలోని సీత భూమికి సంబంధించిన దైవతం. వాల్మీకంలోని సీత భూమినుంచే ఉద్భవిస్తుంది. (బాల-సర్గ-66.) తర్వాత భూమిలోనే కలసిపోతుంది. (ఉత్తర-సర్గ-97.) వైదిక సాహిత్యంలోని సీత ఇంద్రుని భార్య. కనుక రామ, రావణుల పోరాటం ఇంద్ర వృత్రాసుర సమరం అని చెప్పాలి. వృత్రుడు అనావృష్టి అసురుడు. రావణుని వృత్రునిగా గుర్తించడానికి రావణ పుత్రుడు ఇంద్రజిత్తును పేర్కొనవచ్చు. పౌరాణిక కల్పనలందు కుమారుడు తండ్రిలోని ఒక అంశకు చిహ్నంగా చిత్రించబడ్డాడు. ఇంద్రుణ్ణి జయించినవాడు. ఇంద్రజిత్తు ఇంద్రుని వైరి; ఇంద్రశత్రు, మేఘనాదుడు. ఇంద్రజిత్తు అసలు పేరు రమారమి తెలియనే తెలియదు. (7.12.)

కొండగుహల్లో నివసించే రావణుని తమ్ముడు కుంభకర్ణుడు వేదాల్లోని వృత్రుని వర్ణనను స్ఫురింప చేస్తాడు. రావణుడు చేసిన కృత్యాలలో అత్యంత ముఖ్యమైనది సీతాపహరణం. ఇదే తదనంతర యుద్ధానికి అనివార్యమైన కారణమైంది. ఈ సత్యం కూడా వైదిక భాష్య దృశ్యానికి ఒక ప్రాతిపదిక కాగలదు. వాస్తవానికి ఇంద్రుడి శత్రువులలో ఏ ఒక్కడు ఇంద్రుడి భార్యను అపహరించలేదు. (ఋగ్వేదంలో వృషాకపి ఇంద్రాణిని అపహరించడం అనేది ఒక ఐతిహాసిక సంఘటనగా భావించాలి. అయినా ఈ అప్రసిద్ధ సూక్తం అశ్లీలం. బహుశా వృషాకపి పౌరాణిక వ్యక్తి ఎంత్రమాత్రం కాకపోవచ్చు. బహుశా దీనివల్ల ఏదో కొంత ఋతుని నిర్దేశించి ఉంటారు.)

"ఇంద్రుడి భార్యనైతే అతని శత్రువులు అపహరించలేదుగాని పణిగణాలు జలప్రవాహాన్ని అరికట్టుతారు. ఆలమందలను అపహరించి కొండ గుహలో బంధించారు. వైదిక కాలంలోని గోపాలురకు పశుగణాలు ఎటువంటివో అనంతర కాలంలోని సేద్యగాళ్ళకు పంట పొలాలు అటువంటివే. క్షామాసురుని తుచ్ఛతనే సీతాపహరణంగా భావించవచ్చును. ఇది మరొక పాత్రను రంగం మీదకు తెస్తుంది. అతడు హనుమంతుడు. ఈ పౌరాణిక పాత్ర స్వభావాన్ని సక్రమంగా అవగాహన చేసుకోవాలంటే ఇతడిని సంరక్షణాత్మకమైన గ్రామ దేవతగా ఊహించుకొన్నారన్న సంగతికి సముచిత ప్రాముఖ్యం ఇవ్వాలి.

సర్ అల్‌ఫ్రెడ్ లియాల్ తన 'ఆసియాటిక్ స్టడీస్' (పుట-13)లో ఇలా చెప్తున్నారు:

"వీరగీతాల పొగమంచు నుంచీ సంకీర్ణమైన అరణ్యక గాథల నుంచీ హనుమాన్ అనే పవిత్ర వానరుడు సమస్తమైన పల్లెపట్టులకు సార్వజనీనమైన సంరక్షక దైవంగా రూపొందాడు. గ్రామం మధ్య అతడి బొమ్మను నిలుపుకొనడమే జనపదానికి విస్పష్టమైన బాహ్యా చిహ్నం. స్థిరమైన జన నివాసానికి అది సంకేతం. అందుకే ప్రతి ఊళ్ళోనూ హనుమంతుడి విగ్రహం ఉంటుంది. యావద్భారత భూమి అంగీకరించే ఈ ప్రత్యేకతను హనుమంతుడిలో మలచడానికి, రామాయణ ఇతిహాసంలో

ఆధారం ఏదీ కనబడదు. అందుచేత ఆదిమ హనుమంతుడి మౌలిక స్వభావంలో ఏదో సాంకేతిక ప్రాత ఇమిడి వుండడంవల్ల అతడిని గ్రామ దేవతగా అందరూ ఆమోదించి వుండాలి. హనుమంతుడికీ, వ్యవసాయానికీ ఏదో సంబంధం వుండి వుండాలి. గ్రామీణ జనులు ముఖ్యంగా సేద్యంపైనే ఆధారపడి వుంటారు.

"నా ఉద్దేశంలో ఆతడు ఋతుపవన వర్షాల అధిదేవత. అందుకే అన్ని గ్రామాలలో సేవలకు నోచుకున్నాడు. వానలు ఆలస్యమైనా, తక్కువగా కురిసినా కరువు కాటకాలు వస్తాయన్నది సర్వవిదితమే. అందువల్ల సకాలంలో, సమృద్ధిగా వర్షాలు పడడం మీదనే పంట ఆధార పడి ఉంటుంది. హనుమంతుడికీ. వర్షాలకి సంబంధం ఉంటే అతనికీ, గాలికీ సంబంధం ఉండాలి. పవనాలే నీటి మేఘాలను తీసుకువస్తాయి. అందుకే హనుమంతుడు పవనపుత్రుడు, మారుతాత్మజుడు, మారుతి, మేఘంలాగే హనుమంతుడు కామరూపి. కపులు కావలసిన రూపం ధరించ గలరు. మేఘంలాగే మారుతి కూడా వందాల కొద్దీ యోజనాలు ఆకాశంలో సముద్రం మీద పయనించి, మూర్తీభవించిన సస్యదేవత అయిన సీత జాడలు కనిపెట్టగలడు. సుదూరమైన దక్షిణ సీమనుంచి సీతను తీసుకు వచ్చారు. వానకార్తెకూడా అక్కడ నుంచే వస్తుంది. రాముడు కపుల సహాయంతో అంటే వర్షించే మేఘాల సహాయంతో విజయం సాధించాడు.

"ఇక్కడ మరొక పౌరాణిక ప్రత్యామ్నాయాన్ని గమనించాలి. ఇది హనుమంతుడికీ, ఇంద్రుడికీ సంబంధాన్ని సూచిస్తుంది. సముద్రాన్ని లంఘించాక హనుమంతుడు చేసిన సీతాన్వేషణ ఋగ్వేదం (10.108)లో సరమ చేసిన కృత్యాలను తలపుకు తెస్తాయి. సరమ కూడా రసాజలా లను దాటుతుంది. దూరంలో నిధిని చూస్తుంది. దానిని పణి కాపాడు తున్నాడు. ఆ నిధిని సంగ్రహించి ఇంద్రుడికి ఇవ్వాలని సరమ వాంఛి స్తుంది. సరమకూ, హనుమకూ, రసాజలాలకూ, లవణ సముద్రానికీ, నిధికీ, సీతకూ, పణికీ, అసురకూ పోలికలు వున్నాయి. అయితే రెండు పౌరాణిక సంఘటనలనూ ఒక్కలాగే ఎంచకూడదు. కాని ఈ రెండూ ఒకే ఒక ప్రాథమికమైన పౌరాణిక 'ఊహమీద' ఆధారపడి రెండు విధాలుగా

రూపం సంతరించుకొన్నాయని నేను విశ్వసిస్తున్నాను. రామాయణంలో సైతం ఈ ఆధారానికి ఛాయలు ఇప్పటికీ నిలచివున్నాయి. లంకలో సరమ అనే రాక్షసి సీతను ఊరడిస్తుంది. రావణుడు చేసినవన్నీ చెబుతుంది. చేయబోయేవి తెలుసుకుంటా నంటుంది. వైదిక సరమ పాత్ర ఇక్కడ తన అవధిని చేరుకొంది.

''మనం రాముడిని ఇంద్రపర్జన్యుడిగా గుర్తించాము. ఋగ్వేదంలో రామ అనే పదానికి ''నల్లని'' అనీ, ''నల్లనిఛాయ'' అనీ అర్థం. కాని, (కావ్యభాషలో మనోహరమని అర్థం) రాముడి కథా,ఇంద్రుడి కథా సమాంతరంగా సాగడం గమనించాము ఆదిలో రాముడికీ, ఇంద్రుడికీ ఏ విధమైన సంబంధం లేకపోవచ్చు. కాలక్రమేణా ఇంద్రగాథలను కొద్ది మార్పులతో రాముడికి ఆపాదించి ఉంటారు.

"రాముడు ఇంద్రుడికి విభిన్నుడని తలపింపచేయడానికి రాముడి పౌరాణిక స్వభావాన్ని చూపెట్టగలగాలి. విశ్వజననీయమైన పౌరాణిక సిద్ధాంతాలకు కట్టుబడితే తప్ప ఇది సాధ్యం కాదు. రాముడికి, ఇంద్రుడికి స్వాభావికమైన సంబంధాన్ని ఊహించుకుంటే రాముడు స్థానిక రూపంలోని ఇంద్రుడవుతాడు. పశుపాలన స్థితిలోని ఆ రూపాన్ని వ్యావసాయిక జనులు తమ సాంస్కృతిక భావాలకు అనుగుణంగా మలచుకొన్నారు. రాముడికీ, సేద్యానికీ సంబంధం ఏర్పడడంవల్ల నాగేటిచాలుకు సంకేతమైన సీతకు అతడు భర్త కాగలిగాడు.''

ఇది క్రిందటి శతాబ్దిలోనే జాకోబీ పండితుడు వివరించిన వాదం. సీతా రామాంజనేయ పాత్రలను ఈ విధంగా సమన్వయించడంలో శాస్త్రీయ దృక్పథం, హేతువాద దృక్పథం వున్నాయి. జాకోబీ వాదాన్ని బలపరచడానికి మరికొన్ని ఉదాహరణలు తరువాత లభించాయి. మాయలేడి మూలంగా రావణుడు సీతను ఎత్తుకు పోగలిగాడు. మారీచుడు మాయలేడి రూపం దాల్చినట్లు ప్రస్తుత రామాయణాలు చెప్తాయి. అయితే ఫిలిప్పయిన్ దేశపు రామాయణంలో రావణుడే హరిణ రూపాన్ని ధరిస్తాడు. దీనికి వాల్మీకి రామాయణంలోనే ఆధారాలు ఉన్నాయి. సుందరకాండలో హనుమంతుడు సీతకు వినబడేటట్టు అప్పటివరకు జరిగిన

రామ కథను చెప్తూ రావణుడే మృగ రూపం ధరించినట్టు ధ్వనించాడు. (సర్గ 31, 11.) ఇది చాలా ముఖ్యమైన విషయం. ఋగ్వేదంలో వృత్రుడు మృగ రూపంలో ఇంద్రుణ్ణి వంచించి ఉదకాలను హరించుతాడు. ఈ సంగతి ప్రథమ మండలంలోనే ఉంది.

ఇంద్రతుచ్ఛ మిద్రదివో నుత్తం వజ్రి స్వీర్యం!
యద్ధత్యం మాయినం మృగం తముత్వం
మాయమా దధీరద్ఛన్ననుస్వరాజ్యం॥ (1-13-7-7)

"మేఘ వాహనుడవూ, వజ్రపాణివీ అయిన ఓ ఇంద్రా! నీ పరాక్రమం (శత్రువులచే) తిరస్కరించబడనిది. ఎందుచేతనంటే, మాయావంతుడూ, ప్రసిద్ధుడూ, మృగరూపుడూ అయిన ఆ వృత్రుని నీవు మాయచేతనే సంహరించావు" అని దీని అర్థం. ఈ ఋక్కువల్ల ఇంద్రుడు రాముడిగా, వృత్రుడు రావణునిగా రూపాంతరం చెందారన్న ఊహ గట్టిపడుతుంది.

జాకోబీ హనుమంతుడి విషయంలో కొన్ని సందేహాలు వెలిబుచ్చాడు. హనుమంతుడు వ్యావసాయిక దైవతం. అందుచేత ఆదిమ వాసుల వేలుపుగా అతణ్ణి ఎంచకతప్పదు. అయితే అనాగరికుల దైవానికి సంస్కృత పదం ఎలాగ అతికింది? హనువు అంటే దవడ ఎముక. ఈ పదం హనుమంతుడికి ఇంద్రుడికిగల సంబంధాన్ని సూచిస్తుంది. ఇంద్రుడిపర్యాయపదాలలో శిప్రి, శిప్రవత్ అనే మాటలున్నాయి. నిరుక్తంలో "శిప్రేహనూనాసికేవా" వివరణ వున్నది. ఈ వ్యుత్పత్తి ప్రకారం ఇంద్రుడు హనుమంతుడే అవుతున్నాడు. ఇద్దరూ వర్షానికి అధిదేవతలే.

హనుమంతుడికీ, కోతులకీ వానరులతో సంబంధం ఉందన్న విషయాన్ని తెలుగువాళ్ళ ఆచారాన్ని చూస్తే తెలుసుకోవచ్చు. రామదండు అంటే వానరసేన అన్న విషయం అందరికీ తెలిసినదే. తెలుగుదేశంలో వానకోసం నడిపే ఆచారాల్లో 'రామదండు' ఒకటి. ఊళ్ళో ఇంటికొకరు వంతున తలంటి పోసుకుని, కర్రలకు రాగి ఆకులు, పసుపు గుడ్డలు కట్టుకుని, రాములవారి పటం పట్టుకుని మూడు వూళ్ళుగాని, అయిదువూళ్ళుగాని తిరుగుతారు ఇది ఒక రకంగా సీతమ్మజాడలు అరసిరావడమే.

గంప జాతర, చెట్టు జాతర, వలస జాతర మొదలైన వానకోసం నడిపే ఆచారాలలో కూడా సీత జాడలు తీయడం అంతర్లీనంగా ఉంది. సీత లక్ష్మీదేవి అవతారం. దేవతగా ఆరాధించే పచ్చ పొలాన్ని గ్రామీణులు 'లచ్చమ్మ' అని పిలుస్తారు. లక్ష్మి ఒక్క రాముడినే కాదు - బలరాముడిని కూడా వరించింది.

# రాముడే బలరాముడు?!

ఏ దేశపు సంస్కృతి అయినా దాని ఆహార విధానాలలో అంకు రిస్తుంది. అందుకే ప్రతి జాతి కట్టుకథలలో మొట్టమొదటివి కూటికి సంబం· ధించినవే అని ఆధునిక అంత్రపోలజిస్టులు నిరూపించగలిగారు. తెలుగులో కూడు అనే మాట నామవాచకమైతే తిండి అని క్రియా పదం అయితే, స్త్రీ పురుషుల కలయిక అనీ అర్థం ఉండడం గమనించవలసిన విషయం. ఆహార సేకరణ విధానాలపైననే ఆ జాతి వావివరసలు ఆధార పడి ఉంటాయి. రామాయణ కథా బీజాలుగానీ, హరివంశ కథా బీజాలు గానీ మొలకెత్తబోయే కాలానికి భారతదేశం వ్యావసాయిక దశలోనికి ప్రవేశింపుతూంది. అందుకే ఆ ఇతిహాసాలలోని ప్రధాన పాత్రలకూ, సేద్యానికి సంబంధం కనబడుతుంది.

మన దశావతారాలలో ముగ్గురు రాములువున్నారు. (రామోరామశ్చ రామః) పరశురాముడు, కోదండరాముడు, హలాయుధ బలరాముడు, వీళ్ళకు గొడ్డలి, విల్లు, నాగలి ఆయుధాలు - ఇవి ఆహార సంపాదనకు తోడ్పడే పనిముట్లు. ఇతిహాసాలనుబట్టి ఈ ముగ్గురు రాములూ సమ కాలికులే. శివధనుర్భంగం తర్వాత పరశురాముడు కోదండ రాముడితో తలబడతాడు. జరాసంధుడు దండెత్తినప్పుడు బలరాముడు కృష్ణునితో కలసి పరశురాముడిని సందర్శించి గోమంతకం చేరుకొంటాడు. పరశు రాముడు తండ్రి ఆజ్ఞకోసం తల్లి తల నఱికినవాడు. అంటే మాతృస్వామ్య వ్యవస్థ నాశనానికి తోడ్పడ్డవాడన్నమాట. పితృవాక్య పరిపాలనకోసం అడవులు పట్టినవాడు కోదండరాముడు. ఈ రాముడు వేటాడి ఆహారాన్ని సంపాదించుకొనే దశకు చెందినా సీత వల్ల వ్యవసాయానికి సంబంధం గలవాడయ్యాడు. ఇక బలరాముడి వ్యవసాయమూ, పితృస్వామ్యం కాళ్ళు నిలదొక్కుకున్నాయి. పరశురాముడు తల్లి తల నరికితే కృష్ణుడు మేనమామను చంపాడు. ఈ రెండు కార్యాలూ మాతృస్వామ్య వ్యవస్థ

విచ్ఛేదానికి ఆద్యంత దశలను సూచిస్తాయి. కంఫ వధలో బలరాముడు పాల్గొన్నాడు. హలాయుధుడైన బలరాముడు తదనంతర దశకు చిహ్న మయ్యాడు.

కోదండరాముడు, హలరాముడూ సేద్యానికి సంకేతాలు కనుక ఇద్దరి కథలతోనూ పోలికలు కనబడతాయి. శ్రీరాముడు ఖరుని సంహరించాడు బలరాముడు ధేనుకాసురుణ్ణి సంహరించాడు. ఈ ధేనుకుడు కావాలని గాడిద రూపం ధరించడం ఇద్దరు రాముల సంబంధం చూపించడానికే. రామాయణంలో గాడిద చాలా ముఖ్యమైన చిహ్నం రావణుని తలలో ఒకటి గాడిద తల. ఉత్తర భారతదేశంలోని శిల్పాలలో రావణుని గాడిదతల ప్రస్ఫుటంగా కనబడుతుంది సీతను రావణుడు కంచర గాడిదలు కట్టిన రథంమీద ఎక్కించుకొనే లంకకు• తీసుకుపోయాడు. బలరాముడు ద్వివిదుడు, మైందుడు అనే వాళ్ళను సంహరించాడు. వీళ్ళు రామాయణంలో రామదండులో వున్నారు. ఇంద్రుని గుణాలలో కొన్ని శ్రీరాముడిలోనూ, కొన్ని బలరాముడిలోనూ చేరినట్లున్నాయి. ఇంద్రుడు మధుపాన ప్రియుడు, బలరాముడు డిటో.

ఈ సాదృశ్యాలన్నీ ఒక ఎత్తు, హరివంశంలోని ఒక ఘట్టం మరొక ఎత్తు. అది శ్రీరాముడికీ, బలరాముడికీ గల అభిన్నత్వాన్ని సూచిస్తుంది. పరశురామ శ్రీకృష్ణులతో కలసి బలరాముడు గోమంత పర్వతం చేరుకున్నాడు. ఒకనాడు అతడొక్కడూ ఒక చోటకు వెళ్ళి కాదంబరి అనే అతి మనోహర రసధారను ఆస్వాదించి, వివశహృదయుడై వున్న సమయంలో ముగ్గురు కాంతలువచ్చి అతణ్ణి వరించారు. వాళ్ళు ఒక్కొక్కరు పరుసగా వచ్చి వాళ్ళ సంగతి చెప్పుకుని అతణ్ణి పరిణయమాడారు.

మొదట వచ్చిన కాంత మదిరాదేవి. ఈమె వరుణాత్మజ. వారుణి అనే పేరు గలది. తండ్రి పంపగా వచ్చింది. తొంటి సంగతి తలచి బలరాముడితో ఆడుకొనే వేడుకలో ఉర్వీతలమంతా వెదకి వెదకి దప్పికతో ఉన్న అతనిజాడ తెలుసుకొని వచ్చింది. నన్నుగైకొని నేడాదిగ అనురాగములో సుఖింపుము అని చెప్పింది.

ఆ తరువాత వచ్చిన కాంత పేరు కాంతి ఆమె చంద్రుని దగ్గర చాలా విఖ్యాతమై ఉండేది. ఆ శీతమయూఖుని కన్నా బలరాముడే నిక్కంగా ఘనుడని భావించి ప్రేమించి వచ్చింది.

ఆ తర్వాత వచ్చిన కాంత లక్ష్మి. ఆమె "దేవా! నేను రత్నాకర తనూభవనైన లక్ష్మిని. నేనిప్పుడు సాక్షాత్పుండరీకాక్షమూర్తియైన నీ పరిగ్రహంబు నపేక్షించి వచ్చితిని, కారుణ్యమున నన్ను అనుగ్రహింపుము. ఇది రత్నమయ మకుటము, ఇవి మణి కుండలాలు, ఇవి కొత్త పట్టుబట్టలు, ఇవి ముత్యాలహారాలు, కడలి నుంచి పుట్టిన ఈ సొమ్ములన్నీ పూర్వం నీవే. వీటిని ఓలిగా ఇచ్చి నా విన్నపాన్ని మన్నించు" అని చెప్పింది. బలరాముడు ఆ నగలు తీసుకున్నాడు ఆ ముగ్గురు కాంతలను చేపట్టాడు. (చూ॥ ఎర్రాప్రగడగారి హరివంశం ఉత్తర భాగం 1.56 నుంచి 72 దాకా).

బలరాముడిచేత ఈ ముగ్గురు కాంతలను చేపట్టించడంలో పౌరాణికులు మూలభావ విధేయతను చాలచక్కగా పాటించారు. మదిర ఇంద్రునికి ప్రియమైనది. కాంతి చంద్రునికి ఇష్టమైనది. ఇంద్రుడే రాముడై చంద్రుడే రామచంద్రుడయ్యాడు. ఈ సంగతి వెనుకటి వ్యాసంలో గమనించాం. రాముని భార్య లక్ష్మీదేవి అవతారం. ఆమె బలరాముని వర్గించడంవల్ల కోదండ రాముడే హలరాముడయ్యాడు. వైదికగాథ రామాయణంగా, రామాయణ సంకేతం హరివంశ ఘట్టంగా రూపొంది అవిచ్ఛిన్నమైన ఒక సాంస్కృతిక రహస్యాన్ని కాపాడుతూ వస్తున్నాయి.

త్రేతాయుగంలోని లక్ష్మణుడే ద్వాపరయుగంలో బలరాముడుగా అవతరించాడని, ఇద్దరూ ఆదిశేషుని అంశకాలనీ చాలా పురాణాలు చెప్తాయి. సీత, లక్ష్మీదేవి అవతారమైతే ఒక జన్మలోని వదినగారిని ఇంకో జన్మలో వివాహమాడి వావితప్పిన నేరం లక్ష్మణునికి సంక్రమిస్తుంది. అయితే జైన సంప్రదాయాన్ని పాటిస్తే ఈ దోషం అంటుకోదు. జైనుల ప్రకారం రాముడే బలరాముడిగా అవతరించాడు. లక్ష్మణుడే కృష్ణునిగా పుట్టాడు. జైనుల సంప్రదాయం ప్రకారం కాలచక్రంలో తొమ్మిది మంది వాసుదేవులూ, తొమ్మిది మంది ప్రతివాసుదేవులూ, తొమ్మిది మంది బలదేవులూ ఉంటారు. వాసుదేవుడు ప్రతి వాసుదేవుడిని సంహరించడానికే జన్మిస్తాడు. ఆ వాసుదేవునికి ప్రతీ జన్మలోనూ ఒక బలదేవుడు చేదోడు

వాదోడుగా ఉంటాడు. ఏయే జన్మలలో ఏయే బలదేవుడితో కలసి వాసుదేవుడు ప్రతి వాసుదేవుడిని సంహరించినదీ ఈ పట్టికలో చూడండి

| జన్మ | బలదేవుడు | వాసుదేవుడు | ప్రతివాసుదేవుడు |
|---|---|---|---|
| 1. | అచలుడు | త్రిపృష్ఠ కేశవుడు | అశ్వగ్రీవుడు |
| 2. | విజయుడు | ద్విపృష్ఠ కేశవుడు | తారకుడు |
| 3. | సుధర్ముడు | స్వయంభువు | మీరకుడు |
| 4. | సుప్రభుడు | పురుషోత్తముడు | మధుకైటభుడు |
| 5. | సుదర్శనుడు | పురుషసింహుడు | నిశుంభుడు |
| 6. | ఆనందుడు | పురుష పుండరీకుడు | బలిసేనుడు |
| 7. | నందనుడు | దత్తదేవుడు | ప్రహ్లాదుడు |
| 8. | రాముడు | లక్ష్మణుడు | లంకేశ రావణుడు |
| 9. | బలరాముడు | కృష్ణుడు | మగధదేశ జరాసంధుడు |

ఈ పట్టిక ప్రకారం పరమ భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడు సైతం విష్ణుద్వేషులలో ఒకడిగా కనబడతాడు. జైనులు మన పురాణాలన్నింటినీ అకటావికటం చేసి పారేశారనిపించవచ్చును గాని పాపం జైనులేం అలా చేయలేదు. అనుశ్రుతంగా వచ్చే కథలను భద్రం చేశారు. నిజానికి ప్రహ్లాదుడు సుర ద్వేషే. ప్రహ్లాదుడు సకల సైన్య సమేతుడై దేవతల మీదికి దాడికి వెళ్ళి ఇంద్రుడిని ఎలాగ స్వారాజ్యహీనుడిని చేసినదీ హరివంశంలో వ్యాసుడే కథనం చేశాడు. (చూ॥ ఉత్తర భాగం పదో ఆశ్వాసం) ఈ ప్రహ్లాదుడు సాక్షాత్తూ హిరణ్యకశిపుని కుమారుడే.

ప్రహ్లాదుడి వైనం ఒక రకంగా జైన సంప్రదాయంలోని సత్యాలను హరివంశాదులు ఎలాగ బలపరుస్తున్నాయో నిరూపిస్తుంది. బలరాముడు లక్ష్మిని చేపట్టడం అనే ఘట్టం జైన మర్యాదను పాటిస్తుంది. దేశంలో బలరాముడికి ప్రత్యేకంగా దేవాలయాలు ఉన్నాయో లేవో పరిశోధించాలి గాని, పూరీలో జగన్నాథుడిని సుభద్రా బలభద్రా సహితంగా ఆరాధిస్తారు. అన్నదమ్ములను చెల్లెలితో కలిసి పూజించడం అనే ఆచారం విలక్షణమైనది. బౌద్ధ జాతక కథల కాలాన్ని సూచిస్తుంది.

నిజానికి జగన్నాథ క్షేత్రం ఒకప్పుడు బౌద్ధ మతానికి పట్టుకొమ్మ. బ్రాహ్మణాధిక్యాన్ని, వర్ణాశ్రమ ధర్మాలను పాటించని క్షేత్రం కనుక ప్రసాదం విషయంలో కుల భేదాలను నేటికీ పాటించరు. జగన్నాథుడిని బౌద్ధావతారంగా కొందరు ప్రశంసించారు. చెల్లెలితో ఈ దేవుడిని ఎందుకు ఆరాధిస్తారో ఇంకా పరిశోధించాలి. ఏమైనా లలితా సహస్ర నామాల్లో దేవిని -

"భానుమండల మధ్యస్థా
భైరవీ భగమాలినీ
పద్మాసనా భగవతీ
పద్మనాభ సహోదరీ"

అని కీర్తిస్తారు. ఆమెనే, "నారాయణీ నాదరూపా నామరూప వివర్జితా" అంటారు. శాక్తేయులు సీతను శక్తిస్వరూపిణీ అంటారు. సుందరకాండ అంతా శ్రీ విద్యోపాసం అంటారు. వాస్తవంగా సీత ఎవరో తెలిస్తే సీత రాముడికి ఏమౌతుందో తెలుస్తుంది.

# సీత ద్రౌపదిగా పుట్టిందా?!

సీత లక్ష్మీదేవి అవతారం అంటారు. సరే, లక్ష్మి ఎవరి స్వరూపం? దేవీ భాగవతం ప్రకారం ఈమె పంచవిధ రూపిణి అయిన ప్రకృతి. ప్రకృష్ట వాచకం. ప్రః సృష్టి వాచకం కృతి అయితే సృష్టి చేయడంతో శ్రేష్ఠురాలయిన దేవీ ప్రకృతి అవుతుంది. "ప్ర" ప్రథమ శబ్దమూ కృతి సృష్టి శబ్దమూ అయితే సృష్టికి కారణమైన దేవికి ప్రకృతి అనే అర్థం వస్తుంది. ఈ ప్రకృతి అయిదు విధాల అవతరిస్తుంది. దుర్గాదేవి, లక్ష్మీదేవి, రాధాదేవి, సరస్వతీదేవి అనే అయిదూ ఆ అయిదు అవతారాల పేర్లు.

ప్రకృతి ద్వితీయ స్వరూపమైన లక్ష్మీదేవే కృత యుగంలో వేదవతిగా, త్రేతాయుగంలో సీతగా, ద్వాపర యుగంలో ద్రౌపదిగా జన్మించిందని దేవీ భాగవతం నవమస్కంధం చెప్తుంది. అరణ్యవాస సమయంలో అగ్నిహోత్రుడు రాముడి దగ్గరకు వచ్చాడు. సీతను ఇంక రాక్షసు డెత్తుకుపోతాడు కనుక అసలు సీతను తనలో ఉంచుకొని ఛాయా సీతను రాముడికి ఇచ్చాడు. ఆ ఛాయా సీతనే రావణుడు అపహరించి ఆశోకవనంలో ఉంచాడు. రావణ వధ తర్వాత అగ్నిపరీక్ష చేశాక అగ్నిహోత్రుడు అసలు సీతను రాముడికి అప్పగించాడు. ఛాయా సీత "నా గతేం కాను?" అని ప్రశ్నించింది. దేవీ పుష్కరంలో తపస్సు చేసి స్వర్గలక్ష్మివై పిదప ద్రౌపదిగా జన్మించమని రాముడు ఆదేశించాడు. ఆమె అలాగే జన్మించిందని దేవీ భాగవతం చెప్తుంది. త్రేతాయుగంలో రామ రావణ యుద్ధానికి కారణభూతురాలే ద్వాపరయుగంలో మహాభారత యుద్ధానికీ మూలకారణ మైందనుకోవాలి.

ఒక్క నవమ స్కంధంలోనే కాక ద్వాదశ స్కంధంలో కూడా దేవీ భాగవతం సీతా ద్రౌపదులు దేవీ అంశమే అని చాటుతుంది.

గాయత్రీ సహస్ర నామాలతో "జాతరూపమయా జిహ్వా జానకీ జగతీజరా" అని ''దేవరీతః దివారాత్రిః ద్రౌపదీ దుందుభిస్వనా" అని జానకీ ద్రౌపదుల పేర్లున్నాయి. సీత వ్యావసాయిక దైవతం అయితే ద్రౌపది గణదేవత కావచ్చును. సీతకు రాముడితో తప్పించి విడిగా పూజలు లేకపోయినా ద్రౌపదికి ఇప్పటికీ దేవళాలు ఉన్నాయి. ఏటేటా ఉత్సవాలు జరుగుతున్నాయి. ఆచార్య తూమాటి దొణప్పగారు ఇలా రాస్తున్నారు:

"చిత్తూరు, ఉత్తరార్కాడు మండలములలో ద్రౌపదమ్మ పేర కొన్ని దేవళములుండుట వాస్తవము. ఇవియును అంత ప్రాచీనములు కావు. ఆమె శక్త్యంశ సంభూత యను లోకప్రతీతి హేతువుగా నిర్మితములై యుండవచ్చు. అయినను ఇక్కడి నొక కిటుకు కలదు. రాయలసీమలో వెనుకబడిన తెగలలో మారుమనువు మామూలు. వరుసగా నలుగురు భర్తలకు ''విడాకు'' లిచ్చి అయిదవ భర్తను పెండ్లాడిన స్త్రీ చినగౌడసాని, ఇట్లే ఏడవ భర్తను కట్టుకొనిన స్త్రీ పెదగౌడసాని. గౌడసానిమాట ఆ తెగవారికి వేద వాక్యము. కులము తగవులకై తీరిన ధర్మాసనమున, గౌడసాని తీర్పు తిరుగులేనిది. ఇట్టి సంప్రదాయము కలవారు ద్రౌపదిని కులదైవముగా కొలువుచేసి యుండవచ్చు. కోవెలలు కట్టి యుండవచ్చు" (జానపద కళా సంపద పుట 63).

తమ ఆచారాలు తగిలించడానికి అనువైన చిలక్కొయ్యగా గౌడసానులు ద్రౌపదిని వెదుక్కున్నారని మనం భావించనక్కర్లేదు. పాండవుల కాలం నుంచీ ఈ ఆచారాలు ఆ 'వెనుకబడిన" తెగలలో అవిచ్ఛిన్నంగా రావడం బట్టి ద్రౌపది వాళ్ళ కులదేవత. అందుకే గుడికట్టి ఆమెను కొలుచుకుంటున్నారని భావించాలి. ఎరుకల వారిలో కూడా ఏడుసార్ల వరకూ పునర్వివాహం చేసుకొనడానికి స్త్రీకి స్వేచ్ఛ ఉంది. ఎరుకలవారు తమ జాతి చాలా పురాతనమైనదంటారు. తమ జాతి వాడైన ఏకలవ్యుడు గురుదక్షిణ ఇవ్వబట్టి వీళ్ళు విల్లంబులు విసర్జించామంటారు. ఉండేలు బద్దనే ఉపయోగిస్తారు.

గోండులు భీముని తమ మూలపురుషునిగా చెప్పుకొంటారు. తాము అతనికి హిండింబ వల్ల పుట్టిన వాళ్ళమని చెప్పుకొంటారు. ఆదిమవాసులలో చాలమందికి పాండవులే మూలపురుషులు. అయితే రామాయణ కాలం నుంచీ ఈ జాతులు మన దేశంలో వుండడంవలన కొన్ని వర్గాలకు ఇటు పాండవులతోను, అటు రామాయణ వ్యక్తులతోను సంబంధం కనబడుతుంది.

మన ఆంధ్రదేశంలోనే. శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో నివసించే కొండదొర (కొండపొరజకుబింగు కొండంగి) లకు చాలా పురాతనమైన చరిత్ర వుంది. వీళ్ళలో కొందరు పాండవుల సంతతి వాళ్ళమని చెప్పుకొంటారు. మరికొందరు తాము సీతా దేవి తండ్రి అయిన జనక మహారాజు సంతతివారమని చెప్పుకొనడమే కాక జనకుడు తమకొక ''పులవ'' పారనిచ్చి పోండు వ్యవసాయం చేసు కొని బతక మన్నట్టు కూడా చెప్పుకొంటారు. కోండులలో హోల్కవర్గం వారి ఇలవేలుపు ''సీతపెను'' - పెను అంటే దేవత అని అర్థం.

అఖిల భారత స్థాయిలో కాక ఒక్క ఆంధ్రదేశంలో హరిజన గిరి జనుల ఆచార వ్యవహారాలను పరికిస్తే మన ఆదిమ సంస్కృతి ఎంత అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తున్నదో తెలుస్తుంది. ఇప్పటికీ వీళ్ళు సీతతో, ద్రౌపదితో తమ జాతికి సంబంధాలు ఉన్నాయని చెప్పడం వాళ్ళ పురాత నత్వాన్నే కాక ఇతిహాసాల చారిత్రక బీజాల సత్యసంధతను తెలియ జేస్తాయి. మధ్యయుగాలలో రాచరికాన్ని సంపాదించుకొన్న వాళ్ళు కల్పిత వంశవృక్షాలు సృష్టించుకొని సూర్యవంశానికో చంద్ర వంశా నికో ముడిపెట్టుకొన్నట్టు ఈ ఆదిమ జాతులకు తమ పూర్వీకులను సృష్టించుకొనే కర్మ లేదు. తప్పుడు దేవతలను కొలిస్తే ముప్పని వీళ్ళ నమ్మకం.

సీతా ద్రౌపదులు ప్రాచీనగణ దైవతాలు. ఆ రోజులలో వీళ్ళను, ఏ పేరుతో పిలిచేవారో తెలియదు (ఆంధ్రదేశంలోనూ, కర్ణాటకంలోను) ఎందరో ఎల్లమ్మ అనే పేరిట ఆరాధించుతున్న దేవతే ''రేణుక'' అనే

నామంతో పండితుల పురాణాలకు ఎక్కింది. సీతా ద్రౌపదులను ఏ రూపంలో కొలిచేవారో పరిశోధిస్తేగాని తెలియదు. విశాఖపట్నం మన్యంలో ఉండే కోటియా జాతివాళ్ళు వ్యవసాయం పనిముట్లను శుద్ధి పరచి వాటికి కోడిని బలిచేసి దాని రక్తం వాటిమీద జల్లుతారు. విత్తులు జల్లడానికి ముందు పోడుపూజ చేస్తారు. బొడ దేవతకు నల్ల మేకను, దున్నపోతును బలి ఇస్తారు. ఉభయ గోదావరి జిల్లాలలోనే కాక ఖమ్మం, వరంగల్లు జిల్లాలలో ఉంటున్న కోయలు కిందటి శతాబ్దం దాకా పంటలను రక్షిస్తుందనే నమ్మకంతో మామిలి దేవతకు నరబలి ఇచ్చేవారు. ఇప్పుడు జంతు బలులు ఇస్తున్నారు. (పంట దేవతకు నర బలి ఇవ్వడం రావణ సంహారం కాబోలు) ఈ ఆదిమ వాసుల ఆచారా లన్నింటినీ శాస్త్రీయ పద్ధతులలో పరిశీలించి విశ్లేషణం చేస్తే ఎన్నో సంగతులు తేలుతాయి.

ఏది ఏమైనా గణ దేవతలయిన సీతా ద్రౌపదులను శాక్తేయులు శక్తి అంశలను చేశారు. ఆమాటకొస్తే అహల్యా, అనసూయా, కుంతీ, రాధా, మండోదరీ, రేణుకా, రేవతీ, రుక్మిణీ మొదలైనవాళ్ళంతా ప్రకృతి కళామాత్రంగా జన్మించారని దేవీభాగవతం చెప్తుంది. (చూ॥ నవమ స్కంధం.) అంతేకాదు, గ్రామదేవతలు కూడా ప్రకృతి కళాసంజాతలే. ఇలా స్త్రీ లోకమంతా ప్రకృతి అంశవలనే ప్రభవించింది. స్త్రీలను అవమానిస్తే ప్రకృతిని అవమానించినట్లే అని దేవీభాగవతం చెప్తుంది.

దేవీ నవరాత్రులలో రాముడు ఆమెను పూజించడంవల్లనే రావణ సంహారం చేయగలిగాడని అదే పురాణం కథనం చేస్తుంది. (తృతీయ స్కంధం.) రాముడు చంపలేని శతకంఠరావణుని సీతే స్వయంగా సంహరించిందని శతకంఠ రామాయణం చెబుతుంది.

సీతను రామునికన్నా మిన్నను ఎందుకు చేశారు?

# ఏరువాక పున్నమి సీతా యజ్ఞమా?

ప్రకృతి ఎప్పుడూ పురుషునికన్నా గొప్పదే. అందుకే శాక్తేయులు సీతను రాముడికన్నా మిన్నను చేశారు.

ఏ జాతయినా ఆటవిక దశనుంచి పశుపాలన దశలోనికి వచ్చి, అక్కడ నుంచి వ్యావసాయిక దశలోనికి ప్రవేశించినప్పుడు మాతృస్వామ్యం బలపడుతుంది. జాతికి స్త్రీ దేవతలే ఆరాధ్య దైవాలు అవుతారు. విత్తనంలోంచి మొక్క రావడం, అది ఎదగడం మొదలైన పరిణామ దశలను శ్రద్ధగా గమనించిన మానవుడికి సర్వజీవులను నడిపించే శక్తి స్త్రీ స్వరూపిణే అని స్ఫురిస్తుంది. భూమి వాతావరణాన్ని బట్టి పండుతుంది. వాతావరణం చంద్రుణ్ణిబట్టి మారుతుంటుంది. స్త్రీల పైన కూడా నెల ప్రభావం వుంది. భూమి, స్త్రీ, చంద్రుడు ఈ ముగ్గురు పరస్పర ప్రభావితులు. [సీత భూమీ జనక మాత్రమే కాదు (రామ) చంద్రుని దయిత.]

వ్యవసాయం స్త్రీలు కనిపెట్టిన విద్య అయితే అది పురుషుల చేతిలోకి తర్వాత వెళ్ళింది. యుగాలు, శకాలు మారినా కొందరు ఆడవాళ్ళు తమ తొలినాటి వ్యవసాయిక విధులను మరచిపోకుండా ఏటేటా నోములు నోచుకుంటారు. పొలాల అమావాస్య రోజున స్త్రీలు ఇంట్లో నోచుకున్నా అది పొలాల పండగే. శ్రావణ బహుళ అమావాస్యనాడు పలకలతో ఉన్న కంద దుంపకు పసుపు రాసి బొట్టుపెట్టి ఇల్లాళ్ళు కొలుచుకుంటారు. తోరానికి పసుపు కొమ్ములు కట్టి ముత్తయిదువులు మెళ్ళో వేసుకుంటారు. ఇది సంతాన క్షేమం కోరి చేసే వ్రతం కింద పరిణమించినా ఆదిలో సేద్యానికి సంబంధించినదే.

బెంగాలులో గణేశ చతుర్థి వ్రతంలో చాలా ప్రత్యేకమైన అంశాలు కనబడతాయి. భాద్రపద శుద్ధ చవితినాడు గణేశపూజ చేసినా పంచమి

నాడు గణేశుని స్థానంలో స్త్రీ దైవాన్ని కొలుస్తారు. ఆమె పేరు గౌరి. ఈ గౌరీ దేవి పురాణాలలోని గౌరి కాదు. ఆమెను పలురకాల మొక్కల కట్ట రూపంలోను, మానవ ప్రతినిధియైన కన్య రూపంలోను చూస్తారు.

ఇంట్లోని ముత్తయిదువులు ఆ మొక్కలను సేకరించి పసుపు ముగ్గులు పెట్టి ఆ ముగ్గుమీద నిలుపుతారు. ఈ మొక్కల కట్టను పూజించాక పుణ్య స్త్రీలకు కుంకం పంచి పెడతారు. తరువాత కన్నె పిల్లతో పాటు ఆ మొక్కల కట్టను గది గదికీ తిప్పుతారు. ''గౌరీ! గౌరీ! ఏం చూశావ్?'' అని అడుగుతారు. ఆ కన్నెపిల్ల "కంటి! కంటి! సంపద కంటి, సమృద్ధి కంటి'' అని జవాబు చెప్తుంది. గౌరీదేవి నిజంగా ఇంటికి వచ్చిందన్న గుర్తు కోసం నేలమీద ఆమె పాదాల ముద్రలను లిఖించుతారు.

ఆచార్య దేవీప్రసాద్ ఛట్టోపాధ్యాయగారు వంగదేశంలోని ఆడ వాళ్ళు నోచుకొనే ఈ నోము గురించి 'లోకాయత' అనే మహాగ్రంథంలో ఉటంకించారు. (పుట 233.) మన తెలుగుదేశంలో కూడా ముత్తయిదువులు, బాలికలు కలసి బొమ్మల నోము నోచుకుంటారు. అందులో కూడా నీళ్ళు తలపై చల్లుకుంటూ"కంటి, కంటి ఏం గంటి, కలదాన కిలుగంటి మీ దానమెట్లు గంటి సావిత్రి గౌరీ గంటి - చల్లమెట్ల గౌరుగంటి కోరని కొడుకులగంటి కరగని ఐదవతనం గంటి నాయక శ్రీ గౌరి పాదాల గంట" అని పఠిస్తారు. అయితే సావిత్రి గౌరీ వ్రతానికీ సస్యానికి ప్రత్యక్ష సంబంధం కనబడదు. ఇది అష్ట ఐశ్వర్యాల కోసం నోచే నోము.

మన ఆడవాళ్ళు చేసే గౌరీ వ్రతాలలో ఉల్లి గౌరి, కంద గౌరి, గుమ్మడి గౌరి, చిక్కుళ్ళ గౌరి, బచ్చల గౌరి, రేగుల గౌరి, వెలగ గౌరి మొదలైన పేర్లున్నాయి. ఇవన్నీ గౌరీ దేవిని సస్యాధి దేవతగా మన స్త్రీలు భావించి కొలుచుకుంటారని చెప్పక చెప్తాయి. తొలిరోజుల్లో స్త్రీలే ఇంటిచుట్టూ పంటపనులు చేసుకొనేవారని కూడా తెలియజేస్తాయి. అయితే పెద్ద పెట్టున వ్యవసాయం చేయవలసి వచ్చినపుడు సేద్యం పురుషుల చేతికి వెళ్ళక తప్పలేదు. పురుషులు చేపట్టినా వ్యవసాయం మొదలు పెట్టేటప్పుడు ఆడ దేవతనే కొలవక తప్పదు.

మన రైతులు జ్యేష్ఠ శుద్ధ పూర్ణిమను ఏరువాక పున్నమి అంటారు. ఆ రోజు పొద్దున్నే ఎడ్లను స్నానం చేయించి, వాటి కొమ్ములకు రంగులు పూస్తారు. గజ్జెలు, గంటలు మొదలైన నగలతో అలంకరిస్తారు. వాటిని పూజిస్తారు. పొంగళ్ళు పెడతారు. సాయంకాలం నాగళ్ళను గొర్రుల్నీ ఎర్రమంటి పెట్టెలతో, రంగులతో అలంకరిస్తారు. మేళతాళాలతో వాటిని భుజంమీద పెట్టుకొని ఎడ్లతోపాటు ఊరేగుతూ పొలానికి వెడతారు. అక్కడ నాగళ్ళను పూజించి దుక్కి దున్నడం ప్రారంభిస్తారు. ఇది ఏరువాక సాగడం.

విద్వత్పరిశోధకులు తిరుమల రామచంద్రగారు "హిందువుల పండుగలు-పర్వములు" అనే గ్రంథంలో ఇలా వ్రాశారు: "విష్ణు పురాణమున ఏరువాక సీతాయజ్ఞ మనబడినది. శక్రపూజ చేయవలెనని గోప వృద్ధుడొకడు చేసిన సూచనను ప్రత్యాఖ్యానము చేయుచు కృష్ణుడిట్లనెను:

'మంత్ర యజ్ఞపరా విప్రా
సీతా యజ్ఞాశ్చకర్షకాః
గిరియజ్ఞా స్తథాగోపాః
ఇజ్యోస్మాభిర్గిరి ర్వనే (2-16-9)

బ్రాహ్మణులకు మంత్ర జపమే యజ్ఞము. కర్షకులు ఏరువాక యజ్ఞము చేయుదురు. గోపాలురు గిరి యజ్ఞపరులు కనుక మనము గిరినే పూజింతము, గిరియజ్ఞ మొనర్తుము.'

ఈ సీతాయజ్ఞ మెప్పుడు జరుపుచుండిరో స్పష్టముగా లేకపోయి నను వర్షర్తు ప్రారంభంలో జరుపుచుండుట సహజము."' (పుట 73)

రామచంద్రగారు బహుగ్రంథ పరిశీలకులు. వారికి "సీతాయజ్ఞ" మనే ఈ పాఠం ఎక్కడ దొరికిందోగాని చాల సముచితమైనదే. అయితే నా దగ్గరవున్న విష్ణుపురాణం (కాంచీ ప్రతివాద భయంకర అణంగరాచార్యులవారి ప్రచురణ 1953) లో "సీరయజ్ఞాశ్చకర్షకాః" అనే పాఠం వుంది (5-10-37). వెన్నెలకంటి సూరన్న విష్ణుపురాణాన్ని ఆంధ్రీకరిస్తూ ఆ శ్లోకాన్ని ఇలా అనువాదం చేశాడు:

"భూసురులకు మంత్ర పూజలు హలపూజ
కర్షకులకు గోనికాయ శైల

పూజ మనకు నధిక పుణ్యఫలంబుల
నొసగు విపినచరుల కొండువలదు" (విష్ణు-72-36)

ఈ తెనిగింపువల్ల సూరన్న మూలంలో "సీర యజ్ఞం" అనే ఉండి ఉండాలి. హరివంశంలో కూడా ఇలాంటి శ్లోకమే ఉంది. దానిని ఎర్రన్నగారు ఇలా అనువదించారు:

"మంత్ర యజ్ఞులు విప్రులు మహిత సీర
యజ్ఞు లరయ గృషీవలు లద్రి యజ్ఞు
లనఘ గోపాలు రటుగాన నచల పూజ
యుత్సవంబుగా జేయుట యొప్పు మనకు"

(హరి. పూర్వ-7-135)

ఈ పద్యంవల్ల ఎర్రాప్రగడగారి ప్రతిలో కూడ సీర యజ్ఞం అనే పాఠమే ఉండి వుండాలి.

తిరుమల రామచంద్రగారిచ్చిన "సీతా యజ్ఞం" అనే మాట సాధు పాఠమే. అయితే పురుషులు ఆడవాళ్ళ చేతుల్లోంచి సేద్యాన్ని తీసుకొన డమేకాక, సీతా యజ్ఞాన్ని సీరయజ్ఞంగా మార్చేసి దాని ఆదిమ స్వరూపం, స్వభావం మరుగు పర్చారని చెప్పవలసి వస్తుంది. మన గ్రామీణులు జరిపే ఏరువాక సీర యజ్ఞం అనే మాటకు చక్కటి తెనిగింపే గాని సీతకూ, తెలుగు రైతులకూ సంబంధం లేకపోలేదు.

ఏరువాకతో ప్రారంభమైన కృషి కళ్ళంలో రాసులు పోసుకోవ డంతో ముగుస్తుంది. అప్పుడు పొలి పదాలు పాడతారు. "వలియ వలియ వలియో రావేలు గలవాడ రార పొలిగాడ!" అని మగదైవాన్ని పిలిచినా రైతులు సీతను కూడా ఆహ్వానిస్తారు (నేదునూరి గంగాధరం గారు సెలయేరు అనే గ్రంథంలో వ్యవసాయ వాఙ్మయం అనే విభాగంలో పొలి పదాలు ఇచ్చారు.) పొలి పదంలోని ఈ భాగాన్ని చూడండి.

పొలిగల సీతవైతే మా పోతు మీదకు రమ్మ
మా చేను ప్రక్కను రావి యొకటుండె
రావెక్కి మా సీత రాగాలు తీసె
మా చేను మాచదల మర్రియొకటుండె
మర్రెక్కి మా సీత మరి రాగదీసె
మా చేను వెనకాల జువ్వొకటియుండె

జువ్వెక్కి మా సీత జాదమాడింది
పొలియన్న శబ్దము మా పొలములో గలదు" (పుట - 404)

"పొలిగల సీతవైతే మా పోతులమీదికి రమ్మి - శక్తిగల సీతవైతే మా బరిమీదకి రమ్మి" అనే పాఠాంతరం కూడా దీనికి వుంది. నూర్పిళ్ళ సమయంలో రాముణ్ణి పిలవకుండా ఒక్క సీతనే రైతులు పిలవడంలో అంతరార్థం ఏమిటో లోతుగా పరిశోధించాలి. కొన్ని పొలిపదాలలో "శ్రీరాము కొర్రట్ట సీత యెదబట్ట, సీత బట్టిన యెనలు చిట్టి ముత్యాలు పండు" అనే పాటలు వున్నా అందులోనూ మళ్ళా సీతనే ప్రత్యేకంగా అర్చించడం కనబడుతుంది.

పొలిగల సీతవైతే మా పోతు మీదకు రమ్మి,
మతిగల సీతవైతే మా మండి మీదకు రమ్మి
వెయివేలు మాకిస్తే సీతకి వెండి కడియాలు
పదివేలు మాకిస్తే సీతకి పైడి కడియాలు
పాటిమీదా చేను పలరాశికిస్తు
గమిడిముంగిట చేను మీ గద్దెకిస్తూ

అని మొక్కులు కూడా కనబడతాయి. గ్రామాలలోని వృద్ధుల నడిగితే ఇందులోని మర్మాన్ని చెప్పగలుగుతారు. ఇలాంటి విషయాలు పుస్తకాల్లో దొరకవు.

నిజానికి ఏరువాక పున్నమి జాతి జీవనానికి ఎంతో ముఖ్యమైన పండుగ. అయితే ఇది వ్రతకల్పాలలో కనబడదు. "దేశమంతటను జరుగు ఈ వ్యవసాయ ప్రారంభనాటి పూజను వ్రతగంథకారులు ఎందులకో తెలుపలేదు. హేమాద్రి మొదలగువారు జేష్ఠ్యశుద్ధపూర్ణిమనాడు వట సావిత్రి వ్రతమును తెలిపినారు.... సకల జీవాధారమును సస్యఫలాధారమును నగు ఈ పండుగ పరిగణింపబడలేదు" అని రామచంద్రగారు వాపోయారు. బ్రాహ్మణులకు సంభావనలు ముట్టని అసలు సిసలు గ్రామీణోత్సవాలను హేమాద్రివంటివాళ్ళు ఎందుకు పరిగణిస్తారు?

మన పండగలను, పబ్బాలను పరిశీలిస్తే రామాయణానికి అవి ఎంత ముడిపడ్డాయో తెలుస్తాయి.

# "ఇంటికి జ్యేష్ఠ, పొరుగుకు శ్రీమహాలక్ష్మి"

వ్రతకల్పాలలో పేర్కొనకపోయినా గృహ్య సూత్రాలలో "సీతాయజ్ఞం" గురించి కనబడుతుంది. అయితే ఇది మన రైతులు సాగే ఏరువాక మాత్రం కాదు. దీనిని పొలంలో చేస్తే మంచిదేగాని మరెక్కడయినా చేయవచ్చు. తుడిచి పేడ కళ్ళాపు జల్లి అలికినచోట హోమాగ్నిని నిలిపి దర్భలూ, ధాన్యపు కంకులూ అగ్ని చుట్టూ విదిలించి పక్వాన్నాన్ని హవిస్సుగా కుశదర్భలపైన అర్పిస్తారు.

ఈ యజ్ఞంలో ఇంద్రుడిని, ఇంద్రుడి భార్య అయిన సీతను, పృథ్వీ దేవి అయిన ఉర్వరను మంత్రాలతో "స్వాహా" కారాలతో పూజిస్తారు. సీతతోపాటు యాగదేవతకు, శమ (స్వామిభక్తికి చిహ్నమైన దేవత)కు భూతి (సంక్షేమ దేవత)కి హవిస్సును అర్పిస్తారు. పారస్కర గృహ్య సూత్రాల (2-17)లో చెప్పిన ఈ సీతా యజ్ఞం కర్షకుల ఏరువాక కాదు. ఇది కేవలం సమంత్రకమైన వైదిక కర్మకాండ. యజ్ఞానంతరం బ్రాహ్మణులను తృప్తిపరచాలని ఒకటికి రెండుసార్లు శాసించారు. (2-17-19)

పారస్కర గృహ్యసూత్రాలవల్ల కొన్ని ముఖ్యమైన విషయాలు తెలుస్తాయి. సీత ఇంద్రుని భార్య. సీతతోపాటు ఉర్వరను కొలవాలి. (నాగేటిచాలు భూమినుంచే వస్తుంది కనుక.) ఆ ఉర్వర అశ్వ సంపద, గో సంపద, ఆనంద సంపదకు ఆలవాలమైన ఉర్వర, సకల జీవాధార మైన దేవత. ఆమె నూర్పుడు కళ్ళాలను మాలికలాగ ధరిస్తుంది. ఉర్వర మహా మాతలాగ ఇక్కడ కనబడుతుంది.

సంస్కృతంలో మహా మాత అన్న పదమే తెలుగులో చెప్పాలంటే పెద్దమ్మ అవుతుంది. మన గ్రామీణులు పెద్దమ్మనే ఆరాధిస్తారు. జాతరలు చేస్తారు. దున్నపోతులను, మేకలను. గొర్రెలను బలి చేస్తారు. ఈ పెద్దమ్మనుంచే ఇతర దేవతలు ఉద్భవిస్తారు. అందుకే "అమ్మలగన్న యమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పెద్దమ్మ" అని బమ్మెర పోతరాజుగారు ప్రార్థించారు. ఈ పెద్దమ్మే మళ్ళా సంస్కృతంలో జ్యేష్ఠాదేవిగా మారింది.

గ్రామ దేవతలను క్షుద్ర దేవతలను చేసి- చిన్నచూపు చూసే ఆర్యులు జ్యేష్ఠాదేవిని ''లక్ష్మి''గా పరిగణించి, ఆమెను దారిద్ర్యానికి అధి దేవతను చేశారు. "జేష్ట" అన్నది ఒక తిట్టుగా మారేటంత హీనస్థితికి ఆ దేవతను దిగజార్చారు. అయితే, పూర్వకాలంలో జ్యేష్ఠాదేవిని ఆరాధించేవారు. బోధాయన గృహ్య సూత్రాలలో ఒక అధ్యాయం పూర్తిగా జ్యేష్ఠాదేవి పూజకే కేటాయించారు.

క్షీరసాగర మథనంలో లక్ష్మీదేవి కన్నా ముందు జ్యేష్ఠాదేవి ప్రభవించింది. ఈమె నెవరూ స్వీకరించడానికి ముందుకు రాకపోతే కపిలుడు పరిగ్రహించాడు. అందుచేత జ్యేష్ఠాదేవిని కపిల పత్ని అంటారు. లింగ పురాణం దుస్సహుడనే ముని ఈమెను పెళ్ళాడినట్లు చెబుతుంది గానీ గృహ్య సూత్రాలలో "శ్రియైనమః జ్యేష్ఠాయై నమః కపిలపత్న్యై నమః" అని (బోధా 3-9-4) ఉంది. కనుక జ్యేష్ఠాదేవి కపిలుడి భార్యే. బ్రహ్మాండ పురాణం ప్రకారం కపిలుడు విష్ణుమూర్తి అవతారమే (93 వ అధ్యాయం) భారతం అనుశాసన పర్వంలో ఒకచోట (149 వ అధ్యాయం.) కపిలుడు అనే మాట విష్ణువుకు పర్యాయపదం అని ఉంది. మరొకచోట శివుడికి పర్యాయపదమైంది. (అధ్యాయం 17.) కపిలుడే భారతీయ దర్శనాలలో ఆద్యమైన సాంఖ్యయోగాన్ని ప్రవచించిన ఆచార్యుడు. అతడికి భార్యగా పేర్కొనబడ్డ జ్యేష్ఠాదేవి అత్యంత ప్రాచీన దైవతం.

ప్రపంచంలోని అన్ని జాతులూ సంతానాభివృద్ధి కోసం, భూసారం కోసం మట్టితో మాతల బొమ్మలను చేసి ఆరాధిస్తారు. ఈ బొమ్మల్లో

స్తనాలు, పొట్టా, తొడలూ కొంచం భారీ సైజులో ఉంటాయి. జ్యేష్ఠాదేవి విగ్రహం కూడా ఇలాగే ఉంటుంది. జ్యేష్ఠాదేవిని కూడా బిడ్డల కోసం ఆరాధిస్తారు. భాద్రపద శుద్ధ అష్టమినాడు జ్యేష్ఠా నక్షత్రం సంభవిస్తే మృతవంధ్యలు (పిల్లలు పుట్టి చచ్చిపోవడం వల్ల గొడ్రాళ్ళయినవాళ్ళు) కాక వంధ్యలు (ఒక బిడ్డ పుట్టాక మళ్ళీ నెలతప్పనివాళ్ళు) దోష పరిహారార్థం జ్యేష్ఠాదేవిని పూజిస్తారు. ఆగమ గ్రంథాల్లో వివరించిన ఆమె వర్ణన ప్రకారం జ్యేష్ఠాదేవికి రెండు చేతులూ రెండు కన్నులూ మాత్రమే వుంటాయి. ఆమెవి పెద్ద ఉబ్బెత్తు చెక్కిళ్ళు. ఆమెకు నాభివరకు వేలాడే పీన స్తనాలూ, వదులైన పొట్టా, బలిసిన తొడలూ, ఎత్తయిన ముక్కూ, వేలాడే అడుగు పెదవీ ఉంటాయి. ఆమెది కారు నలుపు రంగు. కుడి చేతిలో నీలోత్పలం ఉంటుంది. ఎడమ చెయ్యి తొడమీద ఆనుకొని ఉంటుంది.

జ్యేష్ఠాదేవికి కుడిపక్క నందికేశుడు లాంటి ఒక మగ విగ్రహం ఉంటుంది. ఇతడు దండధరుడు. ముఖం వృషభ ముఖం, శరీరం మానవ శరీరం. దీనికి ఎడమ పక్క ఒక అందమైన స్త్రీ విగ్రహం ఉంటుంది. ఆమె చూడచక్కని చనుకట్టుతో పడుచుతనం ఒప్పారే సౌందర్యవతి. విగ్రహానికి కుడి ఎడమల ఉండే ఈ స్త్రీ, పురుషులు జ్యేష్ఠాదేవి కన్న బిడ్డలు. అయితే ఈ స్త్రీ, పురుషులు ఉత్తరోత్తరా సీతగా, హనుమంతుడుగా పరిణామం చెందిన ఆదిమ దైవతాలు అని భావించడానికి ఆస్కారముంది.

జ్యేష్ఠాదేవిని సీతాయజ్ఞంలో పూజించే ఉర్వరగా భావిస్తే ఆమెతో పాటు హవిస్సులు అందే శమ (స్వామిభక్తికి చిహ్నం), సీత (భూమి) జ్యేష్ఠాదేవి ఇరుప్రక్కలా వుండడంలో ఆశ్చర్యంలేదు. అయితే జ్యేష్ఠాదేవికీ, రామాయణగాథకి ఏమిటి సంబంధం అన్న ప్రశ్న ఉదయిస్తుంది. సంబంధం ఉన్నది. జ్యేష్ఠాదేవిది కాక లాంఛనం. ఆమె వాహనం గాడిద.

వాల్మీకి రామాయణంలో కాకాసురుడి ప్రసక్తి ఒక్కసారే కాని, ఇతర దేశాల రామాయణాల్లో పలుమార్లు కాకి కనబడుతుంది. మలేసియా రామాయణంలో దశరథుడి పాయసాన్ని దొంగిలించి రావణుడికి

కాకాసురుడే ఇస్తాడు. విశ్వామిత్రుడి యాగాన్ని కాకులే పాడు చేశాయని కంబోడియా రామకథ చెప్తుంది. తాటక పేరు కాకానాసూన్ ఆమెది కాకి తల. దండకారణ్యంలోని ఋషులను ఈ కాకమ్మ బాధపెట్టేది. ఈ తార్కాణాలన్నింటివల్ల జ్యేష్ఠాదేవికి ఆదిమ రామకథలతో సంబంధం వున్నదని చెప్పవచ్చు.

ఇక జ్యేష్ఠాదేవి వాహనమైన గాడిదకూడా రామాయణంలో చాలా ప్రాముఖ్యం గలదే. ఉత్తర హిందూదేశంలో గుప్త సామ్రాజ్యపు కాలం నుంచీ రావణుడిని గాడిద తలతోనే శిల్పాలలో చూడవచ్చు. సీతను రావణుడు గాడిదల రథంపైనే ఎత్తుకుపోయాడు. ఓడిపోయినవారి చిహ్నాన్నే మన దేవతలకు వాహనాలను చేస్తారు. గార్దభ లాంఛనులైన రావణ వంశం వారిని జ్యేష్ఠాదేవి ఓడించడంవల్ల గాడిద ఆమె వాహనమైంది అని నా ఉద్దేశం. నేను ఊహిస్తున్న ఈ విషయాలపై ఇంకా విపులమైన పరిశోధన అవసరం.

ఏది ఏమైనా జ్యేష్ఠాదేవిని శాక్తేయులు చులకన చేయలేదు. తన అష్టతత్త్వాలను ప్రదర్శించడానికి పరాశక్తి రూపొందిన అష్టవిధ దేవులలో జ్యేష్ఠాదేవి జలరూపిణి అని సిద్ధాంత సారావళిలో త్రిలోచన శైవాచార్యుడు విశదం చేశాడు. ఇది దేవియొక్క ద్వితీయ రూపం. మార్కండేయ పురాణంలో కూడా మహామాయ ఎత్తిన రెండవ అవతారం. పేరు మహిషాసుర మర్దని. ఈమెనే మహాలక్ష్మిని చేశారు. శైవాగమాలలో దేవి రెండవ రూపమైన జ్యేష్ఠాదేవి పురాణాలలో లక్ష్మి అయింది. ఉర్వర అయిన జ్యేష్ఠాదేవికి పుట్టడంవల్లా, మహాలక్ష్మి అంశవల్ల ప్రభవించినందువల్లా లంకలో పుట్టి అయోధ్య మెట్టిన సీతను "ఇంటికి జ్యేష్ఠా పొరుగుకు శ్రీమహాలక్ష్మి" అయిందని మనవాళ్ళు భావించి, ఈ సామెతను పుట్టించి ఉంటారు. (ప్రతి సామెత వెనక బోలెడంత కథ ఉంటుందని మనం విస్మరించకూడదు.) జ్యేష్ఠాదేవి అయినా, లక్ష్మీదేవి అయినా సీత పూజనీయురాలే అయింది.

ఇన్ని విధాల పూర్వగాథలున్న సీత రాముడికి ఏమౌతుందో విశ్లేషణ చేసి చూద్దాం.

ముడి పెట్టడంవల్ల భారతీయులకు రామాయణంపై ఎంతటి భక్తి ఉందో తెలియచేస్తుంది. అయితే వాస్తవానికి ఈ పండుగలకూ రామాయణానికి సంబంధంలేదు. మన పండుగలూ పబ్బాలూ ఆదిలో ప్రకృతి శక్తులనూ, పితృదేవతలనూ శాంతింపచేయడానికి ఉద్దేశించిన వ్రతాలే. ఉదాహరణకు దీపావళిని తీసుకుందాం.

దీపావళి అయిదు రోజుల పండుగ. ఆశ్వయుజ బహుళ త్రయోదశిని యమ త్రయోదశి అంటారు. ఆనాడు యమదీపం పెడతారు. దీనివల్ల యముని అనుగ్రహం లభిస్తుంది. చతుర్దశినాటి తెల్లవారుఝామున నరక భయ నివారణ కోసం తలంటు పోసుకోవాలి. అమావాస్యనాటి ప్రదోష కాలంలో పితృదేవతలకు దారి చూపడానికి కొరువులు తిప్పాలి. కార్తీక శుద్ధ పాడ్యమినాడు బలిచక్రవర్తిని పూజించాలి. శుద్ధ విదియనాడు చెల్లెలి ఇంటిలో భోజనం చేయాలి. దీనిని యమ ద్వితీయ లేక భ్రాతృ ద్వితీయ మంటారు. యముడు తన చెల్లెలు యమున యింట భుజించాడు. (ఈ అన్నా చెల్లెళ్ళ అనుబంధాన్ని గుర్తు ఉంచుకోవాలి. ఇందులో రామాయణ రహస్యాల వ్యాఖ్యానానికి కిటుకులు ఉన్నాయి.) మొత్తంమీద దీపావళి పెద్దలకు పెద్ద పండుగేకాని నరకాసుర వధను కీర్తించడానికి చేసే పండుగ కానేకాదు.

దీపావళిలాగే రక్షాబంధన పండుగ కూడా రామాయణ రహస్యాలను అర్థం చేసుకొనడానికి తోడ్పడే పర్వదినమే. ఆనాడు తోడబుట్టిన పడుచులు అన్నదమ్ముల చేతులకు రక్షా పొట్లాం కడతారు. ఆదిలో ఇంద్రుడి చేతికి అతడి భార్య ఈ రక్ష కట్టింది.

ఋగ్వేదంలోని ఇంద్రుడే రామాయణంలోని రామచంద్రుడుగా మారాడని ఈ వ్యాస పరంపరలో గమనించాము. ఇంద్రుని భార్య అయిన సీత రామాయణంలోని సీత అయింది. ఋగ్వేదకాలం నాటికి భారతదేశంలో బౌద్ధుల పూర్వీకులో జైనుల పూర్వీకులో ఉండేవారు. అప్పుడు రామాయణ కథాబీజాలైన గాథలను కొన్నింటిని గాయకులు పాడుతూ ఉండేవాళ్ళు.

ఆనాటి స్త్రీ పురుషులు ఆలుమగలు కావడానికి ఏ అర్హతలు, ఏ రక్త సంబంధాలు అవసరమో ఆ చుట్టరికమే సీతారాములకు ఆనాటి కథకులు ఆపాదించారు.

జైనుల మొట్టమొదటి తీర్థంకరుడు ఋషభనాథుడు మార్చే దాకా కవల పిల్లలుగా పుట్టే స్త్రీ పురుషులే ఆలుమగలుగా కాపరం చేసేవారు. అందుకే సీతారాములు బౌద్ధ జాతక కథలో ఏకోదరులయ్యారు. ఈ విడ్డూరమైన ఆచారం హిందూమత వ్యతిరేకులైన జైన బౌద్ధుల అభూత కల్పన అని కొట్టిపారవేయకూడదు. మన అష్టాదశ పురాణాలలో ముఖ్యమైన మార్కండేయ పురాణంలో కూడా ఈ ఆచారాన్ని స్పష్టంగా చెప్పారు.

దక్షవర్గంలో దక్షప్రజాపతి తన ఇరవై నలుగురు కుమార్తెలను ఎవరెవరికిచ్చి వివాహం చేశాడో, వాళ్ళకు ఎవరెవరు జన్మించారో చెప్తూ- అధర్మునికి హింసకు అనృతుడనే కొడుకూ, నిరృతి అనే కూతురు పుట్టి దంపతులయ్యారు. కొన్నాళ్ళకు వాళ్ళకు భయుడూ, మాయా నరకుడూ వేదనా అనే మిధున ద్వయాలు పుట్టారు. మాయా నరకులు దంపతులయ్యారు. భయుడూ, వేదనా దంపతులయ్యారు అని విశదం చేసింది. (మారనగారి మార్కండేయ పురాణం : 4-62.) దీనివల్ల ఈ అత్యంత ప్రాచీన ఆచారాన్ని ఒక్క జైనులేకాక వైదికార్యులు కూడా గ్రంథస్థం చేశారని రూఢి అవుతుంది. ఆ ఇతిహాసపు విభాత సంధ్యా కాలంలో కవలలైన అన్నా చెల్లెళ్ళు భార్యాభర్తలై కాపురం చేయడం సదాచారం కనుక సీతారాములు అన్నాచెల్లెళ్ళయి దంపతులైనారంటే ఆకాలపు వాళ్ళకు ఎబ్బెట్టుగా అనిపించలేదు.

ఒకే తల్లికి పుట్టిన అన్నాచెల్లెళ్ళు పెళ్ళి చేసుకొనడం ఋషభ నాథుడికి ఎబ్బెట్టు అనిపించింది. అందుచేత వివాహ ధర్మాలలో సంస్కరణ ప్రవేశపెట్టాడు. ఒకే తల్లికి పుట్టినవాళ్ళు కాక, ఒకే తండ్రికి వేరు వేరు స్త్రీలకు పుట్టిన సవతి అన్నాచెల్లెళ్ళు వివాహం చెసుకోవాలని ఋషభనాథుడు ఆదేశించాడు. తాను ఆ విధంగానే తన బిడ్డలకు పెళ్ళిళ్ళు

చేయించాడు. ఇది సదాచారమైంది. దీని ప్రకారం సీతారాములు చుట్టరికాన్ని సంస్కరించవలసి వచ్చింది.

అందుకే సీత దశరథుడికీ, మండోదరికీ పుట్టిన కన్యగా లావోస్, థాయ్‌లాండు మొదలైన రామాయణాల్లో కల్పనలు కనబడతాయి. ఇందువల్ల సీతారాములు అన్నాచెల్లెళ్లేగాని ఏకోదరులు కారు. సంఘంలో వచ్చిన సంస్కరణ సనాతన గాథలో కూడా వచ్చింది. ఏకోదరులైన అన్నాచెల్లెళ్ళ సంబంధం తప్పు అని గుర్తు చేయడానికే యమ ద్వితీయ, భ్రాతృ ద్వితీయ అనే పర్వదినం కార్తీక శుద్ధ విదియనాడు జరుపుతారు.

ఋగ్వేదంలో యముడు - యమి ఒక తల్లి బిడ్డలు, కవలలు. యమి సంతానాభివృద్ధికోసం, వంశవిస్తరణ కోసం తన సోదరునితో లైంగిక సంబంధాలు పెట్టుకొందామని చూస్తుంది. యముడు అది అక్రమమని వారిస్తాడు. రాగల యుగాలలో తోడపుట్టు పడుచులు సోదరుణ్ణికాక, అన్యులను భర్తగా వరించగలరని చెప్తాడు. అందువల్ల "ఓ సుభగా! నన్ను తప్ప ఇతరుణ్ణి భర్తగా ఎంచుకో. నీ హస్తాల్ని అతనికే తలగడ కావించు. వృక్షాన్ని లత పెనవేసుకున్నట్లు అతనిని ఆలింగనం చేసుకో, అతని అనురాగం తీసుకో. సంతోషకరమైన దాంపత్యం చేయండి" అని హెచ్చరిస్తాడు. (ఋగ్వేదం దశమ మండలం ప్రథమానువాదం పదవ సూక్తములోని పద్నాలుగు ఋక్కులూ యమ-యమి సంవాదమే.)

ఆనాటినుంచీ యమ-యమీ భార్యాభర్తలుగా గాక అన్నాచెల్లెళ్ళ లాగ మమకారంతో వున్నారన్న విషయాన్ని లోకులకు జ్ఞాపకం చేయడానికే "భాతృ ద్వితీయ" పండుగనాడు సోదరుడు సోదరి ఇంట భుజించాలనే నియమం పెట్టారు. రక్షాబంధనం రోజున భార్యగా కాక సోదరిగా రక్షాబంధం కట్టాలని, అదే శ్రేయస్కరమని నిర్ణయించారు. కాలక్రమాన సోదరి రక్షా బంధనం కట్టడం ఆచారమైంది.

ఒక తండ్రి బిడ్డలైన అన్నాచెల్లెళ్ళు వివాహం చేసుకోవడం కూడా కొన్నాళ్ళకు అవాంఛనీయమైంది. ఆచారంలో మార్పులు వచ్చాయి. సీతారాముల సంబంధంలో మార్పులు వచ్చాయి. మండోదరి దశరథుని

భార్యకాక కేవలం రావణుని భార్యే అయింది. ఈమెకే సీత పుట్టిందన్న సవరణ ప్రవేశించింది. అయితే పాత కథ తెలిసినవాళ్ళు దీనిని అంగీకరించక పోవచ్చు. అందుచేత సీతారాములు ఒకే తండ్రికి పుట్టకపోయినా, ఒకే అంశవల్ల జన్మించారని సర్ది చెప్పడానికి యజ్ఞపురుషుడు ఇచ్చిన పాయసాన్నాన్ని కొంత కాకిచేత తస్కరింపచేసి మండోదరికి ఇప్పింపచేశారు. దీనివల్ల పామూ చావక, కర్రా విరగక ప్రాచీన సత్యం మారువేషం వేసుకొంది.

మరికొంత కాలానికి సపిండ సగోత్రిక వివాహాలు నిషిద్ధాలు అయ్యాయి. అందుచేత కాకి ఎత్తుకుపోయిన పాయసం కథ కంచికి పోయింది. సీతారాములు ఒకే పాయసాన్నంవల్ల జన్మించారన్న కల్పనకు కూడా అవసరము లేకపోయింది. అందుచేత సీత లంకలో పుట్టింది గాని మండోదరి కడుపున పుట్టనే లేదన్నారు. ఆ మాట కొస్తే ఎవరి కడుపునా పుట్టలేదు. ఆమె అయోనిజ అన్నారు. ఇప్పటికి సీతారాములకు ఈనాటి సంఘం ఒప్పుకొనే వాని వరుసలు ఏర్పడ్డాయి.

వాల్మీకి రామాయణంలోను, ఇతర వైదిక రామాయణాలలోను రాముడు దశరథాత్మజుడిగా, సీత జనకజగా ప్రఖ్యాతులయ్యారు గనుక అంతకు ముందున్న రామకథలోని చుట్టరికాలు జనానికి విడ్డూరంగా కనబడి, వాటిని అభూత కల్పనలుగా కొట్టిపారేయడం దాకా వచ్చింది. అంతేకాదు, వాల్మీకి రామాయణంలో సత్యాలే వెగటు అనిపిస్తే వాటిని నమ్మని స్థితికూడా వచ్చింది. ఉదాహరణకు వాల్మీకి రామాయణంలోనే రాముడికి సీతకాక ఇతర భార్యలు కూడా వున్నారనే ధ్వనులు వుంటే వాటిని లోకులు ఒప్పుకోరు. ప్రజల దృష్టిలో రాముడు ఏకపత్నీవ్రతుడు. అందుచేత ఆ ధ్వనులన్నీ ప్రక్షిప్తాలైనా కావాలి లేదా దుష్టవాక్యాలైనా కావాలి.

వాల్మీకి తన కాలంనాటి ఆచార వ్యవహారాలను సీతా రామలక్ష్మణులచేత చెప్పించాడు. అన్నపోతే వదినను మరిది కట్టుకోవలసిన కాలంలో వాల్మీకి తన కావ్యం రాశాడు. అలాగే భర్త వదిలివేసిన ఆడది మరిదితో

నైనా, మరెవరితోనైనా వుండవచ్చు. అందుచేత అగ్నిపరీక్ష సమయంలో రాముడు సీతను చూసి లక్ష్మణ భరతులలో ఏ ఒకరి దగ్గరైనా లేక సుగ్రీవ విభీషణులలో ఏ ఒకరి దగ్గరైనా ఆమెకు ఎక్కడ సుఖంగా వుంటే అక్కడ ఉండమంటాడు. (యుద్ధ 1/8-22,23.) రాముడి ఉద్దేశం ఏదైనా, వ్యాఖ్యానంచేసే భక్తులు లక్ష్మణాదులు పుత్ర సమానులు కాబట్టి వాళ్ళదగ్గర సీతను వుండమన్నా డంటారు.

అందువల్ల స్పష్టమైన దేమంటే- ప్రజానీకం తమ ఉమ్మడి మనసులో సీతారాములు ఏ విధంగా వుండాలని ఆయా యుగాలలో యుగ ధర్మాన్నిబట్టి భావిస్తే ఆ విధంగానే సీతారాములు వుంటారు. వాళ్ళు ఆదర్శ పాత్రలు, ఆరాధ్యదైవాలు. వర్ణ వ్యవస్థ తెచ్చిపెట్టిన అనైక్యతను తొలగించి ఆదిమ సమాజంలోని సంఘీభావాన్ని సీతారాముల భజన ప్రజలకు కలుగజేస్తుంది. ప్రతి గ్రామంలో వుండే భజన మందిరంలో ఈ సమైక్యత గోచరిస్తుంది. కట్టమంచి రామలింగారెడ్డిగారు హిందూ మత పరిణామంలో భజన కూటాల ప్రాముఖ్యం గురించి చెప్పినమాటలు గమనించదగ్గవి:

"హిందూ భజనలలో విశేషాంశము లెవ్వి? ఒకటి, ఇందారాధింప బడు దేవతలు ప్రజాసామాన్యము యొక్క హృదయము నాకర్షించిన రాముడును, కృష్ణుడును, వీనిలోను రామమందిరములే యెక్కువ. ఈ దేవతలు మనుష్యుల వంటివారు. మనయొక్క సుఖదుఃఖముల ననుభవించి యెరిగినవారు! జన్మమునందును అగ్రులుగారు. ఒకడు క్షత్రియుడు. ఇంకొకడు శూద్రుడు కాబోలు! రెండు - పూజా విధానము జనులందరు కలసిచేయు సంకీర్తనము. అర్చనలు, అభిషేకములు లేవు. క్రియలు కర్మలు లేవు; వైదిక సంప్రదాయము లేమాత్రము లేవు. వేదములయొక్క వాసన యిందు ముక్కు నెంత నలిపినను దొరకదు; పూజారులు లేరు. ఇది సామాన్య ప్రజల కనుకూలించిన పూజ. మరియు సమష్టిగా సంఘముచే చేయబడు పూజ...భజన మందిరములో మూలస్థానము, మాలస్థానము అని స్థలాంతరములు లేవు. అందరూ

సమానముగా కూర్చుందురు.... మరియు దేవుడిచట పతివ్రతవలె నంట రానివాడు కాడు. అందరును దేవుని పటమును సమీపించి పూలహారముల స్వహస్తములతో వేయవచ్చు. ధూప దీపాదులు సమర్పింప వచ్చును. సమరిను........ గుళ్ళలో కర్మకాండ వాసన ప్రబలివున్న గుళ్ళకు కేవల మనుబంధ ప్రాయమైనది కాదు భజనకూటము, దానికి కొంతవరకు విరుగుడు వంటిది.''

సమాజంలోని కొన్ని చారిత్రక అవసరాలవల్ల భక్తి మార్గం ప్రబలమెంది. భక్తులున్నంత కాలం సీతారాములు వుంటారు. భక్తులు ఏమౌతుం దనుకుంటే సీత రాముడికి అదే అవుతుంది.

# సంప్రతించిన గ్రంథాలు

## సంస్కృత గ్రంథాలు :

ఋగ్వేదము

ఆనంద రామాయణము

గృహ్య సూత్రములు 1. బోధాయన
2. పారస్కర

దేవీ భాగవతము

మహాభారతము

లలితా సహస్ర నామములు

వాల్మీకి రామాయణము

విష్ణు పురాణము

హరివంశము

ఇంగ్లీషు గ్రంథాలు :


| | |
|---|---|
| Aarson, K.C. | Hanuman in Art and Mytho-logy. |
| Borodia, U.D. | History and Literature of Jainism. |
| Bhattachara Harisatya, Dr. | Narayanas Pratinarayanas and Balabhadras. The Jain Antiquary Vol. 8. No. 1. |
| Briffaluts Robert | The Mothers. London 1952. |
| Chattopadhyaya Debiprasad | Lokayata, New Delhi, 1959. |
| Gopinadha Rao, T.A. | The Elements of Indian Iconography Vol. I. Part II. |
| Jacobi, Herman, Dr. | Das Ramayana (translated by Dr. S.N. Ghosal) Baroda. |
| Johnson, Helen M. Dr. | Trisasti - salaka - purusha-Charitra of Hemachandra (translated into VI Vols.) Gaekwad Oriental Series. |
| Kabadia, H.R. | The Ramayana and the jaina writers. Journal of the Orien-tal Institute, Baroda. Vol. 1. (1951-52) |
| Krishna Sastri, H. | South Indian Images of Gods and Goddesses. |

| | |
|---|---|
| Kosambi. D.D. | Myth and Reality. Bombay, 1926. |
| Kulkarni, V.M. | The Ramayana version of Sangha Dasa as found in the Vasudeva Hindi. Journal of Oriental Institute. Vol. II. |
| Macdonell, A.A. and Keith. A.B. | Vedic index of Names and Subjects (in 2 Vols) London, 1912. |
| Mani Vettam | Puranic Encyclopedia, Delhi, 1975. |
| Narasimhachar, D.L. | The Jaina Ramayana, Indian History Quarterly— Calcutta, XV 1939. |
| Raghavan, V. Dr. | The Greater Ramayana, Varanasi, 1973. |
| — | The Ramayana in Greater India, Surat, 1975 |
| Raghu Vira (Ed.) | Ramayana in China, 2nd Ed. Nagpur, 1955 |
| Sen. Dineschandra | The Bengali Ramayanas. Calcutta, 1920. |
| Vidya, C.V. | The Riddle of Ramayana. |

## తెలుగు గ్రంథాలు :


కృష్ణశ్రీ (సంకలనం) — స్త్రీల రామాయణపు పాటలు, ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రచురణ హైదరాబాద్ - 1955.

గంగాధరం నేదునూరి (సంకలనం) — మినేరు, ప్రాచీన గ్రంథావళి, రాజమండ్రి - 1968.

దొణప్ప, తూమాటి, ఆచార్య — జానపద కళా సంపద, నిర్మలా పబ్లికేషన్స్, విశాఖపట్నం - 1975.

ప్రతాపరెడ్డి, సురవరం — రామాయణ విశేషములు, ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాద్-1957.

,, — జైన రామాయణము (సారస్వత వ్యాసములు రెండవ సంపుటిలో ప్రచురితం), ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్-1969.

రామచంద్ర, తిరుమల — హిందువుల పండుగలు - పర్వములు. బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు, మద్రాసు-1960.

రామలింగారెడ్డి, కట్టమంచి — వ్యాస మంజరి, ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు-1942.

సత్యనారాయణచౌదరి, కొత్త — రామాయణ రహస్యాలు, భాషా పోషక గ్రంథ మండలి, నిడుబ్రోలు-1968.

సూర్యనారాయణశాస్త్రి, మల్లాది — సంస్కృతవాఙ్మయ చరిత్ర-ద్వితీయ సంపుటం, ఆంధ్ర సారస్వత పరిషత్, హైదరాబాద్-1961.